శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

## పండ్రెండవ సంపుటము

శ్రీ చాగంటి శేషయ్యగారు

గ్రంథకర్త




హిందూ ధర్మ శాస్త్ర గ్రంథ నిలయము
కపిలేశ్వరపురం - తూర్పు గోదావరి

ఆంధ్రకవితరంగిణి ముద్రణమునకు విరాళము లొసంగిన

## భాషాభిమానులు



### రాజపోషకులు:

శ్రీ బలుసు బుచ్చిసర్వారాయఁడు జమీందారు వారు, కపిలేశ్వరపురం
కేశవకుర్తి ఎస్టేట్లు, కపిలేశ్వరపురం.

### ప్రధానపోషకులు:

శ్రీ చిక్కాని వెంకటరత్నంగారు, భూస్వామి, మాజీమంత్రి,
రామచంద్రపురం కోఆపరేటివు సెంట్రల్ బ్యాంకి అధ్యక్షులు, చోడవరము

### పోషకులు:

శ్రీ బలుసు బుచ్చిపట్టాభిరామయ్యగారి కుమారులు అచ్యుతరామయ్యగారు,
భూస్వామి, కపిలేశ్వరపురం.
శ్రీ మద్దూరి సూరన్నగారు, వర్తకులు, గోపాలపురం.
శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు, భూస్వామి. బుచ్చిరెడ్డిపాలెం.
శ్రీ వాడ్రేవు విశ్వసుందరరావు బహద్దర్ వారు, జమీందారు వేగాయమ్మపేట.

### సహాయులు:

శ్రీ దేశరాజు వేంకటసుబ్బారావుగారు, భూస్వామి, కపిలేశ్వరపురము
శ్రీ పోతాప్రగడ సూర్యనారాయణ గారు, ప్రొప్రయిటరు:
సుజనరంజనీ ప్రింటింగువర్క్సు, రాజమహేంద్రవరము
శ్రీ కట్టికూటి పట్టాభిరామన్న గారు, వునకరమిల్లి యస్టేటు జమీందారు వెల్ల
శ్రీ బండారు చినవెట్టెయ్య అనే రామకృష్ణయ్యగారు భూస్వామి వాడపాలెం
శ్రీ బలుసు వెంకటరామారావుగారి భార్య మాణిక్యంగారు భూస్వామిని,
కపిలేశ్వరపురము
శ్రీ కొరపాటి వెంకటాద్రియుడుగారిభార్య శ్రీమతి సత్యవతమ్మగారు భూస్వా
మిని, కపిలేశ్వరపురము

7 శ్రీ కేసాప్రగడ వేంకటరమణ రాజేశ్వరరావుగారు, భూస్వామి, అన్నంపల్లి
8 , పోతాప్రగడ కృష్ణమూర్తిగారు, ప్రొ॥ మాష్టరుమాన్ ప్రింటర్సు, కాకినాడ
9 , వాడ్రేవు రత్నేశ్వరరావుగారు, భూస్వామి, పసలపూడి
10 , నెక్కంటి దొరయ్యగారు, భూస్వామి, కపిలేశ్వరపురము
11 , నెక్కంటి రామయ్యగారు, భూస్వామి, అసిస్టెంటుయింజనీరు కపి॥పురం
12 , బుద్ధవరపు మహాదేవుడుగారు, బి.ఏ.బి.ఎల్. వకీలు, రామచంద్రపురము
13 , లక్కరాజు సుబ్బారావుపంతులుగారు, అడ్వకేటు, భూస్వామి కాకినాడ
14 , పుప్పాలవారి వెంకటరమణమూర్తిగారు, భూస్వామి, అడ్వకేటు, కాకినాడ
15 , నెక్కంటి జగపతిరామయ్యగారు, భూస్వామి, ప్రొప్రయిటరు రైసుమిల్లు వెదురుమూడి
16 , ఏకా ఆంజనేయులుపంతులుగారు, భూస్వామి గుంటూరు
17 , కె. వెంకయ్యచౌదరిగారు భూస్వామి డివిజనలు ఇంజనీరు కాకినాడ
18 , ఏలూరిపాటి నరసింహస్వత్తో ముఖరాజులుగారు, భూస్వామి, బిక్కవ్రోలు
19 , తురగా పురుషోత్తం పంతులుగారు, ఎమ్. ఎల్. సి. పలివెల
20 , మల్లాడి సత్యలింగం నాయకర్సు చారిటీసువారు, సత్యలింగపురం, కాకినాడ
21 , అయ్యగారి మోహనరావు పంతులుగారు, బి. ఏ. బి. ఎల్. అడ్వకేటు సీతానగరం, విశాఖపట్టణంజిల్లా
22 , రావుసాహెబ్ పట్టమట్ట శేషగిరిరావు పంతులుగారు, ప్రొప్రయిటరు, శారదా ప్రెస్, కాకినాడ
23 , వెంటూరి దొరయ్యగారు, కోటిపల్లి
24 , బొప్పన దొరయ్యగారు, కందులపాలెం
25 , వైట్ల వీర్రాజుగారు, కందులపాలెం
26 , తురగా రామచంద్రరావు పంతులుగారు, ఇన్కమ్‌టాక్సు ఆఫీసరుగారు, మదరాసు
27 , ముక్కవిల్లి వెంకటనారాయణగారు ప్లీడరు రామచంద్రపురము
28 , వాడ్రేవు వెంకప్పారావుగారు, జమీందారుగారు, గానవాయి పేట, రాజమహేంద్రవరము
29 , వాడ్రేవు గోపాలకృష్ణగారు, పిఠాపురము
30 , నేమాని వెంకటనారాయణగారు, బి. కామ్. ఇన్కంటాక్సు ప్రాక్టిషనరు, కాకినాడ
31 , వండూరి వెంకటరమణమూర్తిగారు, వెలమళ్ల
32 , దంటు సూర్యారావుగారు, మర్చంట్సు, కాకినాడ

33 శ్రీ గుండపునీడు జానికిరామయ్యగారు, రామచంద్రపురం
34 ,, మేడవరపు సత్యనారాయణమూర్తిగారు హాసన్ బాదా
35 ,, బండారు పెదవీరయ్యగారు, భూస్వామి, వాడపాలెం
36 ,, మాజేటి హనుమంతరావుగారు, మర్చంటు, గుంటూరు
37 ,, జేశరాజు రామారావుగారు, మర్చంటు గుంటూరు
38 ,, టి. కె. నాగయ్యగారు, మర్చంటు, గుంటూరు
39 ,, గోపాలుని వీరరాఘవయ్యగారు బి.ఎ.బి.యల్. అడ్వకేటు, ప్రెసిడెంటు: బార్ ఎసోసియేషన్, గుంటూరు
40 ,, ఉన్నం వెంకటరామారావుగారు, బి.ఎ.బి.యల్. విశాఖపట్టణము
41 ,, బెండపూడి పేర్రాజుపంతులుగారు, యం. బి. బి. యస్. విశాఖపట్టణము
42 ,, చీమలపాటి గనేశ్వరరావుగారు, సెక్రటరి ది విశాఖపట్టణము ఎలక్ట్రిక్ సప్లయి కార్పొరేషను లిమిటెడ్ విశాఖపట్టణము
43 ,, గుర్వానుల సీతారామమూర్తిగారు, బి. ఎ. బి. ఎల్. విశాఖపట్టణము
44 ,, మాచిరాజు సుబ్బారావుగారు, మేనేజింగు ప్రొప్రయిటరు సిటీ హైస్కూలు విశాఖపట్టణము
45 ,, అయ్యంకి వెంకటరమణయ్యపంతులుగారు విజయవాడ
46 ,, దాట్ల సత్యనారాయణరాజుగారు, బి.ఎ.బి.ఎల్ రాజమహేంద్రవరము
47 ,, ఈదర వేంకటాద్రి పంతులుగారు, ఏలూరు
48 ,, పేర్ల సత్తెయ్యశెట్టిగారు చినవాల్తేరు యస్టేటు, విజయనగరం
49 ,, రాఘుదాసు ట్రాన్సుపోర్టు లిమిటెడ్., కాకినాడ
50 ,, బలుసు సర్వారాయుడుగారు, కపిలేశ్వరపురము
51 ,, మేకా వెంకటాద్రియుడుగారి కు॥ జానికిరామయ్యగారు, కపిలేశ్వరపురం
52 ,, గన్నమని వెంకటసుబ్బారాయుడుగారు, కపిలేశ్వరపురం

అభిమానులు :

1 శ్రీ సైపెండా వెంకటరమణబ్రదర్సువారు, కాకినాడ
2 ,, డాక్టరు నందివాడ సత్యనారాయణరావుగారు, రామచంద్రపురం
3 ,, శ్రీమతి చిగురుపాటి అన్నపూర్ణమ్మగారు, రామచంద్రపురం
4 ,, మరివాడ సూర్యనారాయణమూర్తిగారు, కపిలేశ్వరపురం

## ఏతత్కృ విక్రయితలు :

| | |
|---|---|
| దుర్గేశనందని | నవల |
| నవాబునందిని | ,, |
| విశ్వప్రయత్నము | ,, |
| శ్రీ | ,, |
| రాధారాణి | ,, |
| చంద్రసేనుడు | ,, |
| హిందూలా (సమిష్టికుటుంబము) | |
| మదరాసు లోకలుబోర్డుఆక్టు రెండుసంపుటములు | |
| మదరాసు సహకారసంఘముల ఆక్టు | |
| మదరాసు నూతనగ్రామపంచాయితీ ఆక్టు | |
| ఆంధ్రకవితరంగిణి సంపుటములు | |



# విజ్ఞాపనము



"ఆంధ్రకవితరంగిణి" 12 వ సంపుటమును ఆంధ్రసహృదయులకు సమర్పింపగలిగినందుల కెంతయు సంతసించుచున్నాము. కీ॥ శే॥ శ్రీ చాగంటి శేషయ్యగారు పరమదించిన పిమ్మట మేము ఇప్పటికి ఈసంపుటమునే ప్రకటింప గలిగితిమి. శ్రీ శేషయ్యగారు గ్రంథమంతయు సంపూర్ణముగా రచియించియుండిరి. ధనాభావముచే మేము గ్రంథమంతయు ఒక్కసారిగా ప్రకటింపలేకున్నాము. ఎప్పటివలెనే అవకాశము పురస్కరించుకొని ఒక్కొక్క సంపుటముగా గ్రంథమంతయు ఆంధ్రసహృదయులకు త్వరలో అందింపగలమని ఆశించుచున్నాము. మా ప్రయత్నమును సఫలముచేయు భారము ఆంధ్రప్రజానీకముపైనున్నదని మనవి చేయుచున్నాము. పూర్వమువలెనే శ్రీమంతులు, సాహితీప్రియులు, విశ్వవిద్యాలయాధికారులు మాకు ప్రోత్సాహము నివ్వవలసినదిగా వినయపూర్వకముగా అర్థించుచున్నాము.

తమకు ఎన్నితొందర పనులున్నను, మాపైగల అవ్యాజ ప్రేమాదరములచే ఈసంపుటమునకు తమ అమూల్యమగు పీఠిక దయచేసిన ఆంధ్రచరిత్ర పరిశోధకచక్రవర్తి, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి మా కృతజ్ఞతాపూర్వక నమస్కారము లర్పించుచున్నాము.

ప్రకాశకులు

కపిలేశ్వరపురం
15-8-58



# శ్రీ చాగంటి శేషయ్యగారి

## ఇతర గ్రంథములు:

| | | |
|---|---|---|
| దుర్గేశనందని | నవల రు: | 2—50 |
| నవాబునందిని | ... | 2—50 |
| విశ్వప్రయత్నము | ... | 3—00 |
| శ్రీ | ... | 2—50 |
| రాధారాణి | ... | 0—50 |
| నూతనగ్రామ పంచాయితీలచట్టము (Act 10 of 1950) | | 8—00 |
| ఆంధ్రకవి తరంగిణి | 1 భాగము | 3—00 |
| | 2 భాగము | 3—00 |
| | 3 ,, | 3—00 |
| | 4 ,, | 3—00 |
| | 5 ,, | 3—00 |
| | 6 ,, | 3—00 |
| | 7 ,, | 3—00 |
| | 8 ,, | 3—00 |
| | 9 ,, | 3—00 |
| | 10 ,, | 3—00 |
| | 11 భాగము | 3—00 |



# పీఠిక



మాననీయులైన శ్రీ చాగంటి శేషయ్యగారు బహుగ్రంథ రచయితలు. వారివివఱలో రచించిన దుర్గేశనందని, నవాబునందిని, రాధారాణి మొదలగు నవలలవలన నిదివఱకే సాహిత్యపాఠకలోకమునకు కృతపరిచయులు. చాలకాలము క్రిందటనే వారి యీనవలలు ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలయందు ప్రకటితమై పాఠకహృదయములను చూఱగొన్నవి.

వారు కేవలము నవల రచనతో తృప్తినొంది యుండలేదు. వారిదృష్టి చరిత్రమీదికి ప్రసరించినది. కవుల చరిత్ర సమగ్రమైనది లేనిదే వాఙ్మయ చరిత్రరచన కష్టము. మనభాషలో ఇంతవఱకు కృతికర్తలైన తెలుగుకవులు పదుమూఁడువందలమంది వఱకుండినట్లు వారే తమ కవితరంగిణి మొదటిసంపుటములోని విజ్ఞాపనమునందు తెలిపియున్నారు. వీరిలో చారిత్రములు రచింపబడిన కవుల సంఖ్య మూఁడునందల యేబదిమందికి మించదనికూడ వారే నుడివియున్నారు. పూజ్యులైన శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులు, శ్రీ గురుజాడ శ్రీరామమూర్తి, శ్రీ వంగూరి సుబ్బారావు ప్రభృతులు, కవిచరిత్రములనియో, కవిజీవితములనియో, మఱియొక పేరు పెట్టియో కవులచరిత్రములు వ్రాసినను ఇంకను వ్రాయబడకుండనున్నవనేకము. ఒకవేళ నింతవఱకు వచ్చిన కవుల చరిత్రలు రమారమి అయిదువందలుండునని యనుకొనినప్పటికి ఇంకను చాల చరిత్రములనేకము మిగిలిపోయియే యున్నవనుటకు సందేహము లేదు.

అది యటుండ ప్రతిసంవత్సరమును ఇతర రాష్ట్రములలో వలెనే మనరాష్ట్రమునందును ప్రాచీన తాళపత్రగ్రంథసేకరణార్థము కృషి జరుగుచునేయున్నది. ఏతత్కృషిఫలితముగ ప్రతివత్సరమును ఉత్తమములో, అనుత్తమములో ఏవియో కొన్ని తెలుగుపొత్తములు

బయలుపడుచునేయున్నవి; శతకకర్తలో, యక్షగానకర్తలో, కావ్య రచయితలో ఎవరో కొందఱు తెలుగుకవులు క్రొత్తగా తెలియ వచ్చుచునేయున్నారు. ఈరీతిగా ఆంధ్రకవులసంఖ్యఅనువర్షము పెరుగు చున్నదేకాని యున్నది యున్నట్లున్నైన నిలబడుటలేదు. వీరందఱను పరిగణనములోనికి దీసికొని వారికాలమును, కృతులయోగ్యతను నిర్ణ యించు చరిత్ర వచ్చినపుడు కాని మన సాహిత్యసంపద ఘనత, బాగోగులు తెలియనేరవు; అప్పుడుకాని నన్నయభట్టారకుని నాటి నుండి యనుస్యూతముగ ప్రవహించుచు వచ్చుచున్న ఆంధ్రకవితా [illegible] ఉచ్చపతనములు, మెఱుగుతఱుగులు, గుణావగుణములు కాలానుక్రమముగ నిర్ణయింపలేము.

మఱియొకదృష్టితో చూచినను కవిచరిత్ర రచనావశ్యకత మెంతేనిఁయుగలదు. ఇదివఱలో వచ్చిన కొలదిమందినిగూర్చిన కవి చరిత్రగ్రంథములైనను ఇప్పటికి పెక్కుదశాబ్దముల క్రిందట వ్రాయ బడినవి. ఈకాలములో చరిత్రరచనకు పరమాధారభూతములైన శాసనములు తామ్రీకములు వందలు, శైలికములు సహస్రములు బయలుపడినవి; ఇంకను బయలు పడుచున్నవి. వీనివలన ఇదివఱలో కాలనిర్ణయము విషయమునచేసిన కొన్నిసిద్ధాంతములుమాఱుచున్నవి. ఇదివఱకుచేసిన నిర్ణయములకంటె కొందఱు కవులకాలములు అంతకు పూర్వమునకు నెట్టివేయవలసివచ్చుచున్నది; కొందఱిని ఇటీవలకు తీసికొనిరావలసివచ్చుచున్నది. కొందఱినిగుఱించి ఇదివఱకు ఏమియు తెలియనిది ఇపుడు కొంత తెలిసికొన వీలగుచున్నది. ఈకారణముల వలన శాసనములు కవిచరిత్రపరిశోధనలోనికసోపలములై గ్రంథ ములవలన దెలిసినవిషయములందలి సత్యాసత్యములను తేల్చి యథార్థ విషయములను సప్రమాణముగ నిరూపించుటకు నేడెంతయో యవ కాశముకలదు. ఏతాదృశకారణములే శ్రీ శేషయ్యగారిని మఱల నీ కవిచరిత్ర రచనకు పురికొల్పినవి. ఇంతవఱకు దెలియవచ్చిన ఆంధ్రకవులచరిత్రముల నాయన "క వి త ర ం గి ణి"అను పేరుతో

నిరువది సంపుటములలో రచియించి ప్రకటించుటకు దీక్ష వహించినారు.

వారి రచన లన్నిటిలోను ఈకవితరంగిణీ సంపుటములే వారి జీవిత సాఫల్యమును, వారికి పేరు ప్రతిష్ఠలొనగూర్చునవియునని నా విశ్వాసము. ఇంతవఱకువారు అకుంఠితదీక్షతో పదునొకండు సంపుటములను వెలువరించి యున్నారు. ఈ సంపుటములందలి ప్రతిపుట లోను వారి బహుగ్రంథానుశీలనశీలమును, సదసత్ప్రమాణవివేచనాపటిమయు, పరిశోధనాదక్షతయు, విమర్శాశక్తియు, సత్యానురక్తియు పుష్కలముగ గానవచ్చుచున్నవి. పరంపరాగతముగ దెలియవచ్చు గాథలలోని, వినవచ్చు కట్టుకథలలోని యాథార్థ్యమును నిర్ణయించుటలో ఆయన చూపిన తర్కకౌశలము ప్రశంసాపాత్రమైనది.

సాధారణముగా నిటువంటి గొప్పచారిత్రిక పరిశోధనకృషి కావించుట గొప్ప గ్రంథభాండాగారములు, ఇతర సౌకర్యములు మెండుగాగల మదరాసులోనుండినగాని కష్టసాధ్యము. అట్టిది శ్రీ శేషయ్యగారు కపిలేశ్వరపురములోనుండి తత్సంస్థానవ్యవహారములను చక్కబెట్టుకొనుచు, మద్రాసు వెళ్లుట తటస్థించినపుడేదో యొక విధమున నేదోయొకముహూర్తమున నించుక యవకాశము కల్పించుకొని ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారాదులకుపోయి ఆయాగ్రంథ, శాసనాదులను పరిశీలించి వలసిన విషయమెత్తి వ్రాసికొనియు, ఆంధ్రగ్రంథములను కొన్ని కొనియో సంపాదించియో పఠించియు నింతటి గొప్పపరిశ్రమచేసినారన్న వారిపరిశోధనాసక్తి యెంత తీవ్రమైనదో తెలియగలదు. అటువంటి ఆసక్తి, దీక్షగలవారు తెలుగువారిలో అరుదు. కీ. శే. కపిలేశ్వరపురము జమీన్‌దారుగారగు శ్రీ బలుసు బుచ్చి సర్వారాయనింగారు విశేషశ్రమచేసి నెలకొల్పిన వారి గ్రంథభాండాగారముకూడ వీరికెంతయో యుపకరించినది.

ఈకవితరంగిణి బహుళముగా చరిత్రప్రధానమైనది. ఈవిషయ మాయనయే యంగీకరించినారు. అందువలన ఒక్కొక కవినిగుఱించి గల సర్వవాదోపవాదములు, పరంపరగావచ్చు నైతిహ్యములు వీరి నిశితపరిశీలనమును దాటిపోలేదు. ఒక్క యీసంపుటములను జూచి నచో ఒక్కొక కవినిగుఱించి యిదివఱకు జేయబడిన సిద్ధాంత,రాద్ధాంతములన్నియు నవగతము కాగలవు. ఇంతటి గుణవిశిష్టమయినవగుటచేత వీరి కవితరంగిణీ సంపుటములు ఆంధ్రవాఙ్మయ చరిత్ర పరిశోధకులకును, పాఠకులకును పెన్నిధులవంటివి. ఇటీవలికాలములో ఇంతటి గొప్పపరిశ్రమచేసి, నిజముగా ఒకసంస్థనిర్వహింపవలసినపనినొక్కరు ఒక్కచేతిమీదుగ జేసి ఇన్నిప్రామాణిక చరిత్రసంపుటములు రచించి ప్రకటించుట అశ్రుతపూర్వము. ఇదియెంతయు శ్లాఘాపాత్రమైన గొప్పవిషయము కాని ఆయన తలపెట్టిన ప్రకటనకార్యము సంపూర్తి కాకుండగనే పరమపదించుట ఆంధ్రవాఙ్మయచరిత్రపాఠకుల దురదృష్టము.

ఇంతవఱకు వెలువడిన సంపుటములలో నక్కడక్కడ నెక్కడనైన నేవేని దోషములుండవచ్చును. వారుచేసిన సిద్ధాంతములను కొందఱంగీకరింపకను పోవచ్చును. కొన్నికొన్ని విషయములలో ఆయనకును నాకును భేదాభిప్రాయము లుండవచ్చును. అట్టివానిని గోరంతలు కొండంతలుచేసి నిరసించి తమఘనతను ప్రకటింపజూచుకొనుట అల్పప్రజ్ఞలక్షణము. అట్లని భేదాభిప్రాయమును వెల్లడించగూడదనికాదు; దోషములు చూపించరాదనికాదు; కాని యట్లు చేయుటలో మర్యాద నతిక్రమింపగూడదు; సౌమనస్యమును విడనాడగూడదు. ఏవిద్యలోనైనను వినయవినమ్రతాభివర్ధకములైన పరిణతి పారంగతత్వములే శోభించునవి.

తెలుగు వాఙ్మయాభిమానుల ఆదరాభిమాన, సాహాయ్యములతో నింతవఱకు పదునొకండు సంపుటములు వెలువడినవి. కానైతే శేషయ్యగారు సంకల్పించినరీతిని సంపుటములన్నిటిరచన ముగించియే

యున్నారు. ప్రకటనకావలయుటే మిగిలియున్నది. అందువల్ల శేషించిన సంపుటములను ప్రకటించుబాధ్యత ఆంధ్రవాఙ్మయచరిత్రాభిమానులగు సంపన్నుల, ఉదారహృదయుల యౌదార్యముమీద నాధారపడియున్నది. ఇంతవఱకు సాయపడుచువచ్చిన యుదారులును, తదితరవాఙ్మయాభిమానులునుగూడ నిట్టి సత్కార్యమునకు చేయూతనిచ్చుట ధర్మము. ఇదియు ధర్మకార్యమే. ఇదియు నొకవిధముగ వాగ్దేవీపూజయే. ఒక్కొక సంపుటమునకగు వ్యయము నొక్కొకరు భరించికాని, పదుగురుకలిసి విరాళము లిచ్చికాని యీ సత్కార్యము సాంతమగునట్లు చూడవలసినదని వాఙ్మయపోషకుల నభ్యర్థించుచున్నాను.

ఈ పండ్రెండవ సంపుటమునుగుఱించి ప్రత్యేకముగ జెప్పవలసినయావశ్యకత యేమియులేదు. ఇందలి రచనావిధానమంతయు నింతవఱకువచ్చిన కవితరంగిణీ సంపుటములలోని నూదిరిదే. ఈ పండ్రెండవ సంపుటములోని కవులందఱుపదునేడవశతాబ్దముననుండినవారే. ఇం దింతవఱకు తెలియని క్రొత్తకవులెందఱొ చరిత్రములో పొందుపఱుపబడినవి. ఈసంపుటముకూడ వాఙ్మయచరిత్రపాఠకుల కత్యంతోపయోగకరముగ నుండుననుటకు సందేహములేదు.

శ్రీ శేషయ్యగారి నిదివఱకే వాఙ్మయాభిమానులీ సంపుటములలో కవులచరిత్రముతో బాటు తత్కృత కావ్యవిమర్శయు, అందలి కవితావిశేషములు మున్నగునవికూడ వ్రాయవలయునని సూచించియున్నారు. దీనికివారు తమమైదవ సంపుటమునందలి విజ్ఞాపనమున ప్రత్యుత్తర మిచ్చియేయున్నారు. ఈకవితరంగిణీ సంపుటములయందు "కవులయొక్కయు, వారి నాదరించిన కృతిపతులయొక్కయు చారి

త్రిములను మాత్రిమే'' రచింపవలెనని వారియుద్దేశము. అయినను పలువురుసూచించిన "యట్టివిషయములను జేర్చుచు ఆంధ్రకావ్య తరంగిణియను పేర నొకమాలగా కొన్నిసంపుటములను ప్రకటింప సంకల్పించుకొని అందులకై ప్రియత్నించుచుండి''నట్లు కూడ వారే పదునొకండవ సంపుటపు విజ్ఞాపనమునందు తెలిపియున్నారు. కాని తెలుగుదేశము దురదృష్టవశమున తత్సంకల్ప మీడేరకమునుపే ఆయన పరలోకగతులగుట విషాదకరము. ఆయన యాశయమును సఫలీకృతముచేసి ఆయన కుమారులు, ముఖ్యముగా శ్రీ గోపాలకృష్ణ మూర్తిగారు పితౄణమును దీర్చుకొనుట లగ్గని సూచించుచున్నాను.

శాలివాహన శకము 1880;
విలంబి, శ్రావణము, వాల్తేరు, } మల్లంపల్లి సోమశేఖరశర్మ.



# విషయసూచిక



శ్రీరామచంద్ర

# ఆంధ్రకవితరంగిణి

## పండ్రెండవ సంపుటము

## 273 రఘునాథ భూపాలుఁడు



ఈతఁడొక మహారాజగుటచే నీతని చారిత్రమును బలువు రిదివఱకు రచియించి యుండిరి. ఈతఁడొక మహాకవియగుటచే నేను గూడ నీతని చారిత్రమును వ్రాయవలసి వచ్చినది. ఈతని చారిత్ర మున వ్రాయవలసిన విషయము లనేకములగుటచే వానినన్నిటినిగూర్చి వ్రాసినచో నదియొక పెద్దగ్రంథమగును. అట్లని యీతని చారిత్ర మును వదలివైచినచో నా గ్రంథమునకు లోపము వాటిల్లఁ గలదు. కావున ముఖ్యవిషయముల నతిసంక్షిప్తముగ వ్రాసి నాధర్మమును గొంత వఱకు నెఱవేర్పఁ బ్రయత్నించెదను. తంజావూరాంధ్ర రాజుల చరిత్రము శ్రీ కురుగంటి సీతారామయ్యగారు M. A వ్రాసియుండిరి. ఈ కవినిగూర్చి వ్రాయుటలోఁ గొన్ని విషయములనందుండియే గ్రహించితిని. చరిత్రకారులకు చర్వితచర్వణ దోషముండదు.

తంజావూరు రాజ్యమును బరిపాలించిన నాయకప్రభువులలో నితఁడుమూఁడవవాఁడు. ఇతఁడు క్రీ.శ.౧౬౧౪ వ సంవత్సరము మొదలు ౧౬౩౩ వ సంవత్సరము వఱకును తంజావూరునకుఁ బాలకుఁడుగా నుండెను. నాయకప్రభువుల పరిపాలనములోనికి రాకపూర్వము తంజావుర రాజ్యము చోళరాజులచేఁ బరిపాలింపఁ బడుచుండెడిది. చోళరాజు లంతకుపూర్వము స్వతంత్రులుగా నున్నను, కర్ణాట రాజ్యమభివృద్ధి చెందిననాటనుండియు నీ తంజావూరు రాజులు కర్ణా

టక రాజులకు సామంతులుగా నుండుచువచ్చిరి. కృష్ణరాయభానుఁ డస్తమించిన పిదప నచ్యుతదేవరాయలు కర్ణాటరాజ్య పరిపాలనమును వహించిన కొలఁది కాలములోనే తంజావూరురాజ్యలక్ష్మికి నాథుఁడు లేకుండుటనెఱింగి, యా రాజ్యమునకుఁ దన తోడియల్లుఁడైన చినచెవ్వనాయకుని రాజుగా నియమించెను. ఈ చినచెవ్వనాయకుఁడును, ఈతనితండ్రి తాతలును, గృష్ణరాయలయొద్దను, నాతని యనంతర మచ్యుతరాయల యొద్దను దండనాయకులుగనుండి యనేక యుద్ధములలోఁ బాల్గొని వారల మెప్పువడిసియుండినవారు. అచ్యుతదేవరాయలు తనభార్య ప్రోత్సాహమువలనను, దక్షిణదేశమున తన పక్షముననుండి సామ్రాజ్యమునకుఁ దోడుచూపుచుండఁ దగినయొక నాయకుఁ డుండుట యవసరమని తలంచియును, తంజావూరునందు సమర్థుఁ డగు ప్రభువు లేకుండుట మూలముననుచినచెవ్వనికిఁ దంజావూర రాజ్యము నొసంగెను. ఈ చినచెవ్వనాయకుఁడును అచ్యుతదేవరాయలును దోడియల్లుండ్రని కొందఱి మతము—అచ్యుతదేవరాయలు క్షత్రియుఁ డనియుఁ జినచెవ్వనాయకుఁడు శూద్రుఁ డనియు, నందుచే వారు తోడియల్లుండ్రు కాజాలరనియుఁ, గొందఱందురు. ఈచర్చతో మనకిట నంతగాఁ బ్రసక్తిలేదు.

అచ్యుతదేవరాయలు క్షత్రియుఁ డని నిర్ణయించుట కాధారములులేవు. ఈ విషయములనుగూర్చి ఆంధ్రకవితరంగిణియందే శ్రీకృష్ణదేవరాయల చరిత్రమున వ్రాసియున్నాఁడను.

విజయవిలాసకృత్యాది యందలి యీక్రింది పద్యమునుబట్టి వీరి బాంధవ్యము సత్యమనియే తలంపవలసియుండును.

గీ. తీవి నచ్యుతరాయల దేవియైన
తిరుమలాంబకు ననుజయై తేజరిల్లు

మూర్తిమాంబను బెండ్లియై కీర్తివెలయఁ
జెవ్వవిభుఁడు మహోన్నతశ్రీలఁ జెలఁగె.

క. ఆమూర్తమాంబ కఖిలమ
హీమండలనాథుఁ డచ్యుతేంద్రుఁడు సుగుణో
ద్దాముఁడు జన్మించెం ద
ద్భూమీపతి రంగధాముపూజ న్మించెన్.

ఈ యచ్యుతేంద్రుని తనయుఁడే మనరఘునాథనాయకుఁడు. ఈ చిన చెవ్వనాయకుఁడే తంజాపుర ప్రథమనాయకప్రభువు - అదివఱకొక సూరు, కృష్ణదేవరాయలచేఁ బంపఁబడిన నాగమనాయఁడు తంజా వూరునందలి చోళరాజును జయించి తంజావూరును దాత్కాలిక ముగఁ గొంతకాలము పరిపాలించినను, నది రాయల యంగీకారమును బొందకపోవుటవలనను, గొలఁదికాలములో నేకృష్ణదేవరాయల యాజ్ఞా నుసారముగ నాగమనాయఁ డాతని కుమారునిచేత నే పదభ్రష్టుఁడగుట వలనను, అదినాయకప్రభుత్వముగాఁ బరిగణింపఁ బడలేదు. నాగయ నాయకునకు చినచెవ్వనాయకునకును సంబంధములేదు. చినచెవ్వ భూపతి తంజావూరు ప్రథమనాయక ప్రభువు. అతని తనయుఁ డైన అచ్యుతరాయనాయకుఁడు, రెండవనాయక ప్రభువు. అతని కుమారుఁ డైన యీరఘునాథనాయకుఁడు మూఁడవ నాయకభూపాలుఁడు. ఇతఁని పుత్త్రుఁడగు విజయరాఘవభూపాలుఁడు తంజావూరు రాజ్య మునకు నాల్గవ నాయకప్రభువు. ఇతఁడుకూడఁ గవియే. ఈతనితోఁ దంజావూరునందు నాయకప్రభుత్వమంతరించినది. పిమ్మట మహా రాష్ట్రులు తంజావూరునకు రాజులైరి. ఈ మహారాష్ట్రరాజులుకూడ నాంధ్రకవు లైయుండిరి. వారిచారిత్రములలో నావిషయములు తెలుపఁ బడును.

శ్రీకృష్ణదేవరాయలు క్రీస్తుశకము ౧౫౩౦ వ సంవత్సరమున నస్తమించిన ట్లాతని చారిత్రమున వ్రాసియున్నాఁడను. అతనియనంతరమున నాయనతమ్ముఁడగు నచ్యుతదేవరాయలు కర్ణాటసింహాసన మధిరోహించి ౧౫౪౩ వ సంవత్సరము వఱకును రాజ్యముచేసి యుండెను. ఆతనికాలములో చిన్నచెవ్వనాయకుని దంజావూరునకధికారిగా నియమించిన సంవత్సరము ౧౫౩౫ అని కొందఱును, ౧౫౪౧ అని కొందఱనుచున్నారు. ఆకాలనిర్ణయముతో మనకిట నవసరములేదు. చినచెవ్వభూపతి క్రీ.శ. ౧౫౬౧వ సంవత్సరమున రాజ్యమును గుమారుఁడైన యచ్యుతనాయకున కప్పగించి, జీవితశేషమును భగవత్సేవయందుఁ గడపెననియు, నచ్యుతరాయనాయకుఁడు కూడఁ దండ్రివలెనే కుమారుఁడైన రఘునాథరాయలకుఁ దనజీవితకాలములోనే రాజ్యము నొసంగెననియు, రఘునాథరాయలు క్రీ.శ. ౧౬౧౪ వ సంవత్సర ప్రాంతమున రాజ్యమును స్వీకరించి ౧౬౩౩ వ సంవత్సరము వఱకును రాజ్యముచేసెననియుఁ జరిత్రకారులు చెప్పుచున్నారు. ఈ కాలనిర్ణయములోఁ గొలఁది హెచ్చుతగ్గులుండినను నుండవచ్చును.

తంజావూరు ప్రభుత్వమును చినచెవ్వనాయకున కెవ్వరెప్పుడొసంగిరను విషయమునఁ జరిత్రకారులు భిన్నాభిప్రాయులైయున్నారు. సదాశివరాయలే, చినచెవ్వప్రభువును క్రీ.శ. ౧౫౪౫ నకుఁ బిమ్మట రాజుగాఁ జేసెనని కొందఱిమతము.

ఈవిషయమున మనకు విశేషచర్చతో బనిలేదు. చినచెవ్వప్రభువును తంజావూరు నాయకప్రభువుగాఁ జేసినది కర్ణాటప్రభువే యనియు, ఆకాలము క్రీ.శ. ౧౫౪౦-౧౫౫౦ నడుమననియు నందఱు నంగీకరించుచున్నారు.

క్రీ. శ. ౧౬౩౩ వ సంవత్సరమున రఘునాథనాయకుఁడు తండ్రి తాతలవలెనే రాజ్యమును గుమారునివశముచేసి తనజీవితవిశేషమును బరమార్థదృష్టితో గడపెనని కొందఱును, ఈతని కుమారుఁడైన విజయరాఘవనాయకుఁడు, తండ్రిని రాజ్యపదభ్రష్టునిగావించి బలాత్కారముగా రాజ్యమును గైకొనియెనని గొందఱుననుచున్నారు. ఈవిషయమునుగూర్చి విజయరాఘవభూపాలకవి చరిత్రమున వ్రాయఁదలఁచి యిట వదలివేయుచున్నాఁడను.

రఘునాథభూపాలున కొకయగ్రజుఁ డుండెడివాఁ డనియు నాతనివిడచి శౌర్యవంతుఁడును, ప్రజ్ఞావంతుఁడును నగుటచే నీతనినే తండ్రి యువరాజుగాఁ జేసి, పిదప రాజ్యపట్టాభిషిక్తునిగాఁ జేసెననియు, సాహిత్యరత్నాకరమునందలి యీక్రింది శ్లోక మీవిషయమును సూచించుచున్నదనియుఁ గొంద ఱనుచున్నారు.

"అనుమద్భుతాకృతిసమం విలోకయన్
అశరీరవాక్య మపిచానుచింతయన్
ఉచితం తయోరథతనూజ ముర్వరా
రమణశ్చకార రఘునాథభూపకమ్."

కొంద ఱచ్యుతరాయనాయకునకు రఘునాథుఁ డొక్కఁడే తనూజుఁ డనియు, రెండవకుమారుఁడు లేనేలేఁ డనియుఁ జెప్పుచున్నారు. హీరాసుపండితుఁడు, అచ్యుతరాయనాయకుఁడు తనపెద్దకుమారుని కారాగృహమునంబుంచి, రఘునాథనాయకుని యువరాజుగా నొనర్చెననియు, రఘునాథుఁడు, రాజైన పిమ్మటఁ దనయన్నను జంపించెననియు, "ఆరవీడు" అను గ్రంథమున వ్రాయుచు, నందులకాధారముగా క్రీ. శ. ౧౬౦౦ సంవత్సరప్రాంతమున మలబారులోని క్రైస్తవమిషనరీ లిరువురి నడుమనడిచిన రెండుత్తరములను నాధారముగాఁ గైకొని యున్నాఁడు. ఇదివిశ్వసనీయ మైనదికాదని కొందఱి యభిప్రాయము.

శ్రీకృష్ణదేవరాయల మీఁదను నిట్టి యపవాదము కలదు. శౌర్యమునఁ బ్రతాపమున, రాజ్యాభివృద్ధిని, ఆంధ్రసంస్కృతభాషా పాండిత్యమున, కవిపండిత పోషణమున, గ్రంథరచనా కౌశల్యమున నింకను ననేకవిషయములలో శ్రీకృష్ణదేవరాయలకును, రఘునాథనాయకునకును సామ్యముకలదు. అట్టి సామ్యము తుదకీయపవాదమునం దును గలిగినది. ఇందలి సత్యాసత్యనిర్ణయ మసాధ్యకార్యము. అయినను, ప్రబలమై, సంశయరహితమైన సాక్ష్యము లభించువఱకును నేవ్యక్తి పైనయినను నిట్టి నేరమును స్థాపించుట చరిత్రకారులకు నుచిత కార్యముకాదు. రఘునాథనాయకుని విషయమున నట్టిసాక్ష్యములేదు. కావున నాతనిపైమోపఁ బడిననిందకుసరియైన యాధారములేదనియుఁ జెప్పుటయే యుక్తము. ఈవిషయమును, శ్రీ గుడుగంటి సీతారామయ్య M.A.గారు తమచారిత్రిక గ్రంథమున విపులముగాఁ జర్చించి అచ్యుతనాయకున కిరువురు కుమారులులేరనియు, పెద్దకుమారుని రఘునాథనాయకుఁడు చంపించెనను కథ నమ్మరాదనియు, మిషనరీల యుత్తరముల ననుసరించి రఘునాథనాయకునిపై నీయపవాదమును మోపరాదనియు నిర్ణయించియుండిరి. కావున నిఁక నీవిషయమైన చర్చ వదలివేయుదము.

రఘునాథభూపాలుఁడు సంస్కృతాంధ్రములయం దద్భుతమైన పాండిత్యము కలవాఁడు. ఉభయభాషలయం దీతఁ డనేకగ్రంథములను రచియించెను. సంగీతవిద్యయందు నిరుపమానమైన ప్రతిభను సంపాదించుటయేకాక సంగీతసుధయను నొకసంస్కృతగ్రంథమును రచించియుండెను. ఈతని యాస్థానమునందు సంస్కృతాంధ్రకవి పండితు లనేకులుండిరి. 'చతుర్దండిప్రకాశిక'యను సంగీతశాస్త్రగ్రంథ మును రచియించిన వెంకటమఖి, యీతని యాస్థానమునందుండిన వాఁడు. సకలశాస్త్రపారంగతుఁ డనిపేరు వడసిన గోవిందమఖి, యచ్చుతరాయనాయకుని కాలమునుండియు నీ యాస్థానమున మంత్రి

గను, పండితుఁడుగను, గురువుగను నుండినవాఁడు. ఈతనిగొద్దనే రఘునాథనాయకుఁడు విద్యనభ్యసించియుండెను. గోవిందదీక్షిత కుమారుఁడైన, యజ్ఞనారాయణదీక్షితుఁడు, రఘునాథనాయకునిశిష్యుఁడట. ఈయజ్ఞనారాయణదీక్షితుఁడు రఘునాథభూపాలీయము, అలంకార రత్నాకరము, సాహిత్యరత్నాకరము ననుమూఁడు సంస్కృతకావ్యములను రచించి రఘునాథభూపాలునకే యంకితము చేసెనఁట — ఇట్టి శిష్యునకు గురువైన రఘునాథనాయకుఁ డెంతపండితుఁడో వేఱె చెప్పవలయునా ? ఎంతపండితుఁడు గాకున్న గోవిందదీక్షి యంతటివాఁడు తనకుమారుని, రఘునాథునకు శిష్యునిగాఁ జేయును?

ఈతని యాస్థాన కవయిత్రియైన రామభద్రాంబ యీతని కీర్తిని జగద్విదితముసేయుచు, రఘునాథాభ్యుదయ మనునొకసంస్కృత కావ్యము రచియించినది. మఱియు నీతఁ డాంధ్రమునరచించినరామాయణమును మధురవాణి యనువేశ్య సంస్కృతీకరించినట్లు చెప్పఁబడు చున్నది. ఈ రామభద్రాంబ తాను రఘునాథనాయకుని భార్యనని తనగ్రంథములలో వ్రాసికొనియున్నది. కాని యామె వేశ్యకుల సంజాతయనియు, రఘునాథుని యుంపుడుకత్తె యనియుఁ బ్రబల మయిన వదంతికలదు. ఎవ్వరైనను, నీమెగొప్పవిదుషీమణి యనుటకు సంశయము లేదు.

సారంగధర, విజయవిలాసాది గ్రంథములను రచియించిన చేమకూర వెంకటకవి యీరఘునాథనాయకుని యాస్థానకవి. ఈ రెండు గ్రంథముల నాతఁ డీభూపాలునకే కృతియొసంగెను.

ఈ రఘునాథభూపాలుఁడు రచించిన గ్రంథము లెన్నియో, ఎన్నికాలగర్భమున నణఁగి కానరాకున్నవో తెలియరాదు. ఈతఁడు రచించినవానిలో రఘునాథరామాయణ మొకటియు, వాల్మీకిచరిత్ర మొకటియు నేఁడు లభించుచున్నవి. "శృంగార సావిత్రి" కూడ యీతని రచనమేయని కొందఱును గాదని కొందఱుననుచున్నారు.

రఘునాథరామాయణ మంతయు లభింపలేదు. బాలకాండములోఁ గొంతలభించినందున నాంధ్రసాహిత్య పరిషత్తువా రాభాగమును మాత్రము ముద్రింపించినారు. ఈతని రఘునాథరామాయణము నందలి గద్య యీక్రింద నుదాహరింపఁ బడుచున్నది. ఈగద్యస్వాతిశయసూచకమై యుత్ప్రేక్షాలంకారముతోఁ గూడిన దైయున్నట్లు పైకిఁ గనప్పట్టుచున్నను నదివాస్తవమేకాని యందుత్ప్రేక్షయించుకంతయునులేదని యీతని చరిత్రమును జదివినవారికి దెల్లమగును.

"ఇది శ్రీరామచంద్ర సాంద్రకరుణాకటాక్షలబ్ధసిద్ధ సారస్వత, విశేషనిర్గళ వాగ్వైభవాశేష సరససాహిత్యకళాభోజ, సత్యసంభూషితముఖాంభోజ, సకలసామ్రాజ్యధౌరేయ, నిత్యవితీర్ణధారారాధేయ, నిరతావారితాన్న సత్రసంతోషిత పంచాశత్సహస్రభూసుర, బహునారావర్తిత మహాదాన వైభవానర్తితకీర్తిభాసుర, నిజనామాంకితాకలంకవస్తు సమగ్రబహుళాగ్రహార భూషితచోళ ధరామండల, నిఖిలభోగ విభవనిర్జితాఖండల, సాధిత సముద్రాంతరద్వీపపరనృపాల సంస్తుత ప్రతాప, నేపాళభూపాలస్థాపనాచార్య, కర్ణాటరాజపూజనీయ ధౌరంధర్య, రామసేతు శ్రీరంగ విజయరాఘవ పురకుంభఘోషణాది దివ్యస్థల ప్రతిష్ఠాపిత రామభద్ర, సర్వజనసంభావిత గాంభీర్యముద్రానిర్జిత సముద్ర, సదాశ్రితాభరణ దీక్షాదక్ష, దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజ సన్నుతాసాధారణశౌర్య, దిగంత ప్రసిద్ధతరౌదార్య, సుజ్ఞానజనక, సతతసంసేవితజనక, పోషితవిద్వత్కవియూథ, భువనశోభితగుణసనాథ, బలవత్పరి పంథిగృహీత, సామంత మహీకాంత విమోచనశ్లాఘనీయ బాహుబల, మూర్తి మాంబా గర్భశుక్తిముక్తాఫల, చెనచెవ్వయాచ్యుతనృపాలపుత్ర సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖావిజిత సుమసాయక, సకలధర్మసంధాయక, రఘునాథనాయక ప్రణీతంబైన శ్రీమద్రామాయణంబున విబుధజన వినుత వివిధకథాశాఖాప్రకాండంబగు బాలకాండంబు."

రఘునాథరామాయణమున దొరకినంత వఱకుఁ జూడఁగాఁ నిది వాల్మీకిరామాయణమున కాంధ్రీకరణమువలెఁ గన్పట్టదు. కవి దీనిని బ్రబంధశైలిలో వర్ణనాంశములను బెంచి తన యిచ్ఛవచ్చినట్లు రచించినాఁడు. ఒక్క బాలకాండము మాత్రమే మూఁడువేలపద్యములు కలదని చెప్పుచున్నారు.

శ్రీరామచంద్రుఁడు కవికి స్వప్నమునఁగాన్పించి

క. నీ విప్పుడొక ప్రబంధము
గావింపం దలఁచుటెఱిఁగి కౌతుకమొప్పం
గా, వచ్చితి నినుమెచ్చితి
భావంబున నేను రామభద్రుఁడఁ జుమ్మీ!

క. మామది సమ్మదమొదవఁగ
రామాయణకథయ నుడువు రఘునాథనృపా!
నీమహిత వాగ్విలాసము
భూమిం బొగడొందు సుకృతములు చేకూరున్.

క. నీమృదుల వాగ్విలాసము
రామాయణకథయు శర్కరయుఁ బాలుబలెన్
ధీమత్కవి జిహ్వాలనెం
తేమధురిమ వొదలుచుండ నెలకొనియుండున్.

గీ. అచ్యుతాభ్యుదయాది మహాప్రబంధ
ములు రసోచితపదబంధములు సెలంగఁ
జాలఁ జెప్పితివవిమాకు సమ్మదంబుఁ
దెచ్చె హెచ్చుగ నచ్యుతాధిపకుమార!

అని యానతిచ్చినట్లు కవి చెప్పియున్నాఁడు. దీనినిబట్టి రఘునాథభూపాలుఁడు అచ్యుతాభ్యుదయము మొదలుగాఁ గొన్ని ప్రబంధములు చెప్పియున్నట్లు కన్పట్టుచున్నది. రామాయణము సీతఁడు

పూర్తిగనే రచియించిన ట్లీతఁడు రచించిన వాల్మీకి చరిత్రములోని యీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

ఉ. నీ కవితావిలాసము గణింప సుధారసధారకంటె నిం
పైకనిపించు దానఁగృతియైనను మిక్కిలి సొంపు నింపదే
నాకథఁ దొల్లియగ్రరచనా రుచిమించఁగఁ జెప్పితట్టె వా
ల్మీకిచరిత్రమున్ నొనువు మెచ్చగ నీవిపు డచ్యుతాత్మజా!

క. పావనరమణీయంబగు
నావాల్మీకుల చరిత్రమదికృప సేయఁగా
శ్రీవిమెఱయు నీపుణ్య
ప్రావీణ్యము యచ్యుతేంద్ర రఘునాథనృపా!

ఈకవి రామాయణమును వాల్మీకిచరిత్రమునుగాక జానకీ పరిణయము, భారతసారము, నలచరిత్రము, పారిజాతాపహరణము, గజేంద్రమోక్షము మొదలుగా ననేక గ్రంథముల నాంధ్రముననను, సంస్కృతమునఁ గొన్నిగ్రంథములను రచియించినట్లు గానవచ్చుచున్నది. నలచరిత్రము చిత్రాడయందలి యముద్రితాంధ్రగ్రంథసర్వస్వ కార్యాలయము నందున్నట్లు వాల్మీకిచరిత్రపీఠికలో వ్రాసియున్నారు. పారిజాతాపహరణప్రబంధము నీతఁడు యామద్వయములోరచింపఁగా వ్రాయువారలు దానిని బహుప్రయాసమిూఁద వ్రాయఁగల్గిరఁట! రాజచూడామణికవిపుంగవుఁడు రచించిన సంస్కృత రుక్మిణీపరిణయమునం దీవృత్తాంత మీక్రిందిశ్లోకభాగమునఁ జెప్పఁబడియున్నదఁట.

"శ్రీపారిజాతాహరణాభిధానో
యేనైక రాత్రేణకృతః ప్రబంధః."

ఈవిషయము సాహిత్యరత్నాకరమునం దుదాహరింపఁబడియున్నదనియూ, రఘునాథనాయకుని కవితాసామర్థ్యమునకుసంతసించి, తండ్రి యీతనకుఁ గనకాభిషేకమొనర్చెననియు వ్రాయుచు తంజా

పురాంధ్రనాయకచరిత్రకారు లందులకు నిదర్శనముగా సాహిత్య రత్నాకరమునందలి యీక్రింది శ్లోకములను జూపియున్నారు:—

"మాకంద కందళదమంద మరంద బంధు
త్వాం పారిజాతహరణం త్వరఘూనిబద్ధమ్."
"ఏవం వదం స్తనయమేషకృపాగసౌఖ్యైః
జాతాభిషేక మపితం జగతీబిడౌజాః
తత్రాభ్యషించత మణీభిరసౌ సభాయా
మాసీత్స ఏవవసుధేశ పట్టాభిషేకః."
"యామద్వయేన యదునేతరి పారిజాత
మాజీహరత్సరస మచ్యుతభూపసూనుః
కావ్యంతదత్ర విభుదైస్తు కర్ణం కర్ణం చి
దాత్మే చిత్రమ వధాయఫణీంద్ర కల్పైః."





ఈయన రచించిన యచ్యుతరాయాభ్యుదయ మీతనితండ్రియైన యచ్యుతరాయనాయకుని ప్రతాపాదిగుణముల నుగ్గడించునదియైనట్లు గాన్పించుచున్నది. నాకాపుస్తకము లభింపలేదు. తంజావూరు మహారాజుల పోషణక్రింద సరస్వతీమహాలునందలి పుస్తకభాండాగార మీ రఘునాథనాయక ప్రభునికాలములోనే ప్రారంభింపఁబడి తరువాతి ప్రభువులచేఁ బెంపొందింపఁ బడినదనిలోక మనుచున్నది. అందు వేల కొలఁది సంస్కృతాంధ్రగ్రంథములు సమకూర్పఁబడియున్నవి. కాని యందీనాయకప్రభువుల గ్రంథములు లేకుండుటకుఁ గారణము దురూహముగా నున్నది. రఘునాథనాయకుని గ్రంథములు లభింపకుండుట యాంధ్రుల దురదృష్టమని చెప్పక తప్పదు.

ఈతని విద్యాకౌశల్యము, కవితాశక్తి, రసగ్రహణపారీణతలను గూర్చి యెంత వ్రాసినను తనివితీరదు. ఈతనినిగూర్చి చేమకూర వెంకటకవి వ్రాసిన యొకటి రెండు పద్యములనిట నుదాహరించి,

యేనుత్పత్తినొందుచు, దీనినిబట్టి యాతనిగుణగణముల నూహించు కొనవలయునని పాఠకమహాశయులఁ గోరుచున్నాఁడను.

ఉ. తారసపుష్టిమైఁ బ్రతిపదంబున జాతియు వార్తయున్ జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గ ననేకకృతుల్ ప్రసన్నగం
భీరగతిన్ రచించి మహిమించినచో నిఁక శక్తులెవ్వ ర
య్యా రఘునాథభూప రసికాగ్రణికిన్ జెవిసోఁకఁ జెప్పఁగన్.

శా. రాజున్ భోగియు సౌమ్యుఁడున్ గవియు సర్వజ్ఞుండు నీడౌ నవన్
తేజః ప్రౌఢవచో వివేకనయ భూతిశ్లాఘలన్ మించునే
రాజున్ భోగియు సౌమ్యుఁడున్ గవియు సర్వజ్ఞుండు నెబ్బంగులన్
యోజింపన్ రఘునాథభూపవరునా నర్యుండే ధరామండలిన్.

—విజయవిలాసము

ఈరఘునాథుని కవిత్వము మృదుమధురశైలి కలిగి హృద యానందదాయకమై చక్కనిజాతీయోక్తులతో సర్వాలంకార భూషితమై యొప్పారుచుండును. ఈతనిశైలి తెలియుటకై కొన్నిపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

—శ్రీ రామాయణ బాలకాండము శ్రీ—

ఉ. ఒక్కమహీజశాఖపయి నొక్కట వేడుకఁ గూడియుండి యొం
డొక్కటి ఱెక్కవిప్పుకొని యొప్పుగఁ గప్పుచు నొయ్యఁబల్కుచు
న్మక్కువ మేనుగీఱుచును మోమునుమోమును జేర్చి మిక్కిలి
న్మక్కువనుండ క్రౌంచమిథునంబుఁ గనుంగొని సంభ్రమంబునన్

౧ ఆ

చ. చిలుకలు ముక్కునంబొడువఁ జిల్లునఁజిమ్మిన క్రోవలంబలె
న్వొలువడు నిక్షుకాండ రసనిర్ఝరముల్ వికటస్థపల్వ లం
బులఁబడి యెండకాఁకలను బొంగుచుఁ జిక్కణపాకమైన రం
జిలుతమిఁ ద్రొక్కిచక్కెరలు సేయుదురక్కడి హాలికోత్తముల్

౨ ఆ

ఉ. మ్రొక్కికరాబ్జముల్మొగిచి ముందఱనిల్చి మునీంద్రులార! మీ
రెక్కడనుండివచ్చితిరి యిచ్చటి యాశ్రమభూములెన్నడుం
ద్రొక్కఁగఁజూడమిట్టి శుభరూపము గన్గొన నెమ్మనంబు న
న్మిక్కిలి వేడ్కయయ్యెనని మెచ్చుచువారలఁజేరియల్లనన్. ౨౮

మ. సుతసంతానము సద్గతి ప్రదమటంచుం జాటునానాశ్రుతి
స్మృతి సిద్ధాంతమెఱింగి తత్సుతులకల్మింగోరి ధర్మక్రియా
ర్జితవిత్తంబున నశ్వమేధమఖముం జేయంగ నూహించె ని
ష్పతి సాధుస్తుతికెల్లయోగ్యమగు నీభాగ్యంబు సామాన్యమే. ౩౮

శా. ఆయుష్మాన్భవ పుత్రవాన్భవ సమగ్రానంద సాంద్రోభవ
శ్రీయుక్తోభవ యంచుభూమిసురులాశీర్వాదముల్ సేసి ర
త్న్యాయత్తాంచిత ధర్మశీలు సుగుణోద్యత్కీర్తిశోభా సము
చ్ఛాయద్యోతితలోకు నాదశరథక్ష్మాపాలచూడామణిన్. ౩౮

సీ. అంబుకేళికివచ్చియడుసునఁ గాలూఁది
కదలనేరని వెలిగారనంగ
యాదోవిభునకుఁ దోయనిధి సేయించిన
వెలఁది ముత్తెపుసింహపీఠమనఁగఁ
బాలుగ్రోలఁగఁగోరి పాలసంద్రముమీఁద
వ్రాలు పురాణమరాళ మనఁగ
జలధిదవ్వుచు సాగరులునిల్పిన విఫేన
దట్టమైనట్టి పెన్మిట్టయనఁగ
జనకుఁ డైనట్టి దనుఁ గనుగొనఁగఁ జేరఁ
బుత్రవాత్సల్యమున మహాంబోధితరఁగ
చేతులబిగించి కౌఁగిటఁజేర్పఁ గదల
కున్న శశి యనఁ దెలియదేవిచెన్నుమీఱు.

వాల్మీకిచరిత్రము:— ఇందు ''సప్తద్వీపాదుల నైసర్గిక స్థితు
లును, ఆయానదులుపుణ్యక్షేత్రాదులు మొదలగువాని పవిత్రతయు

నుత్పత్త్యాదివిశేషంబులును, వాల్మీకిజ్ఞానోపదేశపథంబును, బోయల చర్యలును, వాల్మీకి నిశ్చలచిత్తంబును, రంభోర్వసుల గర్వభంగంబు మొదలుగా నెన్నియో విశేషాంశంబులు" మూఁడాశ్వాసములలో వర్ణితములైనవి. ఇదియు శ్రీరామచంద్రున కంకితమే !

ఉ. శ్రీహరినామకీర్తన మశేషభవప్రభవాతిమోహ సం
దోహవికర్తనంబని శ్రుతుల్ మొఱవెట్టఁగ వించు వెంగి సం
దేహము వోక మూఢులగతిం బెడఁబాతురుకర్మవాస్థలం
దోహరిసాహరిన్ మునిఁగి యొల్లరు దీనిప్రచింత యేమనన్. ౧౯

సీ. పందెమిమ్మని లక్ష్మిపంతంబుతోనన నెన
కౌస్తుభ మెడల్చి యదర్కనెచి
పడఁతిపాదములందుఁ బావలుగ దియింపఁ
దొడిగియుఁదొడుగక తోలఁగఁద్రోచి
కదిసివిష్వక్సేనుకై దండయొడిసియుఁ
గడువేగమడరంగఁ గడకునూఁకి
బరిమేనిగరుడుని నురువడిమై నెక్కి
పదపదమనిసాగె పన్నగోఁకి
సురులుగని మ్రొక్క యసురులు సురిగిస్రుక్కఁ
జక్రమున నక్రశిరమును జక్కఁజేసి
హస్తమున హస్తిమస్తంబు మస్తరించి
వెలయు శ్రీహరిశుభము గావించుమాకు. ౧౮

చ. మిడిమిడియెండ కొట్టునను మేనులు పెట్లుచునుండ నేలపై
నడుగుల దుమ్ముకుమ్మువలె నంటుకొనన్ వడి ఘర్మతోయముల్
జడిగొనఁగా జటల్ గడనసంబులు మోవగ లేకపోవ న
య్యెడ నొకబోయదాయవలె నెక్కడనుండియొ యద్భుతంబుగన్
౨౫

శా. ఆ వల్మీకముఁ జించుకొంచు నుదయాహార్యాంతరాళంబునం
దావిర్భావమునొందు భాస్కరునిఛాయన్ శోణశోణప్రభా
వ్యావల్గత్కిరణంబులో యన జటాప్రాంతంబుశోభిల్లఁగా
వేవేగంజనుదెంచి యమ్మునులసేవించెం బ్రియంబిచ్చఁగన్ 3ఆ

శృంగారసావిత్రి యనుపేర రెండాశ్వాసముల పద్యకావ్యమొకటి శృంగారగ్రంథమాలవారిచే ముద్రింపఁబడి ప్రచారములోనున్నది. ఇందలి శృంగారశబ్దము గ్రంథమాలవారిచేఁ జేర్చ బడినదికాని కవి యుంచినదికాదు. ఈగ్రంథమాలవారి గ్రంథనామముల కన్నిటికిని సామాన్యముగా నీశృంగారశబ్ద మాదియందుఁ జేర్చుచువచ్చిరి. "శృంగారభల్లాణచరిత్ర, శృంగారకాళిదాసకథలు, శృంగారరాధా మాధవము" — ఇత్యాది.

ఈగ్రంథము తంజావూరి రఘునాథరాయప్రణీతమని గ్రంథాది యందున్నది. కాని దీనిని రఘునాథరాయలు రచించెననుట కాధా రములులేవు. గ్రంథకర్తృత్వమునుగూర్చి పీఠికాకారులవాక్యములివి.

"రసవంతమగు నీ ప్రబంధమునుగూడ నామహారాజ కవియే రచియించియుండునని మే మనుకొనుచున్నాము. దీనిమూలము తంజావూరి సరస్వతీపుస్తకశాలలోనున్నది. అది ప్రాతఁపుస్తకము. గ్రంథారంభమున నొకయాశ్వాసము లేనట్లున్నది. ఆశ్వాసాద్యపద్య ములు, ఆశ్వాసాంతపద్యములులేవు. నడుమగూడ నొకచోఁ గొంత గ్రంథపాతమున్నది. ఈగ్రంథమును సాంతము రచింపకపూర్వమే గ్రంథకర్త స్వర్గస్థుఁడైయుండునని యూహ్యాము. ఆప్రతినిబట్టి తత్కర్తను గుర్తింపఁ గుదురదయ్యెను. కానిరఘునాథరాయమహాకవి రచియించిన రామాయణమందలి పద్యములు (ఋష్యశృంగ తపోభం గము పట్టుననున్నవి) ఈగ్రంథమునందును నుండుటచే తత్కర్తయే యేతత్కర్తయగునని మే మూహించితిమి.

తంజావూరు పుస్తకభాండాగారమున నె-౨౫౯౩ రుగా నున్న గ్రంథమే యీగ్రంథమునకు మూలమని నిశ్చయింపవచ్చును. ఆ గ్రంథముపేరు సావిత్రీకళ్యాణము. అందలి యీక్రింది మొదటి పద్యమే ముద్రితప్రతిలో మొదటి పద్యముగానున్నది.

తే. అవధరింపుము పాండవేయాగ్రజునకు
నవలికథయందుఁ గల్గువృత్తాంతమెల్ల
నానుపూర్విగఁ దెల్ప నవహ్నిచంద్రుఁ
డింపుపలుకుల మై పులకింపుచుండ

తంజావూరి ప్రతినిగూర్చి "కవి తెలియదు. ఇందాశ్వాసవిభాగము కానరాదు. కథాభాగమంతయు సంపూర్ణము" అని గ్రంథభాండాగారముయొక్క క్యాటలాగునందు వ్రాసియున్నారు. కాని ముద్రిత ప్రతిలో నాశ్వాసవిభాగమున్నది. ఈ విభాగమును విలేఖకు లగు రామకృష్ణపండితులు చేసిరో ముద్రాపకులొనర్చిరో తెలియదు.

రామాయణమందలి పద్యము లిందుఁ గనుపట్టుటచే రామా యణకర్తయే యీగ్రంథమును రచించియుండునని పీఠికాకారు లూ హించిరి. కాని యంతమాత్రముచే గ్రంథద్వయైక కర్తృత్వము స్థిర పడదని నాయుద్దేశము. ముద్రితప్రతిలోఁ దుదను

క. తంజాపురి రఘునాథుని
లంజమొ, యతఁడో, వచోవిలాసమువెంబడియుఁగా
రంజిల్ల బుధులు రచనా
మంజిమసావిత్రిచరిత మహి రచియించెన్. —అనియున్నది.

ఈపద్యమెవరు వ్రాసిరో తెలియదు. ప్రకాశకులు రచియించియుం డరు. రఘునాథుఁ డేతద్గ్రంథకర్తయని వ్రాసినవా రీపద్యమును వ్రాసియుందురా? ఇది, మూలమునందే యుండియుండఁ నును—

"ఆయన రచియించిన రామాయణమును మధురవాణియను వేశ్య సంస్కృతమునఁ బరివర్తించెను." అని పీఠికాకారులు వ్రాసియున్నారు.

పై పద్యములోని "లంజ" ఈమధురవాణియే యేమో! రామాయణ మందలి పద్యముల స్వారస్యమును గ్రహించి, వానిని విడువలేక తనయీగ్రంథమున వేసికొనెనేమో! ఏదియెట్లయినను శృంగారసావిత్రి కర్తను నిర్ణయించుట కింకను బరిశోధనము జరుగవలసియున్నది. ఈ గ్రంథరచనము ముగియక పూర్వమే రఘునాథభూపాలుఁడు స్వర్గస్థుఁడయ్యెనని తలంచుట కవకాశములేదు.

క్యాటలాగులో "కథాభాగమంతయు సంపూర్ణము" అని వ్రాసియున్నది. ముద్రితప్రతిలోని తుదిపద్యమిది–

చ. చని మఱునాఁడు తా సకలసంభ్రమముల్ దనరంగ సత్యవం
తునకునుఁ గట్టిబట్టము జనుల్ గొనియాడ నతండు తండ్రికం
టెను గుణియై భరింపధరణిన్ సరిసేయఁగఁగూడఁదా నరేం
ద్రకల రాజసమ్ములనుకుర్మఱి శేషుని దిగ్గజంబులన్.

దీనినిబట్టిచూచినను సావిత్రిచరిత్రమున నిఁకఁజెప్పవలసినకథయేమియు లేదనిస్పష్టమగుచున్నది.

రఘునాథభూపాలుఁడు పారిజాతాపహరణము, నలచరిత్రము మొదలగుమరికొన్ని ప్రబంధములను రచియించె నందురుకాని యవి యిప్పుడెచ్చటనుగానవచ్చుటలేదు. రామాయణమువలెనేభారతమును గూడ రచించెనందురు. కాని యదియును గానరాదు. సావిత్రికళ్యాణము భారతభాగమని యూహింపఁబడుచున్నది.

అదిసత్యమని పైనివ్రాసిన "అవధరింపుము పాండవేయాగ్రజునకు" నను బద్యమువలన స్పష్టమగుచున్నది. రఘునాథభూపాలుఁడు రామాయణమువలెనే భారతమును గూడ రచించియుండెనేమో. సావిత్రికళ్యాణము, నలచరిత్రము మొదలగునవి యందలి భాగములేమో చెప్పలేకున్నాము.

ఈతని కవిపండితపోషణమునుగూర్చియు, గ్రంథరచనమును గూర్చియు నెంతవ్రాసినను తనివితీరదు. కాని యీతనిచరిత్రమును

గ్లుప్తముగ వ్రాయుదుమని నేననినమాటలను నిలుపుకొనుటకై యీ విషయమును నింతటితో వదలి వైచుచున్నాడను.

ఈతఁడు తంజావూరునకుఁ బ్రభువుగానుండి బలపరాక్రమము లను గనబరచుచు చేసిన ఘనకార్యములను గొన్నిటిని దెలుపు చున్నాడను.

ఈరఘునాథనాయకుఁడు తంజావూరును బాలించుట కారం భించిన కాలములోఁ గర్ణాటరాజ్యమును వసుచరిత్రను గృతినందిన తిరుమలరాయల మూఁడవకుమారుఁ డగు వెంకటపతిరాయలు పాలిం చుచుండెను. వెంకటపతిరాయలు క్రీ. శ. ౧౬౧౪ వ సంవత్సరం అక్టోబరు నెలలోమృతినందినాఁడు. ఇతనికిపురుషసంతతి లేదు. అయిదు గురుభార్యలు. ఇందు ఓబమ్మ భర్తతో సహగమనము చేసినది. వెంకటపతిరాయలు జీవించియుండగా నతని యన్నయైన రామరాయల కుమారుఁడైన శ్రీరంగరాయలను దగ్గరనుంచుకొని పెంచెను. చని పోవునప్పు డా శ్రీరంగరాయలను రాజుగాఁ జేయవలసినదని యాజ్ఞా పించి చనిపోయెను. వెంకటపతిరాయల రెండవభార్యయైన వెంక టమ్మ గొబ్బూరి జగ్గరాయలకుమార్తె. ఆమె తనతండ్రియైన జగ్గ రాయలమాట ననుసరించి శ్రీరంగరాయలను రాజుగాఁ జేయుటకిష్ట పడక తనకదివఱకే యొకకుమారుఁ డున్నాఁడనియు, నాతని రాజుగాఁ జేయవలెననియుఁ బ్రకటించెను. దీనితో నారాజకుటుంబమున నంతః కలహములు చెలరేగెను. శ్రీరంగరాయల దొకపక్షము వెంకటమ్మ పక్షమున గొబ్బూరి జగ్గరాయలదొకపక్షము – తుదకొకనాఁటి యర్థ రాత్రిమున, జగ్గరాయలు ససైన్యుఁడై ప్రచ్ఛన్నముగా నంతః పురమునఁ బ్రవేశించి శ్రీరంగరాయలను సపుత్రికముగా నిద్రవోవు చున్నవారిని ఘోరముగాఁ జంపించెను — ఈఘోరహత్యాసమయ మునందచ్చటనున్నవారిలోఁ గర్ణాటరాజ్యము నందభిమానముగల యాచమనాయకుఁడు,పద్మనాయకకులావతంసుఁడునగు సేనాధిపతియొక

చాకలివానిసాహాయ్యమున నా శ్రీరంగరాయల కొమరులలో, రామ రాయలను పేరుగలబాలుని నన్నలకు దాటించెను. కాని యాబాలుని సంరక్షించువారెవ్వరాయని యాలోచించుకొని చుట్టుపక్కల వారం దఱును గర్ణాటరాజ్యము నెడల నసూయగలవారుగనో, గొబ్బూరిజగ్గ రాయలకు భయపడువారుగనో యుండుటచే నెక్కడను నాబాలునకు రక్షణముండదనియెంచి, తంజావూరు రాజ్యము మొదటినుండియు, దనకు రాజ్యశ్రీప్రదాతలగు కర్ణాటక రాజులయెడల భక్తిప్రేమలను గలిగియుండుటయు, నందునిప్పుడు రఘునాథరాయలు తేజోవంతుఁడై రణధీరుఁడైయుండుటయు నెఱింగి, జరిగినవృత్తాంతమును దెలుపుచు, నారాజబాలకుని గాపాడుభారమును వహింపవలసినదని రఘునాథరా యలకువర్తమాన మంపెను.

ఆవర్తమానముతోఁ గూడనచ్చినరామరాయలను బాలుని స్వీకరించి యాతని రక్షణభారమును బూర్తిగఁ దానువహించి రఘు నాథరాయలు కర్ణాటరాజ్యమును నారవీటివారి వంశమునందుంచుటకు నిశ్చయించెను. దీనితో గొబ్బూరివారికిని, నీతనికిని గలహములు ప్రారంభములైనవి. ఎట్లైనను గర్ణాటరాజ్యమును రామరాయల యందునుంచవలెనని రఘునాథరాయలును, దనస్వాధీనముచేసికొనవలె నని గొబ్బూరి జగ్గరాయలును విశేషప్రయత్నములను జేయుచుఁ దమ కోర్కెలనీడేర్చుకొనఁ జూచుచుండిరి. తుదకీయిరువురకును దోపూరు వద్ద మహాయుద్ధము జరిగినది. ఆయుద్ధము నలసంవత్సర ఆషాఢశుద్ధ పంచమినాఁడు జరిగెనఁట! ఆదినము క్రీ.శ. 1616వ సంవత్సరముజూన్ నెల 27 తేదియని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రఘునాథా భ్యుదయ గ్రంథపీఠికలో నిర్ణయించియున్నారు. అందీరఘునాథ రాయలు విజయముగాంచి యారామరాయలను బాలుని కర్ణాట రాజ్యమునఁ బట్టాభిషిక్తునిగఁ జేసెనఁట.

రామాయణగద్యయందలి 'కర్ణాటరాజపూజనీయధౌరంధర్య' యను వాక్యమువలన నీవృత్తాంతము విదితమగుచున్నది. ఇదియీతఁడొనర్చినరాజకీయఘన కార్యములలో నొకటి.

రెండవది:— ఈరఘునాథరాయలు తంజావూరురాజ్యమును బాలించుకాలములో నిప్పుడుసింహాళమనిపిలువబడుప్రదేశమున పోర్చుగీసులని పిలువబడువిదేశీయులు వర్తకమునకు వచ్చియచ్చట వ్యాపారమును జేయుచుండెడివారు. వారు తమవర్తకసంరక్షణ నెపమునఁ గొంతసైన్యమునుగూడఁ దీసికొనివచ్చి యచ్చటనుంచిరి. వారుక్రమక్రమముగా బలవంతులై తమసైన్యసాహాయ్యమున నాసింహాళమునందు రాజ్యభారమునఁ జేయఁగల్పించుకొనఁ జొచ్చిరి. ఇప్పుడు 'జాఫ్నా'యని పిలువబడెడిప్రదేశమున రాజ్యాధికారమును జేపట్టవలెనని సంకల్పించుకొని ఆదేశమును బరిపాలించురాజునకు వ్యతిరేకులై యారాజును, ప్రజలను బీడింపమొదలిడిరి. ఆరాజు చేయునది లేక తనను గాపాడుమని రఘునాథరాయలను వేడుకొని శరణుచొచ్చెను. సింహాళమురఘునాథరాయలపాలనములోనున్న ప్రదేశమునకెదురుగా నుండెను. కాని యీరెంటికి నడుమ సముద్రమున్నది. పోర్చుగీసువారు సముద్రసంచారమునఁ బ్రవీణులు తుపాకీ, ఫిరంగి మొదలగు యుద్ధముసామగ్రులు విశేషముగా గలవారు రఘునాథరాయల కట్టి సౌకర్యములులేవు. కాని జాఫ్నా విదేశీయులచేతిలో నుండుట కాతని కిష్టములేదు. అందుచే జాఫ్నారాజునకు శరణునిచ్చి యాదేశమును విదేశీయుల దృష్టినుండి తప్పింపవలయునని సంకల్పించుకొని యుద్ధసన్నద్ధులై తనసైన్యమును పడవలమీఁద సముద్రమును దాటించెను. శ్రీరామచంద్రుఁడు రావణసంహారమునకై కట్టినట్లు సేతువు నిర్మింపలేదు. గాని రఘునాథరాయలు పడవలను వంతెనగా నిలిపి తనసైన్యమును దానిపైనుండి యావలకునడపెను. ఇంతేకాదు వేలకొలది యేనుగులను సముద్రములో నీదించుచు నావలిగట్టునకుఁ

జేర్పించెను. ఈగజసైన్యముతోఁ దానుగూడ నొకయేనుఁగు నధిరోహించి నడపించెనట. పోర్చుగీసువారు తుపాకులను, ఫిరంగులను ప్రయోగించుచున్నను వానిని లక్ష్యముసేయక తనసైన్యమునచ్చట దింపి యుద్ధమును ప్రారంభించినతోడనే యాకార్యములను జూచిన పోర్చుగీసు శత్రువులు భయపడి తమయాస్తులను, బంధువులనుగూడ విడిచి యోడలనెక్కి సముద్రములోనుండి పారిపోయిరట. ఇట్లీతడు పోర్చుగీసులనుజయించి యాప్రదేశమున నదివఱకుఁ బాలించుచున్న ప్రభువున కిచ్చివేసెనఁట. ఈవిషయము పై రామాయణగద్యయందలి "సాధిత సముద్రాంతరద్వీపపరనృపాలసంస్తుతప్రతాప, నేపాళ, భూపాలస్థాపనాచార్య"యను వాక్యములవలన సువిదితమగుచున్నది. ఇప్పుడు జాఫ్నా యని పిలువబడెడి ప్రదేశమునాకాలమున నే పా ళ రాజ్యమని యనుచుండెడివారు. అందుచే నీగద్యయందు ''నేపాళ భూపాలసంస్థాపితాచార్య'' యని యుదాహృతమైనది. తోపూరు యుద్ధమునకుఁ గొలదికాలము ముందే యీసముద్రాంతరయుద్ధము జరిగినది.

మూడవది:— ఈ తంజావూరు రాజ్యమునకు చుట్టుప్రక్కల నున్న ప్రదేశములలోఁ జోరులు కాపురములుండి ప్రజలను బాధించుచు దోపిడులుచేయుచు, ప్రాణములను హరించుచు ధౌర్జన్యములు సేయుచుండెడివారు. ఆకాలమున రాక్షసులవలెనుండు నాచోరుల నుండి ప్రజలను గాపాడుటకు శక్తిలేకుండెను. ఆదొంగల గుంపులకు చోళకుడనువాఁడు నాయకుఁడుగనుండి యొకసముద్రద్వీపమున నివాసమేర్పరుచుకొని పాండ్య, చోళమండలములకువిశేషాపకృతిగావించుచుండెను. పోర్చుగీసు మొదలగు విదేశీయులు దమ స్వార్థమును గోరి యాదుండగినికి సాయముచేయుచుండిరఁట. పోర్చుగీసులతో యుద్ధము ముగిసిన తరుణముననే రఘునాథరాయలా దుండగీనిపై దండువెడలి హతమొనర్చి లోకము నిష్కంటకము గావించెనట.

రఘునాథరాయలొనర్చిన యిట్టివనేక ఘనకార్యములుకలవు. ఈతని సంస్థానమున సాహిత్యముతోపాటు సంగీతముగూడ మహాభివృద్ధినందినది. సంగీతశాస్త్రమున ననేకగ్రంథములురచియింపబడినవి.

ఈతని కుమారుడైన విజయరాఘవభూపాలు డీతని బలపరాక్రమాదులను విద్యావిషయములను వర్ణించుచు "రఘునాథునాయకాభ్యుదయము"ను పేరనొకద్విపదకావ్యమును 'రఘునాథాభ్యుదయము'ను పేర నొకయక్షగానమును రచించెను. అం దీరఘునాథునాథునిగూర్చి విశేషాంశము లనేకములు వర్ణితములైనవి. అవియన్నియుసత్యములు. ఈతనినిగూర్చి విశేషముగఁ దెలిసికొన నభిలషించువా రాగ్రంథములను జదువదగియున్నది. ఆ గ్రంథములురెండు నొకే సంపుటముగ మదరాసు యూనివర్శిటీవారు ప్రకటించియున్నారు.

పై సంపుటమున సుప్రసిద్ధపరిశోధకులగు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ముఖ్యవిషయములనుబీఠికలో వ్రాసియుండిరి. వానిని రసహీనములగునామాటలతో వ్రాయుటకంటె వానినేయిటవ్రాయుట శ్రేష్ఠమని తలంచి గ్రంథవిస్తరభీతిని వదలి యిట నుదాహరింపనున్నాడను. ఇదియాపీఠికయందు స్వల్పభాగము. మిగిలినభాగమును నాగ్రంథమును జదువవలయునని పాఠకమహాశయులను బ్రార్థించుచు నీకవిచారిత్రమును ముగించుచున్నాఁడను.

## —: రఘునాథ నాయకాభ్యుదయము :—

రాజ్యము పాలించుచుండినకాలమున నుదయమున నిద్రలేచినది మొదలు రాత్రిపరుండఁ బోవువఱకు రఘునాథనాయకుని యొకనాఁటి వృత్త మీకావ్యమునందలి యితివృత్తము. ఆంధ్రనాయకరాజుల కాలమున రాజజీవితమెట్లుండెనో తెలిసికొనుటకీ కావ్యము దర్పణము వంటిది. ఆనాఁటి నాయకరాజులు ధరించువేషభూషలు, చేయు నాహారవిహారములు, గడపువిద్యావినోదములు, పరిశీలించురాజకార్య

కలాపములు—ఇది యది యననేల యన్నియు నింకు సవిస్తరముగ వర్ణితమ్ములైనవి. ఆంధ్రనాయకరాజరాజకీయ జీవితము కర్ణాటాధీశ్వర రాయజీవితమునకుఁ బ్రతిబింబమే. దానిని మనకుఁ జక్కఁగాఁ జిత్రించి చూపునదగుటచేత నీకావ్య మమూల్యమయినది. రాయవాచకముతప్ప యీనాఁటి యాంధ్రరాజ దైనికజీతము నింతప్రస్ఫుటముగఁ గన్నులకుఁ గట్టినట్లుచూపున దీరఘునాథనాయకాభ్యుదయమే కాని మఱియొకటి కానరాదు. ఇందే దీనిగౌరవము కలదు. రఘునాథనాయకుని దేవభూదేవపూజనము, దానాదికములు, మజ్జనభోజనాదులు, కొలువుకూటము విశేషములు, విద్యావినోదములు, పురవీథుల విహారయాత్ర, యారామవిహారము మొదలైనవాని వర్ణనములను జదువునప్పుడు మనమాకాలముననున్నట్లే యా విశేషములను మనము సందర్శించుచున్నట్లే తోఁచును. కవికావ్యమునంత వాస్తవికముగఁ దీర్చిదిద్దియున్నాఁడు. ఈకావ్యమున రఘునాథుఁడేనాయకుఁడు. పురవీథుల స్వారివెడలుచుండినతఱి జాలమార్గముననొక పౌర సుందరిచిత్రరేఖ రఘునాథనాయకునిజూచి యాతనిని వలచి మరుశారికి లోనయి విరహానలసంతప్తయగును. ఈ సుందరియే నాయిక. ఆమె చెలికత్తెలామె మన్మథసంతాపభరమును బాపుటకామెను నుద్యానవనమునకుఁ గొనిపోయి శైత్యోపచారములుచేసి, దానివలనఁగార్యముఁ గానక మన్మథపూజ చేయింతురు. దానివలనఁగూడ నామెకంతు సంతాపము శాంతింపదు. అప్పు డాసుందరియొద్ద నామె పెంచుచుండిన యొకకీరమురాఁగా నామెదానికిఁ దనవృత్తాంతమంతయుఁ దెలియఁ జెప్పి రఘునాథునిఁ దోడితెమ్మని దానినాతనికడకు రాయబారమంపును. రఘునాథుఁ డారామసీమను విహరించుచుండిన సమయమున నాతనిం జేరనరిగి శుకము తనసందేశమును వినిపించి తనదూతకృత్యమును నెఱవేర్చి నాయికానాయకులకుఁ బొత్తుకుదుర్చును. వారుభయుల సమాగమసౌఖ్యముతోఁ గావ్యమంతమగును. ఈవిధమైన కథా

విధానమును దీసికొని కవిసందర్భోచితముగ పురవర్ణనము, మన్మథో పాలంభము మొదలైన గావ్యలక్షణముల నమరించెను. మూఁడాశ్వాసముల కావ్యమిది. రఘునాథుఁడు పురవీథుల స్వారి వెడలినప్పటి వఱకుఁ గల వృత్తము ప్రథమాశ్వాసమునను, స్వారి వెడలుట మొదలు శుకదౌత్యము వఱకుఁగల కథ ద్వితీయాశ్వాసమునను, రఘునాథ నాయకుని మధ్యాహ్నభోజనాదిక వృత్తవిశేషములు, శుకదౌత్యము, నాయకీనాయక సమాగమము మొదలైనవి తృతీయాశ్వాసమునను నభివర్ణితములైనవి. రఘునాథనాయకాభ్యుదయమునఁ దృతీయాశ్వాస మాశ్వాసాంత్యద్విపదచరణములు లేమి నసంపూర్ణముగఁ గనిపించును గాని కావ్యముపూర్తియైనట్లు రఘునాథాభ్యుదయమువలనఁ దెలియుచున్నది.

రఘునాథాభ్యుదయముకూడ నిదివఱలోఁ జెప్పినట్లు విజయరాఘవనాయకకృతమే, యక్షగానము. రఘునాథనాయకాభ్యుదయకథనే తీసికొని కవి కొన్ని వచనములతోఁ గలిపి యందలి ద్విపదపంక్తులనే నడుమనడుమఁ గథాసంవిధానమును గలుపుట కనుకూలముగఁ బొందించి నాటకరూపమున యక్షగానముగ రచియించెను. యక్షగానకథకూడ నాయికానాయక సమాగమముతో సంపూర్ణమగుటచే రఘునాథనాయకాభ్యుదయకావ్యము నంతటితో సంపూర్ణమైనట్లు తలఁపవలసి యుండును.

రఘునాథనాయకాభ్యుదయమునందలి కవిత్వము పాల్కురికి సోమనాథ, రంగనాథాదులకవిత్వ మంత ప్రౌఢమైనది కాకపోయినను మృదుమధురమై, సరళమై, ధారాశుద్ధిఁగలిగి యొప్పారుచున్నది. విజయరాఘవుఁడు గణనీయులైన ద్విపదకవులలో నొకఁడనుటకు సందియము లేదు. నన్నయాది కవివతంసుల కాలమునాఁటి సంస్కృతపద బంధురమైన తెనుఁగుకవిత తంజావూరి యాంధ్రనాయక రాజుల కాలమునాఁటికిఁ గడుంగడు తెలుఁగుఁదనమును సేకరించుకొని యున్న

విధముల దేశియైనది. ప్రయుక్తములయిన పదములు బహుళముగ నచ్చతెనుఁగులే, యతికోమలములే. ఒక్క యీరఘునాథనాయకాభ్యుదయముననే కాక తెనుఁగుకవితలో వచ్చిన యీమాఱ్పునాకాలము నాఁటి పద్యప్రబంధములలో సయితము చూడగలము. ఈ రఘునాథనాయకాభ్యుదయమునందలి యితివృత్తముకూడ ప్రాచీనప్రబంధ కథావిధానమువలె దీర్ఘముగను, ననేక సంఘటనాత్మకముగనుండక సామాన్యమయి తమిళదేశపు "ఉలా" ప్రబంధపద్ధతిని ననుకరించినది. ఒకవిధముగ నిది తమిళసాహిత్య ప్రభావమనఁ దగునేమో; ఏలన నులాప్రబంధము తమిళమున నతిపురాతనమైనది. తమిళభాషకుఁ గల మొట్టమొదటి సంపూర్ణవ్యాకరణము "తొల్కాప్పియమ్". ఈ వ్యాకరణములోఁ 'బుర త్తినైఇయల్' అను సూత్రమునఁ బ్రత్యేకము లాప్రబంధములను గుఱించి చెప్పఁబడినది. ఇది దేవతల రథోత్సవములకుఁ బ్రసిద్ధ పురుషులగజోత్సవములకు సంబంధించిన వర్ణనలలోఁ గూడినది. ఇందలి యితివృత్త మిట్టియుత్సవము తమవీధినిసాగుచున్నప్పుడు దానినిజూచుట తటస్థించు సప్తవిధగణికలలో నొకవిధమునకుఁ జెందిన కన్యక ప్రేమ ప్రకటనగాథకు సంబంధించినది. దీనిననుసరించి చూడఁగా మనకథలోని నాయికకూడ గణికయై యుండవచ్చునని తోఁచుచున్నది.

ఈకావ్యమునందలి వర్ణనములన్నిటిలో నిచట ముఖ్యముగాఁ జేర్కొనవలసినది తంజాపుర వర్ణనము. తెలుఁగు కావ్యములలో నోరుగంటి నగరమును సవిశేషముగ వర్ణించిన క్రీడాభిరామములోఁ దక్క మఱి వేనియందును మనకావ్యములోవలెఁ బురవిశేషములభివర్ణితములు కాలేదు. పరిఘగోపురప్రాకారాదులు వర్ణించిన వెనుక కవిరాచనగరు నభివర్ణించెను. నగరికిఁ జుట్టును సానికూఁతులయిండ్లున్న వీధులు; ఈవీధులనడుమ ప్రహరితోఁ గూడినకోట. దానిలో బంగారు కలశములతోఁ గూడిన మాజారము. తరువాత గజఘటలుండు "పెనులా

గడప్పుఁబని పెద్దబవంతీ,''చేసువనే గుజ్జుములుండు ''పటానిబవంతి'' మేడ. తరువాత సంప్రతికరణముల విశాలశాల. సంప్రతికరణములు గ్రామకరణములకంటెఁ బడవిలోఁ బెద్దవారు; కొన్నిగ్రామములను గలియఁజేర్చి యేర్పాటుచేసిన ఖండమునకుఁగాని, పెద్దరాజ్యవిభాగమునకుఁగాని యాయవ్యయములకు సంబంధించిన లెక్కలను వ్రాయు పెద్దకరణములకు సంప్రతులనిపేరు. వీరికిఁ గవిలెసంప్రతులనియు వ్యవహారము గలదు. సంప్రతికరణముల విశాలశాలకుఁ దరువాత నున్నది శ్రీరామభద్రశాల. దీనిలో శ్రీరామచంద్రుని భావచిత్రముండెను. ఇదిరంగులతో రచియించిన చిత్రముకాఁదగును. శ్రీరాముని చిత్రమున్న కారణముననే దానికి రామభద్రశాలయని పేరు కలిగినది. ఈశాలకుఁ బిదప కోటవాకిలి. కోటయన నంతఃపురము. కోటవాకిలికడ గుజ్జిగొల్లలెల్లప్పుడును వెదురుకట్టలు పుచ్చుకొని కావలికాయుచుందురు. కోటవాకిలి దాఁటగనే సామంతరాజులు, దొరలు, శ్రేణులుగట్టి వేచియుండు లక్ష్మీవిలాసభవనము. దీనిచెంతనే ''చల్వరాతిచేఁ జెలఁగి సింగపుఁ బని వెళురులఁ గనుపట్టు వాకిలి'' దీని చెంగటఁ బున్నాగవృక్షశీతలచ్ఛాయను అచ్యుతరంగకూటము, నాగపురీవిలాసగేహము, కులగిరినిబోలిన ''లాఁగుల చప్పరము'' గరడీకూటము, నవరత్నమయమైన నాటకశాల, మదనావతారుఁడైమన్నారుఁడున్న మదనగోపవిలాసమందిరాంగణము§. ఇదిమన్నారుదేవుని దేవాయతనము కాఁదగును. దీనితోఁబాటు పేర్కొనదగినది. ''బంగారుచెక్కడపుఁ జప్పరము''ను చాలవిప్పైమొప్పు చల్వరాజగతి గలిగి పుష్పకవిమానమువలెనున్న శ్రీరామసౌధరాజము♦. పట్టా

§ ఇదియే కావ్యము నాజువపుటలోఁ దెలిపిన మన్నారుకోవెల యగునేమో.

♦ చల్వరాజగతి— ''16 మూళ్ళపొడగు, 13 మూళ్ళ వెడల్పు 1½ మూర యెత్తుగలిగి నిగనిగలు దేరుతూ శ్రీరామసౌధమున నల్ల

భిరాముని భావచిత్రమున్నందువలననే యీసౌధమునకు శ్రీ రామ సౌధరాజమని పేరువచ్చినట్లు కాన్పించును. తంజాపురాంధ్రనాయక రాజచరిత్రకారులగు శ్రీ కురుగంటి సీతారామయ్యగారు శ్రీరామ సౌధరాజమును గుఱించి యిట్లు వ్రాయుచున్నారు.

"వీనిలోఁ (పూర్వోక్తభవనములలో) నిప్పుడు నాయకరాజుల దర్బారుహాలని చూపునట్టి భవనము...... శ్రీరామసౌధమని నా యభిప్రాయము. అందు రామపట్టాభిషేకపటము చిత్రింపఁబడినది. అందువలన దీనికి శ్రీరామసౌధమని నామమిడియుండవచ్చును. ఇం దిప్పుడు తరువాతి మహారాష్ట్రరాజగు "శరభోజి" యొక్క శిలా విగ్రహముకలదు. తచ్ఛిలావిగ్రహముక్రింద పూర్వమునాయకుల కాలమున సింహాసనము క్రిందనుండు నొకమిక్కిలివిశాలమగు చలువ రాయియొకటి కలదు. అదియనేక చరిత్రకారులచే ప్రశంసింపఁ బడియున్నది. తత్కాలపుభవననిర్మాణపద్ధతి యీభవనమువలన తేటపడగలదు. కొయ్యయెచ్చటను నుపయోగించి యుండలేదు.

---

చల్వరాయి యిప్పటికిన్నిగలదు. ఇంతకంటె తక్కువది వేరొకమండ పమున గలదు. బృహదీశ్వరుని కోనెలమీద యింకొకటికలదు"

—తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర; పుట. 31.

గోవిందదీక్షితులవారు రచియించిన "సంగీతసుధ" లో నీభవన రాజములలోఁ గొన్ని వర్ణితములైనవి, చూడుఁడు.

లక్ష్మీవిలాసోఽపిచ భద్రశాలా
శ్రీరామసౌధోఽపిచ హేమకూటః
అన్యాశ్చయత్రాచ్యుత రంగ ముఖ్యా
స్సభాస్సు ధర్మోపమితా జయంతి.

పైనిచెప్పిన నాటకశాలలోనే ఆంధ్రనాయకరాజుల కాలములో విజయరాఘవనాయకుఁడు మొదలైనవారు రచియించిన రూపకము లను ప్రదర్శించెడివారు.

మహారాష్ట్రులేతత్సభామందిరమును వదలి ప్రత్యేకముగా వేసు దర్బారుహాలును కట్టుకొనిరి. అది యిప్పటికిని కుడ్యచిత్రకర్మసమేతమై ప్రకాశించుచున్నది. చూపువలననే వెనుకటి దానికంటె నిది యధునాతనమని తెలియగలదు. వెనుకటినాయకులు కట్టినట్లుంచక మహారాష్ట్రరాజులు కోటను మార్చినట్లు స్పష్టము.

శ్రీరామసౌధరాజమునకుఁ బిదప బంగారు తలుపులుగల విజయభవనరాజము. అచ్చట వేదికమీఁద నెల్లప్పుడును గంచుకి వర్గము కావలికాయుచుండును. ఈవిజయభవనరాజస్వర్ణకవాటఘటిత మార్గము నధిగమించినచో నిందిరామందిరము. * మందిరములలోని కెల్లఁ బ్రశస్తమై మణిమయవిరాజితమైన యద్భుతసదనమిది. చంద్రకాంతపుసంతనపనులతోను, పగడాలకంబములతోను, మగఱాలమునన చేతులతోను, దంతపుఁజేసుళ్ళమొదలఁ జెన్నారమలచిన చీనిపక్షుల తోను, కెంపుఱాపనుల బోదియలతోను, బచ్చఱాపలకల పైకప్పు, ఇంద్రనీలములలోవరితోను, చలువగోడలతోను, గట్టాణిసోగముత్తెముల చికిలికుచ్చులతోను, వైడూర్యపు దారబందములతోను, మగఱాలసంతన మడతతలుపులతోను, నింకననేక చిత్రవిచిత్రాలంకారములతో నిందిరామందిరము నిక్కముగ నిందిరామందిరశోభఁగాఁ బొలుపారుచుండెను. ఈ యిందిరామందిరములో నాయకరాజవిజయగాథలను జిత్రించిన భావచిత్రములు కలవు. ఇందిరామందిరముజోడు విజయరాఘవ విలాసగృహరాజము[1]. ఇట్లనేక మందిరములతోఁ

---

* సంభావనీ యాదృతశాతకుంభ । సంభావళీ సంభృతనూత్నరత్నైః రమ్యావిశేషేణ సభావిభాతి । తంత్రేందిరామందిర నామధేయాః యస్యాస్సమీపే శతశోవిభాంతి । నృపాంగనారత్న నివాసయోగ్యాః గృహావిచిత్రోపవనీ విహార । ప్రాసాద కేళీసరసీ సమేతాః॥ – సంగీతసుధ

1 విజయరాఘవ విలాసభవనములో శారదాధ్వజముండెనట. చెంగల్వకాళకవి యీశారదాధ్వజమును జమత్కారముగఁ దన కావ్యమున నభివర్ణించినాఁడు.

జూడ వేడుకరైనది తంజాపురాంధ్రనాయకరాజసదనము. ఇందిరా మందిరములో నొకనాఁడు వేఁకువ రఘునాథనాయకుఁడు నిద్రమేల్కొనుటతోనే మన కావ్యములోని కథయారంభమగును.

కవియైన విజయరాఘవనాయకుఁడు సందర్భానుసారముగాఁ దనకాలమున వాడుకలోనుండిన యాచారమర్యాదలు, జంత్రవాద్యములు, నాట్యములు, స్వర్ణాభరణవిశేషములు మొదలైనవి పేర్కొని యున్నాఁడు. ఈవర్ణనలను బురస్కరించుకొని మనమానాఁటియాంధ్రనాయకరాజజీవితమును జక్కఁగా నవబోధముసేసికొని కంటికిఁ గట్టినట్లు పునర్నిర్మింపవచ్చును.

ఆంధ్రనాయకరాజుల కాలమున వాడుకలోనుండిన జంత్రవాద్యములివి: వీణె, మురళి, రబాబు, తంబుర, కిన్నర, ముఖవీణె, స్వరమండలము, రావణహస్తము, చెంగు, దండె, డక్క, గట్టివాద్యము, తాళము; వీనినిఁ బదచాళి, పేరణి, జక్కిణి, కొరవంజి, గుజరాతి, దేశి, దురుపదకేళిక, శివలీల మొదలైన నాట్యబంధముల నభినయించు సందర్భమున వాయించువారు. ఉత్సవావసరముల వాడుకలోనుండినవాద్యములు చిఱుతమద్దియలు, కాహాళలు, భేరులు, డవిణలు, ఢక్కలు, నాగసరములు, నరగజములు, ధవళశంఖములు మొదలైనవి.

ముద్రికాభరణము, ముత్యాలయొంట్లు, శ్రీరామభద్రతాళి, ముత్యపురాపులు, పెద్దచౌకట్లులు, కంఠమాలికలు, కంటసరము, పచ్చలపదకము, బవిరిచెక్కడపు ముత్తెపుఁదాళి, వజ్రముల యుత్తరిగలు, వజ్రములచేసరులు, మెఱుపుల కడియములు, బాహుపురులు, రత్నాంగుళీయములు, నవరత్నములుతీర్చిన బిరుదు పెండేరము, ఒంట్లు — ఇవి రఘునాథనాయకుఁడుధరించిన యాభరణవిశేషములు. స్త్రీలయాభరణములుగఁ దెలియవచ్చునవివి: ముంగాముురారి, కంకణములు, ఉంగరములు, ముత్యాలమురువులబవిరలు, బుగడలు, కమ్మలు

ముంగర, ముత్యాలకంటె, కంటసరములు, బన్నసరములు, పంజాల పదకములు, కంఠమాలికలు, సరిపెణలు, జాళువాగొలుసులు, ఘుంజాల దండలు, సందిదండలు, గంటలమొలనూలు, ఒడ్డాణము, పచ్చరాపల కలపాదపల్లవము, అందియలు, గిలుకుమట్టియలు, జాళువాకడియము, పెంచురతనాలకుచ్చు, కిరీటి, బవిరపదము భ్రిమర మనుసంస్కృత శబ్దము వికృతియేమో. భ్రిమరకములను ఆభరణవిశేషముగ ప్రాచీన కవులు వర్ణించినారు. బన్నసరమన్నది వర్ణసరము వికృతి; "తత్రైన నీలసంయుక్తముక్తం పూర్వక్రమేణతు, కృతోపన్నసరో నామదర్శనీ యోమనోహరః" అని చాళుక్య సోమేశ్వరుఁడు కంఠాభరణములను వర్ణించు సందర్భమున వర్ణసరమునుగుఱించి తనయభిలషితార్థచింతా మణిలోఁ జెప్పినాఁడు. వేఱువేఱుపకముల రత్నములనుగాని, రంగు రంగులపూసలనుగాని చేర్చి తయారుచేసిన సరమునకు బన్నసరమని పేరు. ఇట్టికంఠాభరణములలోఁ బంజులపదకము లోకరకము. ఇందలి పంజుశబ్దమున కర్థమేమో? పంజుల పదకములవంటివే పంజు కమ్మలను కర్ణాభరణములును గలవు. "పంజుమంచము" కూడ నున్నది. ("పంజుమంచముడిగ్గి మంజుఘోష"); "కడలియందో కోదకముఁవేళఁ బుట్టినపడవంపుఁ దీఁగల పంజుతోడ" అని శ్రీనాథ ప్రయోగము. దీనిననుసరించి చూడఁగా నొకటిరెంటికంటె నెక్కువ గానున్న సన్నని బంగారు తీఁగెగొలుసులు కలియఁజేర్చిన యాభర ణము పంజులపదక మగునని తోఁచుచున్నది.

ఏదోయొకవిందునో, భోజనమునో పురస్కరించుకొని తెలుఁగు వారి భక్ష్య భోజ్యాదిపదార్థములను విస్తరించి వర్ణించిన యాంధ్ర కవులు, శ్రీనాథుఁడు, కాకమాని మూర్తి మొదలైనవారు చాలకొద్ది మందిగలరు. కాని వారు వర్ణించినది బ్రాహ్మణులశాఖాహార భోజ నము. మన రఘునాథనాయకాభ్యుదయమున విజయరాఘవనాయ నయ్యవారుకూడ రఘునాథనాయకుని భోజనాదికములను సవిస్తర ముగ వర్ణించెను. ఇది శూద్రులమాంసాహార భోజనము. మూర్తి,

శ్రీనాథుల భోజనవర్ణనలోవలె నిందు నిర్దైనలు కనిపించక పోవుట గమనింపఁ దగినవిషయము.

భోజనవర్ణనమిషతోఁ గవియీనాఁడు మహారాజ మహానసమునఁ దయారగుచుండిన వంటకములు పెక్కింటి నేకరువుపెట్టినాఁడు. ఆంధ్ర నాయకరాజు లారగించుచుండిన భోజనపదార్థములు పలురకములైనవి. పుష్టినిగూర్చునవి; శాలితండుల ప్రసాదము, బంగారుచాయపప్పులు, సద్యోఘృతము, పచ్చడులు, నీరుమజ్జిగలలో విశేషములేదు. నీరుమజ్జిగయని యది వట్టి తేటమజ్జిగ కాదు.

"సారమౌ జంబీర సారంపు రుచులు
మీఱంగ లవణంబు మితముగాఁ గూర్చి
మేలైన సొంటితో మిళితమైనట్టి
యేలకిపొడి వైచి యింపుదీపింపఁ
దగువట్టివేళ్ళచే తావులు"

కట్టిన, నీరుమజ్జిగయది. పైనచెప్పినవి కాక కప్పురకోడి, కుంకుమకోడి, కస్తూరికోడి, పాలకోడి, కట్టుకోడి, నులువకోడి (?) చేఁపల యూర్పు, చిరంజి, చిక్కుడుకాయల రొయ్యలయూర్పు, సొడికూర వరలు, చలువయీనము(?) ఉప్పురసము, శిఖరిణి మొదలైన రసవర్గము లనేకములు. ఇవికాక పేణీలు, మండెగలు, లడ్వములు, వెన్న కజ్జాయము, మణుఁగుఁబూలు, అతిరసాలు, సారసత్తులు♦, పన్నీరుపాయసము, జీలకరపాయసము, డాల్ వైచినచలువపాయసము, సొజ్జిపాయసము, కరివడలు, దధివడలు, ఆమ్రపువడలు, తెలికుక్కరొట్టె, తెంకాయరొట్టె, సంబారురొట్టె, తెరటుబాలు, తనిబాలు, తెంకాయపాటి, మొదలైన భక్ష్యభోజ్యపానీయాదులనేక విధములైనవి.

♦ సారసత్తులన్న పదము శబ్దరత్నాకరమునఁ గానరాదు. సారె సత్తులని కలదు. దీనినే శ్రీనాథుఁడు కాశీఖండమున "సారె పత్తె" లని వాడినాఁడు. (చూడుఁడు. కా.ఖం. ఆ. 2, పుట 355 వావిళ్ళ వారి ముద్రణము 1916)

ఇట్లే రఘునాథ నాయనివారు స్వారివెడలు సందర్భమున ముస్తీదుచేసి తీసికొనివచ్చిన మైరావత వర్ణనమువలన నాకాలమున బట్టుపుతేనుఁగునకుఁ జేయు నలంకరణవిధానము తెలియఁగలదు.

కావ్యమీ విధమున యథోచితములైన వర్ణన విశేషములతో వీనులకు విందుఁ గొలుపుచుండును. కుంటుగంటులులేని ధారాళమైన మృదుమధుర శైలి విజయరాఘవునిది; చూడుఁ డీక్రింది ద్విపద పంక్తులు:

"చిలుక తేజేయుట చెఱకటవిల్లు
చలి బళీ తుమ్మెద బారట నారి
చెంగల్వవిరులట చికిలివాలమ్ము
లంగంబులేనివాఁడట నేటుకాఁడు
ఆయమ్ములెన్నారి యాయమ్మునాఁటె
నోయమ్మ యిటువంటి యూహాలుగలవె?"

ఇట్లుభావోద్వేగమునఁ బదములు లలితమైన కూర్పులోఁ బడి ప్రతి చరణమునడ్డ మాఁకలులేక పరువులు వారుచుండును. ఆకాలమున మనోరంజకములైన ద్విపదకావ్యములు రచించినకవులలో నీవిజయ రాఘవనాయకుఁడు మేటియని చెప్పుటకు సంశయింపబనిలేదు."

ఈతఁడు క్రీ. శ. 1614 న సంవత్సరమున రాజ్యభారము వహించెనని చరిత్రకారులంద ఱంగీకరించియున్నారు. అప్పటికీతనికి ముప్పదిసంవత్సరముల వయసుండునని తలంచుటలో తప్పుండదు. కావున క్రీ. శ. 1580 సంవత్సరప్రాంతమున నీతఁడు జన్మించియుండు ననియు, రాజ్యమును గుమారునకిచ్చిన తరువాత కొలదికాలము జీవించియుండెనని యనుటచే నరువది సంవత్సరములు జీవించి క్రీ. శ. 1640 సంవత్సరప్రాంతమున నిహలోకమును వీడియుండుననియు నిర్ణయింతము.

# 274. కృష్ణాధ్వరి

ఈకవి తల్లిరాజుఁడు తంజావూరు నాయకప్రభువగు రఘునాథ నాయకభూపాలుని యాస్థానకవి. ఈతఁడు నైషధపారిజాతీయ మను శ్లేషకావ్యమును, రఘునాథభూపాలీయము, కల్యాణకౌముదీకందర్ప నాటకము, శృంగార సంజీవని, తాళచింతామణి, యను సంస్కృత గ్రంథములను రచియించి తనప్రభువైన రఘునాథనాయకున కంకితము చేసియుండెను. ఈతని గ్రంథము లేవియు ముద్రితములు కాలేదు. అయిదాశ్వాసములుగల నైషధపారిజాతీయముయొక్క యముద్రిత ప్రతియొకటి తంజావూరు సరస్వతీమహాలు భాండాగారమున నున్నది. అందు నాల్గాశ్వాసములును నైదవయాశ్వాసమునఁ గొంతభాగము నున్నది. తంజావూరు లిఖిత పుస్తకముల పట్టికయం దీగ్రంథము యొక్క కృత్యాదిపదము లుదాహరింపబడలేదు. అందుచే నీకవిని గురించి యేమియుఁ దెలిసినదికాదు. గ్రంథాంతగద్య యిట్లున్నది.

"ఇది శ్రీమద్రఘునాథపాల నానుభవనిష్ణాత కృష్ణాధ్వరి విరచితం బైన నైషధపారిజాతీయం బనుపుణ్యశ్లోక శ్లేషప్రబంధంబు నందు."

ఈగద్యవలనఁ గూడ కవినిగూర్చిన విశేషము లేమియుఁ దెలియుటలేదు. ఈక్రింది సీసపద్యములో నీ కవిరచించిన గ్రంథ నామములు పేర్కొనబడినవి.

సీ. నవరస శ్రీరఘునాథభూపాలీయ
నామభూమాభీష్టనాయకుండు
నైషధపారిజాతావతారికా హృదయ కా
వ్య స్వయంవరవల్లభుండు

కళ్యాణకౌముదీ కందర్పనాటక
కన్యోద్వాహనబద్ధ కంకణుండు
అమరు కౌ హంకార హారిభంగిక శృం
గార సంజీవనీకాముకుండు

తే. తాళచింతామణీ నఘూతత్పరుండు
మంచిజామాత రఘునాథమనుజనేత
తెలియ నైషధపారిజాతీయ కృతియు
నేపురక్కులచెల్లెలై హెచ్చుననుచు.

ఈ పద్యములో నైషధపారిజాతీయములు రెండునూరులు చెప్పఁబడినవి. రెండవ నైషధపారిజాతీయము, అయిదుగురు రక్కులకుఁ జెల్లెలని చెప్పఁబడుటచే మొదటి నైషధపారిజాతీయము వేయును రెండవ నైషధపారిజాతీయము వేయును, నయినట్లు తోఁచుచున్నది. రెండవది శ్లేషకావ్య మనుమాట నిశ్చయము. ఇందు నలచరిత్రయు కృష్ణచరిత్రయు వచ్చునట్లు చెప్పఁబడినది. మొదటి గ్రంథము నాటకమో, ద్విపదయో యయియుండును. కందర్పకౌముదీనాటక మందలికథ యేదియో తెలియలేదు. పై సీసపద్యముయొక్క నాల్గవ పాదములోఁ జెప్పబడిన శృంగారసంజీవని, యమరుక పండితునిచే రచియింపఁబడిన అమరుకకావ్యమున కాంధ్రీకరణమై యుండునని తోఁచుచున్నది. తాళచింతామణి యందు, సంగీతశాస్త్రముతో సంబంధించిన "తాళ" లక్షణములను గూర్చి చెప్పినట్లు గన్పట్టు చున్నది.

ఈకవినిగూర్చి యింకనేమియుఁ దెలియరాలేదు. నైషధపారి జాతీయమునుండి లభ్యములైన మఱిరెండుపద్యముల నీక్రిందనుదాహ రించి యీకవి చరిత్రమును ముగించుచున్నాఁడను.

శా. శ్రీరామా కు.................. చలమునహుశృంగార లీలాధర
స్మేరాస్యుం డగు సర్వలోక కృతసంసేవ్యుండు దేవుండు నా

నా రూఢిం గణుతించుగాత ఘనదానత్రాత ధౌరంధరీ
ధీరుం డౌ రఘునాథభూమిపతికిన్ దీర్ఘాయురారోగ్యముల్

మ. బలభద్రస్థితి వైరివర్గము నడంపన్ సత్యభామాదు లు
జ్జ్వల సామ్రాజ్యభరాన్వితం దెలుపఁగా శౌర్యాఖ్యచే మాగధా
దులు ధీర్ణానతవర్ణతం జెలఁగ సంతోషశ్రితశ్రీకుఁడౌ
నలభూమీపతి గారవించె మహి నీ న్యాయంబునన్ రుక్మిణిన్.

ఉదాహృత పద్యములను బట్టి యీతని కవిత్వము ప్రౌఢమై మనోహరముగా నుండునని తోఁచుచున్నది.

ఈకృష్ణాధ్వరి రచించిన సంస్కృతాంధ్ర గ్రంథములనుగూర్చి శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు భారతి — రజతోత్సవ సంచికలో విపులమగు వ్యాసమును వ్రాసియున్నారు. పాఠకులది చదువవలయును. ఆవ్యాసమున గ్రంథసమీక్షయే విశేషముగా గలదు. కవినిగూర్చిన విశేషము లేమియు నందు గానరాలేదు.

---

## 275. చేమకూర వెంకటకవి



ఇతఁడు విజయవిలాసము, సారంగధరచరిత్రము, నను రెండు ప్రబంధములను రచియించి తంజావూరునాయక ప్రభువగు రఘునాథ భూపాలున కంకితము చేసెను. ఈ రఘునాథభూపాలుఁడు క్రీ. శ. ౧౬౧౪ మొదలు ౧౬౩౩ వఱకును దంజావూరును బరిపాలించిన నాయకప్రభువు కావున వెంకటకవియు నాకాలమునం దున్నవాఁ డనుటస్పష్టము. రఘునాథభూపాలు డుభయభాషలయందునుగవియుఁ బండితుఁడును, గవిపండితపోషకుఁడు నైయున్నాఁడు. ఈతనిచారి

త్రము నీగ్రంథమున నింతకుముందు వ్రాసియున్నాఁడను. ఇతఁడు రఘునాథుని యాస్థానకవియే గాక యాతనిచే నుద్యోగమునం దున్నట్లీక్రింది పద్యములు సూచించుచున్నవి.

సీ. క్షత్రధర్మమ్మొకద నీకుఁ గలది మొదలఁ
దమ్ములు సుతుల్ హితులుగూడ మమ్ముఁ గొలిచి
తిపుడు కృతియును జెప్పి మా కింపొనర్చి
తొకటఁ గా దన్నిటను బ్రయోజనుఁడ వీవు

చ. అభినవభోజ రాజబిరుదాంకుఁడు శ్రీరఘునాథ శౌరికిన్
శుభకృతు నేలినందులకె సూడిదచేసితి నౌర మిక్కిలిన్
సభల గణింప మన్నన లొసఁగ్గఁ బ్రబంధము నింతయుత్తము
ప్రభునకు నంకితం బొనరుపంగలిగెం గద యంచు వేడుకన్.

ఈతఁడు నీతనిబంధువులును జేసినయుద్యోగము లేవియో తెలియలేదు.

ఈకవి రచించినట్లు చెప్పబడియెడు సారంగధర చరిత్రమును గూర్చి యభిప్రాయభేద మున్నది. దానినిగూర్చితరువాతవ్రాసెదను. ఇతని కులమును గూర్చికూడ నభిప్రాయ భేదమున్నది. ఇతఁడు రచించిన విజయవిలాసమునందుఁ గవి తనకులగోత్రములను గురించి గాని, వంశమునుగూర్చిగాని కృత్యాదియం దేమియుఁ జెప్పియుండ లేదు. గద్యయందు

గద్య:— ఇది శ్రీసూర్యనారాయణ వరప్రసాదలబ్ధ సార స్వత సుధాసారజనిత యశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్య తనయ వినయధురీణ సకలకలాప్రవీణాచ్యుతేంద్ర రఘునాథ భూపాల దత్త హస్తముక్తాకటకవిరాజమాన వెంకటరాజకవిరాజ ప్రణీతం బైన విజయవిలాసం బను మహాప్రబంధమ్మునందు” అని చెప్పఁగొని యున్నాఁడు సారంగధరచరిత్రమునందుఁ గృత్యాదియే లేనందునఁ

గవివృత్తాంత మా గ్రంథమునుబట్టి యేమియుఁ దెలియుటలేదని వేఱుగఁ జెప్పనక్కరలేదు. సామాన్యముగా నియోగిబ్రాహ్మణుల యందు వర్తించు నమాత్యశబ్ద మీగద్యలోఁ గవి తనతండ్రికుపయో గించియుండుటచేత నీతఁడు నియోగిబ్రాహ్మణుఁ డనిస్ఫురించును. ద్వాత్రింశన్మంత్రి సీసమాలికలో "చేమకూర అప్పనమంత్రి" నిజెప్పి యుండుటచే నియోగి బ్రాహ్మణులలో "చేమకూర"యను గృహ నామము కలిగియున్నాడనుమాటయు నిశ్చయమే.

అమాత్యశబ్దము సామాన్యవిధిచే గాక, విశేషవిధి నుపయో గించినాఁ డనుట కట్టి నిదర్శనము లేమియుఁ గాన్పింపవు. కవి తన కులగోత్రసూత్రముల నేమియుఁ జెప్పకపోవుటనుబట్టియు, బ్రాహ్మణ కవులవలె కృతిపతి తనను బిలిపించి సత్కరించి గ్రంథమును రచింపు మని కోరినట్లు చెప్పక తనకుఁదానె కృతినిరచించి, ప్రభువునకు సమ ర్పించినట్లు చెప్పుకొనియుండుటనుబట్టియు నీకవి చేమకూర లక్ష్మణా మాత్యునకు భోగినీపుత్త్రుఁ డని బ్ర. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారును, విజయవిలాస పీఠికాకారులునునిర్ణయించియున్నారు. ఈకవి తన మాతృనామము నెచ్చటను జెప్పలేదు. విజయవిలాస కృత్యాది పద్యములలోఁ గృతిసమర్పణ సందర్భమున రచించినకొన్ని పద్యములను బాఠకుల సౌకర్యముకొఱకు కిట నుదాహరించు చున్నాఁడను.

గీ. అట్టు లోడ్డోలగం బున్నయవసరమున
విన యభయసంభ్రములు నా వెంటనంట
ననుఁ గృపాదృష్టిఁ జల్లఁగాఁ గనుచునుండ
సమ్ముఖమ్మున కరిగి యంజలిఘటించి.

ఉ. ఏలికమాత్రమే మహిమ నీశ్వరుఁడే తలపోసిచూడ నా
పాలిటిరామభద్రుఁడని బంగరుఁబూవుల బూజచేసి నేఁ

జాలనలంకృతిం బొసఁగు సత్కృతి కానుకచేసి కీర్తిభూ
శ్రీలలితాంగులౌ వలవఁ జేసిన శ్రీరఘునాథశౌరికిన్.

ఉ. శ్రీరసభావము ల్వెలయఁ జెప్పి ప్రబంధము లెన్ని యేని మీ
పేరిట నంకితంబిడిన బిడ్డల నెందఱఁ బేరుపెట్టినన్
దీరునె మీఋణం? బయినఁ దెచ్చితిఁ గాన్క పరిగ్రహింపు మ
య్యా! రఘునాథభూపరసికాగ్రణి! మామకకావ్యకన్యకన్.

క. కావున నే నొనరించిన
యీ విజయవిలాస మనెడి కృతిరత్నంబున్
గేవలభక్తినిఁ గానుకఁ
గావించెద నని నితాంతకౌతూహలినై.

వెంకటరాజకవి లోకజ్ఞానశూన్యుఁడు కాఁడు, పదార్థస్వార
స్యము తెలియనివాఁడు కాఁడు. ఏపదముల నేపట్టున నెట్లు ప్రయో
గింపవలయునో యీతనికి సంపూర్ణముగాఁ దెలిసియున్నదని యీతని
విజయవిలాసమును జదివినవారికి స్పష్టముగాఁ దెలియును. పూర్వపు
కవులుకృతిప్రదానము సేయుపట్టుల నెవిధముగా రచియించియుండిరో
వెంకటరాజకవి యెఱుంగనివాఁడు కాఁడు. కృతినాయకుఁడైన
రఘునాథభూపాలుఁడు శూద్రుఁడైన ట్లీక్రింది పద్యములోఁ జెప్పి
యున్నాఁడు.

మ. ప్రకట శ్రీహరియంఘ్రిఁబుట్టి హరుమూర్ధం బెక్కి యాపాద మ
స్తకమున్ వర్ణన కెక్కు దేవి సహజోదంచత్కులోత్పన్న నా
యకరత్నం బని యచ్యుతేంద్రరఘునాథాధీశ్వర స్వామికిన్
సకలైశ్వర్యముల న్నిజేశువలనం జాఁగల్గఁగాఁ జేయుతన్.

నిజముగా వెంకటరాజకవి నియోగిబ్రాహ్మణుఁడే యై
యున్నచోఁ గృతి ప్రదానసందర్భమున నాత్మగౌరవ ప్రదర్శకపద
ముల నుపయోగించునుగాని, పైపద్యములలోని "యంజలిఘటించి"
యిత్యాదిపదముల నుపయోగించియుండఁడు. ప్రభువునందు భక్తి

విశ్వాసములను నమ్రతను జూపుటకై యట్టిపదముల నుపయోగించె నని యనుటకుఁ గూడ వీలులేదు. తనకు న్యూనత కలుగకుండ ప్రభువునందు భక్తి విశ్వాసములను జూపుచు బ్రాహ్మణకవు లనేకు లీపట్టునఁ బద్యములను రచించియుండిరి. అట్లే యీతఁడును రచించి యుండును. వెంకటరాజకవి పాండిత్యకవిత్వములచే గొప్పవాఁడైనను, జాతిచేఁ దక్కువవాఁడగుటచేతనే యట్టిరీతి నవలంబించెనని తలంచు టయే సమంజసముగా నుండును. రఘునాథనాయకుఁడు కవిని గూర్చి పలికినట్లు రచించిన పద్యములయందైనను బ్రాహ్మణకవులను గూర్చి చెప్పినట్లుండక తక్కువవారి విషయమును బలికినట్లుగాఁ గన్పించుచున్నవి. ఆపద్యము లివి:—

క. వాసించుఁ గవిత చెప్పిన
వీసరవోవాకట భక్తివిశ్వాసంబుల్
నీసొమ్ములు సామాన్యుఁడ
వే సూర్యవరప్రసాది విజ్జగ మెఱుఁగన్.

క. అని విన్నవింపఁ జిత్తము
నన లెత్తఁ, బరిగ్రహించి నాపై నింతిం
తనరాని వత్సలత్వము
కనిపింపఁగ హర్షభరవికస్వరముఖుఁడై.

ఈపద్యములయందలి "భక్తివిశ్వాసములు", 'వత్సలత్వము' అనుపదములు గమనింపఁదగినవి. ఈకవి క్షత్రియుఁడని యనుటకును నవకాశము గన్పట్టుటలేదు. క్షత్రియుఁడైనచో పైన నుదాహరించిన పద్యములో "క్షత్రధర్మమ్మొకద నీకుఁగలది మొదల" యనుట స్వారస్యముండదు. ఈక్రింది పద్యమున రాజు ననుగ్రహములచే సఫలయుంపుఁ బూజ్యత గలిగెనని చెప్పుకొనుటను బట్టికూడ, నీతఁడు కులమున దక్కువవాఁడని ధ్వని కలుగుచున్నది.

చ. అభినవభోజ రాజబిరుదాంకుఁడు శ్రీరఘునాథశౌరికిన్
శుభకృతి నేలినందులకె సూడిద చేసితి నౌర మిక్కిలిన్
సభలగణింప మన్ననలొనర్చెఁ బ్రబంధము నిట్టియుత్తమ
ప్రభునకు నంకితం బొనరుపం గలిగెం గద యంచు వేడుకన్.

ఈ పైవిషయములన్నిటి సాక్ష్యీంచిచూడఁగా నీతఁడు భోగినీపుత్త్రుఁ డను ప్రవాదమునందు సత్యమున్నదనియే తోఁచుచున్నది. ఈక్రింది చెప్పఁబోవు కథ యీయూహను బలమొసంగుచున్నది.

"కృష్ణామండలమందలి యమరావతీపురమును రాజధానిగాఁ గలిగిన వాసిరెడ్డి వెంకటాద్రినాయఁడుగారియొద్ద భోగినీ పుత్త్రుఁడగు బుచ్చివెంకను నొకకవి యుండెననియు

సీ. కులమునఁ గలంకు గలదనుకొనుచు మంకు
కేళి గావించికంకు నీకేల కొంకు
కవనమున జంకు నీమీఁదఁ గాదుబొంకు
బుధజనాటవ్యటన్న్యంకు బుచ్చివెంకు.

అని తన్నుఁగూర్చి వెంకటాద్రినాయఁడుగా రనినట్లాతఁడు చెప్పిన పద్యమును విని

క. కొంకక తమరాడిన యది
బొంకే లగు వెంకటాద్రిభూపాలక యీ
న్యంకేల వానికిం గల
రంకే యచ్చోట నిల్పరసవంత మగున్.

అని యీర్ష్యాపరవశు లగుతదాస్థానబ్రాహ్మణకవులు, న్యంకు, రంకు పదములొకే యర్థమిచ్చుటంబట్టి అంకుపదమును శ్లేషించి తనకులము నెత్తిపొడుచుచుఁ జెప్పిరనియు, నందుపై నాతఁడు

ఉ. పన్నిన సత్ప్రబంధమున బాగును నోగును జూడ కీసుచే
మన్ననమాలి మాకులముమాట దలంతురు; చేమకూర వెం
కన్నకు లోపమేమి? కులమా కవనానకు? వెంకటాద్రి రా
జన్న! గణించి మీరలు దయామతిఁ బ్రోచిన నాకుఁ జాలదే?

అని యుత్తరము చెప్పెననియుఁ జెప్పెదరు. కాబట్టి భోగినీ పుత్రుఁడగు బుచ్చివెంకు చేమకూర వెంకన్నకుఁ గులమువలన నేమి లోపము గలిగినదని యాతనిసాటి దెచ్చుకొనుటచే నీ విజయవిలాసమును రచించిన చేమకూర వేంకటరాజు భోగినీపుత్రుఁడని నిశ్చయింపవలసియున్నది.'' — విజయవిలాస పీఠిక.

ఈతఁడు గద్యయందు ''అమాత్య'' అనుపదము నుపయోగింపకున్నచో నీతనిని శూద్రుఁడని నిర్ణయించియుందుము. ఆశబ్దప్రయోగమువలన నీతఁడు భోగినీపుత్రుఁడని చెప్పవలసివచ్చినది. ఇతఁడు తాను నియోగిబ్రాహ్మణుఁడని లోకమును భ్రమింపజేయ నుద్దేశించి యాశబ్దము నుపయోగించెనని యనలేము. కృతిపతిని సమకాలికులను మోసగింపలేఁడుకదా! భావిపరిశోధనమువలన సత్యము నిర్ధారణమగువఱకు నీతఁడు భోగినీపుత్రుఁడనియే నిర్ణయింతము. పండితులలోఁ గొందఱిప్పుడును నీతనిని భోగినీపుత్రుఁడని నిర్ణయించుట కంగీకరింపనివారు కలరు. కాని వారును నీవిషయమున నిదమిత్థమని యాధారసహితముగ నిర్ణయింపఁ జాలకున్నారు. రాజునందు భక్తివిశ్వాసములను నమ్రతను జూపుటకై కవి యట్లు వ్రాసియుండుననియు, నట్లు వ్రాసినవారింకను గొందఱు కవులు గలరనియు వారు వాదించుచున్నారు. ఉభయపక్షములవాదములను జదివి పాఠకమహాశయులు తమకుఁ దోచినరీతిని నిర్ణయించుకొందురుగాక!

రఘునాథభూపాలుఁడు పండితుఁడు. ఉభయభాషలయందును గవిత్వముఁ జెప్పనేర్చినవాఁడు. సంగీతసాహిత్యముల యందసమానప్రజ్ఞాధురీణుఁడు ఈవిషయము నీక్రింది పద్యములో నీ వెంకటకవి స్పష్టపఱచినాఁడు.

మ. కలిగెంగాఁ దనసమ్ముఖంబనియు సత్కారంబు దాఁ జేయనా
 తలనెంతే శిరసావహింతురనియుం దాఁ గాక వేతెందు సా

ఘులకుఁ దిక్కని నిచ్చుటల్ మనుపురీతుల్గాక శక్యంబె వి
ద్యల మెప్పించఁగ నత్యుతేంద్ర రఘునాథస్వామి నెవ్వారికిన్

ఈకవి తన కవితాసామర్థ్యము నీక్రింది రెండు పద్యములలోఁ జెప్పుకొనియున్నాఁడు.

క. ప్రతిపద్యమునందుఁ జమ
త్కృతి గలుగం జెప్పనేర్తు వేల్గేఁ గృతిపై
కృతపాఠము శాఖముగా
క్షితిలో నీమార్గ మెవరికిన్ రాదు సుమీ!

ఉ. తా రసపుష్టిమైఁ బ్రతిపదంబున జాతియు వార్తయు న్చమ
త్కారము నర్థగౌరవము గల్ల ననేకకృతుల్ ప్రసన్న గం
భీరగతి న్రచించి మహిమించినచో నిఁక శక్తులెవ్వ ని
య్యా రఘునాథభూపరసికాగ్రణికిన్ జెవిసోకఁ జెప్పఁగన్.

కవిచెప్పికొనినట్లే యీతని విజయవిలాసమునం దర్థగౌరవము, జాతీయత, లోకోక్తులు తెలుగు శ్లేషలును విశేషముగా నున్నవి. ఆంధ్రభాషయందు రసవత్తరములని చెప్పఁబడు గ్రంథములలో నిది యొకటి. ఈతని కవిత్వము మృదుమధుర పదసంయుతమై ద్రాక్షా పాకమున నత్యంతరమణీయముగా నున్నది. చదివినకొలఁది పాఠకుని హృదయము నానందతరంగములలో నోలలాడించుచుండును. ధ్వని ప్రధానమైన యీగ్రంథము సహృదయులకు నానందదాయక మనుటలో సంశయములేదు. అర్థగాంభీర్య మెంతయున్నను బదములు సులభముగా నుండును. ఇందలి గుణములను వర్ణింపఁబూనినచో నదియొకగ్రంథమగును. ఇతనికవిత్వమునం దచ్చటచ్చట వ్యాకరణ మంగీకరింపని ప్రయోగములున్నను రసమును ప్రధానముగా నెంచి యట్టి ప్రయోగముల కెఱిఁగియుండియే తా వాసంగెనని తలంప వలసియున్నది. అప్పకవి మొదలుగా లక్షణవేత్త లనేకు లీతని గ్రంథమునుండి లక్ష్యములను గైకొనియున్నారు.

ఈతని కవిత్వము వన్నెగాంచుటకుఁ గారణములు పదముల యర్థములకొఱకు నిఘంటువుల సహాయ్య మక్కఱలేకుండుటయు, వర్ణనాంశములు బెడిదముగా లేక, లోకము సామాన్యముగా వాడుకొను నుపమలు, లోకోక్తులు, మనోహరభావములతో గూడియుండుటయు, శ్లేషకొఱ కుపయోగించెడిపదములు గూఢముగా నుండక తేటతెల్లముగా నుండుటయు, ధ్వన్యలంకారము తఱచుగాఁగానవచ్చుటయు నైయున్నయవి.

విజయవిలాసముకథకు మూలము భారతము నందున్నది. అర్జునునితీర్థయాత్రాగమనమును, ఉలూచీచిత్రాంగదాసమాగమంబును, సుభద్రాపరిణయంబును నిందువర్ణితములైనవి. అర్జునునితీర్థయాత్రాగమనకారణమును గవి యీక్రింది పద్యములో వర్ణించియున్నాడు.

మ. ఒక భూమీదివిజుండు చోరహృతధేనూత్తంసుఁడై వేఁడికొం
టకు రా ధర్మజుకేళిమందిరము దండంబోయి కోదండసా
యకముల్ దెచ్చుటఁ బూర్వక్లుప్తసమయన్యాయానుకూలంబుగా
నొకయేఁ డుర్వి ప్రదక్షిణంబగుగ నుద్యోగంబు వాటిల్లినన్.

విజయవిలాస కవిత్వశైలి తెలియుటకై కొన్నిపద్యముల నిందుదాహరించుచున్నాఁడను.

చ. నెరిమియు భక్తియు న్ననఁగు నేర్పు గనంబడఁ బెద్దపిన్నయం
తరువు లెఱింగి మాట జవదాటక చెయ్యులు వేఱలేక యొం
డొరులమనమ్ములో మెలఁగుచుండిరి పాండుకుమారు లెంత నే
ర్పరు లిల నన్నదమ్ముల సరాగము వారలదే సుమీ యనన్. ౧౪

ఉ. శయ్యకుఁ దార్పఁగాఁ దుఱుము జాఱె నదింతటఁ జక్కఁ దిద్దఁబోఁ
బయ్యెద జాఱె నయ్యెదిరిపాటున గ్రిక్కున నీవి జాఱె రా
జయ్యెడ నవ్విలాసిని వెుయారము చూచి కవుంగిలించె నౌ
నెయ్యెడ మేలెఱుఁగరు గ్రహింపరు జాణలు జాఱుపాటులన్. ౧౫

చ. అటుజగదేకసుందరికి నై యతివేషముఁ బూని వచ్చినాఁ
డఁట! తనచేయుభాగ్యమున నప్పుడుఁబోడియె చెంత సేవఁ జే
యుటకని వచ్చియుండునఁట! యొక్కొకపట్టున నొంటిపాటు నౌ
నఁట యతఁ డెప్పు డెప్పు డనుటబ్బుర మే మది తత్తరింపగఁన్. ౨౮

గీ. మేరలా యివి మీయంత వారలకును
బెద్ద లున్నారు వారెఱ్ఱి పెండ్లి సేయఁ
గలరు వేగిరపా టింత వలదటంచు
విన్నపము సేయరాదె యోచిన్నిచిలుక ౨౯

ఉ. అంగన గుబ్బచన్నులుఁగు టంగపుఁగాఁక పసిండికుండలం
బొంగఁదొడంగెఁ జొబ్బిలఁగఁ బూసినగందము తాపవహ్నిం బ్రసం
పంగికటారివీరునకుఁ బాలును బియ్యము లేనిపొంగలో
పొంగ లటంచు నయ్యలకుఁ బోఁడులు సారెకుఁ గేలిసేయఁగన్. ౩౦

ఉ. వేగిరకాఁడు మన్మథుఁడు వెన్కయు ముందును జూడఁ డంతకున్
వేగిరకాఁడు నీవిభుఁడు వీరకటాక్షములంటి యుంతకున్
వేగిరకత్తె నీ వుచితలీలఁ దలంతువొ గ్రక్కనెంతువో
యీగరువంపుసిగ్గు లపు డెక్కడనుండు సరోచలోచనా. ౩౧

కృత్యాదియం దీకవి సుకవిస్తుతి కుకవినింద చేయలేదు. అయినను వసంతఋతువర్ణనావసరమున నతిమృదువుగాఁ గుకవిదూషణ నీ క్రింది పద్యములోఁ జేసియున్నాఁడు.

చ. క్షితిపయి వట్టిమ్రాకులు చిగిర్చె వసంతుఁడు దారసోపగుం
భిత పదవాసనల్ నెఱప మెచ్చక చంద్రుఁడు మిన్నునం బ్రస
న్నతయును సౌకుమార్యముఁ గనంబడ జాల్వరగంగఁ జేసెఁ జే
గతిరచియించి చేని సమకాలమువారలు మెచ్చరేకదా!

ఈ కవి మొట్టమొదట సారంగధర చరిత్రమును రచియించి రఘునాథరాయలకుఁ జదివి వినిపించెననియు నందుపై నతఁడు 'చేమ కూర' మంచిపాకమునఁ బడలేదని యాక్షేపించెననియుఁ బిదప విజయ

విలాసమును రచించి తెచ్చి విన్పింపఁగా నాతఁడు మిగుల సంతసించె ననియుఁ జెప్పుదురు. దీనినిబట్టి సారంగధర చరిత్రమును ముందుగా రచించెననియుఁ బిమ్మట విజయవిలాసము చేయఁ బడియెననియు స్పష్ట మగుచున్నది. ఈగ్రంథద్వయపఠనమువలన నిది సత్యమనియే తోఁచును.

సారంగధరచరిత్రమున నవతరణిక లేదు. ఈ గ్రంథమును రఘునాథనాయకభూపాలున కంకితము చేయఁబడియె ననుట కాశ్వాసాద్యంత పద్యములుదప్ప యితరాధారములు గ్రంథమునఁ గన్పట్టవు. ఇందున్న నాశ్వాసాద్యంత పద్యములైనను, విజయవిలాసము నుండి గ్రహింపఁ బడినవియేకాని యీ గ్రంథము కొఱకు బ్రత్యేకముగ రచింపఁబడినవికావు. రెండు గ్రంథములయం దొకటియే రీతిగఁ బద్యములుండుటకుఁ గారణము దురూహము. ఈ సారంగధరచరిత్రమును చేమకూర వెంకటరాజకవి రచియించెననుట కాధారములు పైన చెప్పిన ప్రవాదమును గ్రంథాంత గద్యయునై యున్నవి. సారంగధరచరిత్రమును వెంకటకవి రచియింపనే లేదనియు, విజయ విలాసమునందలి యాశ్వాసాద్యంత పద్యములును గద్యయు నెవ్వరో తెచ్చి యీగ్రంథమునకుఁ దగిల్చి యుందురనియు నూహించుటకు గూడ నవకాశము కల్గుచున్నది. విజయవిలాసమునఁ దాను సారంగ ధరచరిత్రమును రచియించితినని కవి చెప్పుకొనక యుండుటకూడ నీయూహకుఁ గొంతవఱకు బలము కలుగుచున్నది. కాని రెండు పుస్తకములను జదివిచూచినవారికి, వానియందలి పోకడలనుబట్టియు, శైలినిబట్టియు, నవి రెండును నేకకవి కర్తృకము లని స్ఫుటముగాఁ దోఁచుచుండును.

మదరాసు నందలి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నీ సారంగధర చరిత్రముయొక్క యముద్రితప్రతులు పదివఱకు నున్నవి. వీనిలో నొక్కదానియందు తప్ప తక్కినవానిలో కృత్యాదిలేదు.

ఆశ్వాసాద్యంతపద్యములు గొన్నిటిలో లేవు. ఉన్నను నవి విజయ విలాసమునందున్నవే కాని క్రొత్తవికావు. కృత్యాదియున్న గ్రంథప్రతిలోని మొదటనున్న పద్యముల నీ క్రింద వ్రాయుచున్నాఁడను.

—: విజయవిలాసము :—

ఉ. కోప మొకింతలేదు బుధకోటికిఁ గొంగుపసిండి సత్య మా
రూపము తారతమ్యము లెఱుంగు స్వతంత్రుఁడు సూతనప్రియా
టోపము లేనినిశ్చలుఁ డిటుల్ కృతలక్షణుఁడై చెలంగఁగా
ద్వాపర లక్షణుం డనఁగ వచ్చునొకో యలధర్మనందనున్. ఆ౧

ఉ. ఇగ్గడు వెన్కటం బయికి నీడ్చినఁ బైటఁ దొలంగఁ జేయఁ గో
ల్గాగడు రెమ్మి పోకముడి యూడ్చినఁ గ్రుంగిలి రెంటుకొంగులుం
బిగ్గ నడంచుచుఁ విడిచిపెట్టను బాల నసం బనేమి యా
సిగ్గుకు సిగ్గు లే దిటులు సేసిన పిమ్మట నుండవచ్చునే ఆ౨

చ. ఇలఁగల పిండ్లు సూడ నిపు డేటికిఁ గొత్తిమి పోయినన్ వని
న్నిలువఁ బనేమి నిల్చిన మునింగని తుళ్లఁగ నేల యంతలో
నలిగి శపింప నేమిటికి నాతఁడు వ్రాతఫలంబు దప్పునే
కలిగినవేకదా మకరికల్ మన కెప్పుడు వ్రాసియుండుటల్. ఆ౨

ఉ. భామకుఁ గప్పుదేరు తెగబారెఁడు నిద్దఁపుసోగ వెండ్రుకల్
వేమఱు దువ్వి భాగమున వెన్కకు జాఱఁగఁ గొప్పునెట్ట నో
హో మరివేయి పెట్టినటు లొప్పు నదేమనవచ్చు సొఁ గదా
తామరసాక్షి కెందుఁ దలితండ్రులు పెట్టనిసొమ్ము పెన్నెఱుల్ ఆ౩

ఉ. వీయపురాల నైతి గద వే యిపు డత్తవు తోంటివావి నో
తోయజనేత్రఁ గాంచిన వధూమణి నీసుతఁ బెండ్లియాడఁగా
నాయము నాకుమారునకు నర్మిలి హత్తఁగ నత్తవావిచే
నాయువుగల్గువాఁ డవునటండ్రు శుభంబగు దీన నెంతయున్. ఆ౩

ఈపద్యములు గ్రంథాది పద్యములు కావు. విజయవిలాస మందలి రసవత్తరములగు పద్యములనేర్చి యీవిలేఖరి వాని నీపత్రి

ములందు వ్రాసి యాపత్రముల నీ గ్రంథాదిని జేర్చి యుంచెననుట స్పష్టము.

దీనినిబట్టిచూడఁగా మొత్తముమీఁద సారంగధర చరిత్రము యొక్క యముద్రితప్రతులు పదింటియందును కృత్యాది లేదనుట నిశ్చయము. కృత్యాదిగల ముద్రితాముద్రితప్రతి యొక్కటియేనియు మనకు లభింపలేదు.

గ్రంథముపూర్తియైన పిమ్మట కృత్యాదివ్రాయుట కవిసాంప్రదాయమని యందరెఱింగినదియే. వెంకటకవి గ్రంథమును బూర్తి చేసిన పిమ్మట రాజునకుఁ జదివి వినిపించెననియు మంచిపాకమునఁ బడలేదని రాజుచే నధిక్షేపితమైనందునఁ గృత్యాదినిగాని యాశ్వాసాద్యంత పద్యములనుగాని వ్రాయక దానినట్లే విడిచిపెట్టెననియు ప్రతి విలేఖరి కృత్యాదివ్రాయక, యాశ్వాసాద్యంత పద్యములను విజయ విలాసమునుండి తెచ్చి యిందుఁ జేర్చెననియుఁ దలంచు టవకాశము కలుగుచున్నది.

ఏమయినను నింకను పరిశోధనము గావింపవలసియున్నది. అంత వఱకును నీవిషయమును నిర్ధారణచేయలేము. ఇందువిషయమై భవిష్యత్పరిశోధనమువలన నేమేని కొత్తవిషయములు లభింపగలవను నాశతో నింతటితో నూరకొందును. ఈసందర్భమున నికనొకవిషయ మిట జెప్పవలసియున్నది.

చేమకూర అప్పనకవి సారంగధర చరిత్రమును రచించెననియు దానినిబట్టి తాను ద్విపదకావ్యమును రచించితిననియు బాణాలశంభు కవి తనద్విపదకావ్యమున వ్రాసికొనియున్నాఁడు. అప్పనకవికృత కావ్యము ముద్రితముకాలేదు — కాని అడయారు లైబ్రరీయందొక వ్రాతప్రతియున్నదని విని నేనచ్చటికిఁ బోయిదానిఁ జూడఁ బ్రయత్నించితిని కాని యది శిథిలావస్థలో నుండుటచే, నాగ్రంథాలయా ధికారులు దానిని నాకీయ నిరాకరించిరి. దాని నదివరకుఁ జూచిన

వారిలో నొకరది – వచనకావ్యమనియు, మఱియొకరది పద్యకావ్యమనియు వాకు)చ్చిరి. అందేమైన విశేషము లుండెనేమోయని నాకాశ కల్గుచున్నది.

చిరకాలానుగతమైన వాడుకను బట్టియు, విజయవిలాసకవితతో దీనికిఁ బోలికలుండుటను బట్టియు భావిపరిశోధనము వలన బయల్పడి యెడి సంగతులనుబట్టి, యన్యథా నిర్ణయింపవలసి వచ్చునేడలఁ దప్ప యంతదనుక సారంగధరచరిత్రకర్త యీ వెంకటకవియేయనియు నిది రఘునాథనాయకుల కంకితమీయబడినదనియు నిర్ణయింతము.



## 276. ధరణిదేవుల రామమంత్రి

ఇతఁ డారువేలనియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; నాగయామాత్య పుత్త్రుఁడు. తిమ్మయామాత్య పౌత్త్రుఁడు. ఇతని తల్లి ఘణియమ్మ. ఈకవి దశావతార చరిత్రమను పదియాశ్వాసముల పద్యకావ్యమును మగదల కృష్ణమంత్రి కంకిత మొనర్చెను.

కృతిపతి తనుగూర్చి పలికిన పలుకులు గాఁ గవిరచించిన యీక్రింది పద్యములవలన, నితఁ డష్టభాషాకవిత్వవిశారదుఁ డనియు సంస్కృతాంధ్ర భాషాప్రవీణుఁ డనియు, ద్వినేకప్రబంధ రచనా దక్షుఁడనియుఁ దెలియుచున్నది.

క. నను సంస్కృతాంధ్రభాషా
వినుతు ద్వినేకప్రబంధ విరచన దక్షుం
గనుఁ గొని ధుట్లని పలికె
న్వినయంబునయంబు పెచ్చ విబుధులు మెచ్చన్.

సీ. శ్రీరామకగుణా రసార్యార్థ సంస్కృత
 ప్రాకృతాద్యష్టభాషాకవిత్వ
తత్త్వ సంవేదివి ధరణిదేవుల తిమ్మ
 యామాత్య పౌత్రుండ వన్నదాన
ముఖ్య నానాదాన ముదిత భూసురచంద్రి
 నాగ ప్రధానేంద్రి నందనుఁడవు
ఫణియ మాంబాగర్భ పాథోధి చంద్రుఁడ
 వాత్మవిదగ్రిఘునాయక కాద్యనుజుఁడ
తే. వాప్తుఁడవు గాన వేఁడెద నందముగను
కృష్ణుని దశావతారముల్గ్గతి యొనర్చి
యంకితము సేయ మాకుఁ బ్రఖ్యాతి నీకు
మహితగుణ సాంద్రి రామయామాత్యచంద్ర !

ఇతఁడు కృత్యాదియందు కుకవినింద చేయుసందర్భమున సత్కవి లక్షణముల నీక్రింది పద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. శ్లేషాది పదములు చెలువు సూపఁగఁ బద
 వాక్యార్థ దోషము ల్వర్జములుగ
విమల కైశిక్యాది వృత్తులు దనర వై
 దర్భ్యాది రీతులు దళుకు నెఱప
సరస రత్యాదికస్థాయి భావములు శృం
 గారాది రసముల క్రమము మెఱయ
భావవిభావానుభావ సాత్త్వికభావ
 సంచారిభావ ముల్మించుగులుక
తే. విలసదుపమాద్యలంక్రియల్విం తఁ దెలుప
లలితముగఁ బాకములు సేయ లక్ష్య శయ్యఁ
గవిత రచియింపనేర్చు సత్కవికిఁగాకఁ
గాకవులకేది లోకవిఖ్యాత కీర్తి...

ఈకవి నివాసగ్రామ మేదియో తెలిసికొనుటకుఁ దగినయాధారములు గ్రంథమున గన్పడలేదు కాని నెల్లూరు మండలములోనివాఁడని ప్రతీతి కలదు.

కృతిపతియైన కృష్ణమంత్రి కాశ్యప గోత్రజుఁడైన యాజ్ఞవేలనియోగి బ్రాహ్మణుఁడు. ఇతఁడు గత శతాబ్దాంతము నందు నెల్లూరు మండలములోని ప్రళయ కావేరిపట్టణము నందొలాందా వారి ద్విభాషిగా నుండెనని బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు. దశావతార చరిత్రమునం దీతఁ డొలాందావారి ద్విభాషిగా నున్నాఁడనుట కాధారములు నాకుఁ గన్పడలేదు. కాని కృష్ణమంత్రి తండ్రియైన పద్మనాభామాత్యుఁడు సముద్రతీరవాసి యని యీక్రింది పద్యములోఁ జెప్పియుండుటచేతను ప్రళయకావేరి సముద్రతీరమం దుండుటచేతను, ఈ మగదలవారు పూర్వము నుండియు, ప్రళయకావేరిపట్టణవాసులని యూహింపఁ దగియున్నది.

తే. జలధిమధ్యస్థుఁ డాతఁడు జలధితీర
వాసి యితఁడను నొకమాట వాసిగాక
పద్మనాభుండు మగదల పద్మనాభుఁ
డఖిలలోకావనమున ననన్యసములు.

పంతులుగారు 'గతశతాబ్దాంతమున'నని వ్రాసినదిపొరబాటు. దానిని పదునేడవ శతాబ్ది పూర్వార్థముగా మనము గ్రహింపవలసి యున్నది.

ప్రళయకావేరీపట్టణ మిప్పుడు చెంగల్పట్టు మండలములోఁ జేరి, "Pulicat" అని వాడఁబడుచున్నది. ఇది యొక రేవుపట్టణము. పొన్నేరుకి పదిమైళ్ల దూరమున నున్నది. అది పూర్వము ఒలందా వారు అనగా డచ్చివారి స్వాధీనములో నుండెడిది. ఇది క్రీ. శ. ౧౭౮౧ వ సంవత్సరమున నాంగ్లేయుల వశమైనది. కావున కృష్ణ మంత్రి కాలము పంతులుగారిచినట్లు గతశతాబ్దాంతము కానేరదు.

కృష్ణమంత్రికిఁ బెదతండ్రియైన తిమ్మమంత్రి వీరవెంకటపతి రాయల మంత్రిగానుండి పెక్కు బహుమతుల నందిన ట్లీక్రింది పద్యములోఁ గవి చెప్పియున్నాఁడు.

సీ. సంగీతపుంభావ శారదసాహిత్య
తత్త్వాద్యతన కాళిదాసుఁ డతుల
వితరణైదంయుగీన తపనతనయుండు
భూతదయాదృత భూతలుండు
భక్తిప్రహృష్టనాభాసరోజుఁడు శాశ్వ
తైశ్వర్య పాకశాసనకృతాద్రిసుతుఁడు
దిక్కూలముద్రుజదేది వర్ధనకీర్తి
జాగ్రద్విషంతపశౌర్యశాలి.

తే. వీరవేంకటపతిరాయ విభువతంస
భావితోభయ చామరభద్రదంతి
దంత పల్యంకికాది సన్మాన ఘనుఁడు
ధీమదున్మంత్రి మగదల తిమ్మమంత్రి.

ఈవీరవేంకటపతిరాయలు, వసుచరిత్ర కృతిపతియగు నార్వీటు తిరుమలరాయల కుమారుఁడు. ఇతఁడు క్రీ. శ. ౧౫౮౧ వ సంవత్సరము మొదలు ౧౬౧౪ వఱకును జంద్రగిరిరాజధానిగా, కర్ణాటక రాజ్యమేలినవాఁడు. క్రీ. శ. 1574వ సంవత్సరమునఁ గర్ణాటరాజ్య భారమును వహించిన వీరవెంకటపతిరాయల యొద్ద మంత్రిత్వమును జేయఁదగిన వయసులోనున్న తిమ్మమంత్రి సోదరుని కుమారుఁడగు కృష్ణమంత్రి క్రీ. శ. 1600 సంవత్సరప్రాంతమున జననమందియుండు ననియు నాతఁ డిరువది ముప్పది సంవత్సరముల ప్రాంతమున దశావతారచరిత్రను గృతినంది యుండుననియుఁ దలంచుటలోఁ దప్పుండ దని నాయభిప్రాయము.

వలందులు వర్తకము చేసికొనుటకై మనదేశమునకు క్రీ. శ. 1600 సంవత్సర ప్రాంతమున వచ్చియుండిరని చరిత్రలు చెప్పుచున్నవి. వారియొద్ద నీ కృష్ణమంత్రి 1620—30 సంవత్సరప్రాంతమున ద్విభాషిగా నుండెనని యూహించుటలోను విరుద్ధముండదు. కావున కృష్ణమంత్రి కాలమును క్రీ.శ. 1690-1700 వఱకును కొనిపో నవసరముండదు.

కావున రామమంత్రికవికాలము క్రీ. శ. 1620—30 నడుమ నీగ్రంథము రచియించెనని తలంతము.

ఈ దశావతారచారిత్రమును పుష్పగిరి తిమ్మన యను కవి రచించి యీ రామమంత్రి కొసంగెననియు, దాని నాతఁడు తన పేరఁ బ్రకటించెననియు నొక వదంతి కలదు. కాని యిది యాధార రహితమైన పుక్కిటి పురాణగాథ. కొందఱు కవులనుగూర్చి యిట్టి ప్రతీతులు చాలగలవు. కంకంటి పాపరాజకృతోత్తర రామాయణము గూడ నీతిమ్మకవియే రచియించెనను బ్రతీతి యున్నది. అదికూడ నాధారరహితమైనదియే. కాని యీ రామమంత్రియు, తిమ్మనయు, పాపరాజును సమకాలికులని దీనివలన విదితమగుచున్నది. వారల చారిత్రములను, దీని తరువాత వ్రాయుదును.

కృతిపతియైన కృష్ణమంత్రిని వర్ణించిన పద్యములు పదినఱకు గలవు. అందొక్క పద్యము నిట వ్రాయుచున్నాఁడను.

ఉ. నారదమౌని! ఏమిసురనాథ! విశేషములేమి? వింటిరో
సారసగర్భుచెంగటను శారదలేదఁట! యెందునిల్చెనో?
యారసిచూడుఁ డామగదలాన్వయ దుగ్ధపయోధి రాజమం
దారము కృష్ణమంత్రిరసనాస్థలి నిల్చెను యుక్తమేకదా!

కృతిపతి తండ్రియైన పద్మనాభమంత్రిని పరాక్రమవంతుఁడనియు, బండితుఁడనియు, దాతయనియుఁ బదిపద్యములలో వర్ణించి యున్నాఁడు. అందొక్క పద్యమిట నుదాహరింపఁ బడుచున్నది.

సీ. అపరిహాస్యంబుగా నన్యమతంబుల
యందు శంకఘటించు సౌఘళంబు
నలరామకథల పాయస విభాగంబుల
నేకరీతిగ నిర్వహించు పటిమ
జీవకర్మాన్నాదిభావ మీశ్వర సమ
త్వము గ్రిమంబునఁ దెల్పుతత్త్వ సరణి
ఘనభర్తృ హరిశతకత్రియంబునఁ బ్రీతి
శ్లోకంబునను వింతఁ జూపు సొబగు

తే. మఱియుఁ జాటుపులందు రామాయణాది
బహువిధ గ్రంథములయందుఁ బ్రాజ్ఞులెన్నఁ
బూర్వసిద్ధాంత పక్షములొ్వాసఁగఁ జేయు
భళిరమగదల పద్మనాభ ప్రభుండు.

కృతిపతికిఁ బినతండ్రినారాయణామాత్యుఁడు సానబూదూరిలో కాశిలోవలె నాలయాదులు నిర్మించి న ట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

మ. అగధీరుండగు నారనార్యుఁ డవు రాయాసానబూదూరిలో
దగ విశ్వేశ్వరు నన్నపూర్ణ నటచెంతన్ డుంఠి విఘ్నేశ్వరు
న్నిగమస్తుత్యుని క్షేత్రపాలు మణికర్ణింగల్గఁగాఁ జేసె విం
తగ సాధుల్ఫలధాత్రి భావనయ కాదాయంచుఁ గీర్తింపగన్.

ఈ నారనార్యుఁడు కునుగోటిమాధవయ కుమార్తె వేంకమను రాయసము చెలమయార్యుని తనయునరసమ్మను బరిణయమయ్యెనఁట.

ఈ నారనార్యుని తనయుఁడైన యాదినారాయణ ప్రభువు నవాబుసాహేబుచేత బహుమతులంది నట్లీ క్రింది పద్యములోఁ జెప్పి యున్నాఁడు. కాని యీసాహే బెవ్వరో తెలిసినదికాదు.

సీ॥ ... ... ...
ప్రబలుదేశాధినాథ నవాబుసాహె
బూ వితీర్ణ సువర్ణ జాంబూనదాంబ

రాసముగాఁ బ్రియ బహుమాన భాసమాన
నవ్య విభుఁ డాదినారాయణ ప్రభుండు.

కవి కృతిపతిని, కృతిపతి తండ్రిని, కృతిపతికి మామయైనకొండ వీటి సిద్ధిరాజును, అతని కుమారుఁడైన కొండవీటి యెల్లయామాత్యుని, కృతిపతి తనయులను దనయలను జాల పద్యములలో గీర్తించి యున్నాఁడు. కాని వానిలోఁ జారిత్రాంశములు లేనందున గ్రంథ విస్తర భీతిచే విడచితిని.

కృతిపతికిఁ బెదతండ్రియయిన తిమ్మయమంత్రిని గీర్తించిన పద్యములలో మనోహరముగానున్న యొక్క పద్యము నిట నుదాహరించెదను.

శా. ఏమేజాహ్నవి! యేమిరాఘన! అదేమే వైరినన్నెవ్వ నీ
వేమీ నాసవతిం గణించెవ వదేమీ సీవున్న కాళిందినా?
యేమే నేటికిఁ దెల్లనాయె జలధీంద్రా! తిమ్మమంత్రీశ్వర
శ్రీ మత్కీర్తులు గ్రమ్మఁగానినన నాశ్లేషించు హర్షంబునన్.

ఈ పద్యమునందలి భావము "సరిజేసైరిపుడేల భాస్కరులు" అను పద్యములోని భావము ననుకరించుచున్నది.

దశావతార చరిత్రమునందలి కథ గ్రంథనామమును బట్టి తెలియుచునే యున్నది. శ్రీ మహావిష్ణుని పది యవతారముల చరిత్రములను బది యాశ్వాసములలోను వర్ణించియున్నాఁడు. ఈకవికవిత్వమనర్గళధారకలిగి మృదు శైలిని మనోహరముగా నున్నది. వ్యాకరణ మంగీకరింపని టుకార సంధులు మొదలైన నెరసులు కొన్ని యెడనెడ కలవు గాని, యవి ప్రయోగించినచోట్ల నాశబ్దములట్లే యుండిన బాగుండునని తోఁచునుగాని కొన్ని యపప్రయోగములవలె శ్రవణకఠోరములుగా నుండవు. అట్టి ప్రయోగము నంగీకరించుచు వ్యాకరణమును సవరించుట మంచిదని తోపింపఁ జేయుచుండును.

కవిత్వశైలి తెలియుటకై పది యాశ్వాసములనుండియుఁ బది పద్యములనిట నుదాహరించుచున్నాఁడను. ఈతఁ డచ్చటచ్చట గొన్ని పద్యములయందు "అద్యభవేత్తవ సర్వమంగళావ్యాప్తిః" పౌణాకృతి, నాభౌసరోజుఁడు. ఇత్యాది సంస్కృత వాక్యములను జొప్పించియున్నాఁడు. ఋషివాక్యములగుటచేఁ గాబోలు నీక్రింది పద్యమున నంతమునఁ దప్ప మిగిలినభాగమునంతయు సంస్కృతభాష లోనే రచన మొనర్చినాఁడు.

శా. అస్మాన్ పాహిభయాతురాంస్త్రి జగతీ మాప్లావయద్వారిధిః
ర్విస్మార్యానఖ ఉత్వయావయమితో విష్ణోభవాన్ రక్షకః
తస్మాత్త్వాం శరణంగతా అగతికాధావంత ఏతేభృశం
కస్మాదేవముపేక్షసే యనిమునుల్గార్వణ్యా మేపారఁగన్ ...

ఈకవి యచ్చటచ్చట సంస్కృతప్రాకృతపదములే కాకుండ, అరవ, కన్నడ, హిందూస్థానీ భాషాపదములనుగూడ కొలఁదిగా నుపయోగించియున్నాఁడు.

మ. జడుఁ డజ్ఞానము నన్సుఖంబనుచు సంసారాంధకారంబునం
బడి దుఃఖంబుల వెంబడింబడి సుఖంపన్లేక వేసారి నీ
యడుగుల్చిత్తములోఁ దలంచి నుతిసేయున్వాని కారుణ్యపుం
గడగంటం దిలకించి ప్రోతువు జగత్కల్యాణ సంధాయకా! ౧ఆ

శా. శ్రీరాజీవ ముఖివినూతన తనూశృంగార రేఖాది దృ
క్సారంభంబున దేవతావళి సహస్రాక్షత్వముంగోరెవి
స్తారప్రీతి సహస్రనేత్రుఁ డయుతాక్షత్వంబు గాంక్షించె నో
రా రా యాసకు మేరలేదనుట సత్యంబేకదా ధారుణిన్. ౨ఆ

శా. భేదాతీతుఁ డవై జగన్మయుఁ డవై పెంపొందు నీలీల సం
వాదముచే మొనరింపనేర్తుమె 'యతోవాచోనివర్తంతె' యి
త్యాది ప్రాక్తనసూక్తుల్గొప్ప మఱియేమన్నన్మనః ప్రీతి నీ
పాదద్వంద్వము నిల్పికొల్తుమను కంపంబొప్ప సర్వేశ్వరా! 3ఆ

మ. చలపర్ణాంచల చంచలంబయిన సంసారంబు సారంబు గాఁ
దలపంజాలని తప్పు సేయుటను గాంతాపుత్ర సమ్మోహ శృం
ఖలికాద్వంద నిబద్ధులై గృహమహాకారానిరోధార్తి నా
కులులై వారు హరీయటంచు విభునాక్రోశింప మోక్షంబగున్. ౪౯

క. క్షమ మూఁడడుగులు బలి యు
త్తమభక్తి "సదక్షిణాం సతాంబూలం తు
భ్యమహం సంప్రదదేదం
నమమ"యనుచు ధారవోసె నలినాక్షునకున్. ౫౯

చ. బళి బళి నిన్ను మెచ్చితి నపార భుజాబల భీమ రామ నీ
వలయు వరంబు వేఁడుమని వారణ నిచ్చెదనన్నఁ దండ్రి ప
జ్జలజములందు వ్రాలి మునిచంద్ర! యొసంగుము జీవితంబు ల
న్నలకును నాదుతల్లికని నంజమదగ్ని ప్రహృష్టచిత్తుఁడై. ౬౯

శా. ఓరీ! రాజకులాధమా! తెలిసెనో హా! నీదు బ్రాహ్మణ్య నీ
ఘోరాస్త్రంబుల, దానవీహరణ యేకోపంచుఁ గావించి తీ
వారా! తాటక తల్లిగాదుగదవయ్యా భూమినిః క్షత్రిగా
నేరా సేయుట సత్యవాదివవులే నే నెవ్వఁడన్ జెల్పుమా! ౭౯

(పరశురామ శ్రీరామ సంవాదరూపమయిన యీ పద్యము మురారి కవికృతానర్ఘరాఘవ నాటకములోని శ్లోకమున కాంధ్రీకరణము).

మ. మొదలం దొంగగు నేమియాడఁ జనుసొమ్ముల్వ్రాని పైఁ బెట్టి ప
ల్కుదు రెవ్వారిలలో "గతానుగతికో లోకః" యనన్ సత్యమా
నది రామున్న వనీత చోరుఁడనికాదా భక్తిని శ్రేయ స
ప్రిమఁ గృష్ణున్మణి చోరుఁడంచనిమె సత్రాజిత్తు విత్రాసిమై. ౮౯

శా. రంభాభోగముఁ గోరి యాగముల కర్థంబెల్ల వెచ్చించు టా
యంభోదంబులఁ జూచి చెర్వుజలమాత్యంతంబుఁ జల్లించుట
ల్సంభోగేచ్ఛ జనించెనేని మఱివేశ్యారత్నముల్లేరొకో
సంభోగింపఁగ రాదె కానరుజడుల్ జ్ఞానంబు సామాన్యమే. ౭౪

తే. అవని నొక్కొక పుణ్యాత్మురాలు పతిని
జంపకయె జారువెంబడి జరుగుఁగాని
పిట్టపిడుగున మగని జంపింప కిల్లు
వెడల దిల్లాలు కలియుగ విలయవేళ.

ఈ గ్రంథమున శృంగార వర్ణనములను జేయుటకుఁ దగిన యవకాశములు లేకపోయినను, కవి యట్టి వర్ణనములను జేయుటయం దుత్సాహము కలవాఁడై రామావతార ఘట్టమున నహల్యాసంక్రందనులవిలాసచేష్టలును, కృష్ణావతారఘట్టమునగోపికా రాధికాలీలలును గల్పించి శృంగారరసము పుక్కిలింత లగునట్లు వర్ణించియున్నాఁడు. అహల్యా కథా సందర్భమున తారాశశాంకవిజయరాధికా సాంత్వనాదులను మించి మిక్కిలి పచ్చిగా శృంగారరసమును బ్రవహింపఁ జేసి యున్నాడు. పదియవతారములలోఁ జేరకపోయినను, శ్రీకృష్ణుని యవతార కథనుగూడ నిందు చెప్పియున్నాఁడు. ఆశ్వాస విభాగము సమానముగా లేదు. ఏయవతారకథ నెన్నిపద్యములలో వర్ణించినదియు నీక్రింద నిచ్చుచున్నాఁడను.

| | | | |
|---|---|---|---|
| మత్స్యావతారము | ౩౧౧; | కూర్మావతారము | ౬౮౩; |
| వరహావతారము | ౨౩౦; | నరసింహావతారము | ౨౮౩; |
| వామనావతారము | ౧౫౨; | భృగురామావతారము | ౧౬౬; |
| శ్రీరామావతారము | ౫౩౩; | బలరామావతారము | ౧౯౧; |
| శ్రీకృష్ణావతారము | ౨౯౬; | బౌద్ధావతారము | ౭౬; |
| కల్క్యవతారము | ౮౨; | | |

ఈకవి రచించిన దశావతారచారిత్రమును గూర్చి బ్రౌను పండితుఁ డిట్లు వ్రాసియున్నాఁడు.

Note:— "The Dasavataracharitra is considered a particularly difficult book being a masterpiece of poetry.

"In Telugu, as classics, the Ramayana (of Bhaskara) is the easiest. It contains 16000 or 18000 stanzas. The Baratam (of Nannia Bhatt, Errapragada and Ticcana Somiazulu) is the next most difficult 80000 or 90000 verses. Then the Bhagavatam of Bammera Potaraz containing more vedanta than the rest 10917 verses. All these are easier than the Dasavataracharitra."



## 277. పుష్పగిరి తిమ్మనకవి

ఈకవి వెలనాటి వైదికశాఖాబ్రాహ్మణుఁడు; ఆశ్వలాయన సూత్రుఁడు; విశ్వామిత్ర గోత్రుఁడు; అప్పనామాత్యునకును ఓబళాంబకును బుత్త్రుఁడు; వెంకటకృష్ణయ, వెంకటకవియును నాగలింగకవియును సోదరులు; ఈతఁడు హనుమద్భక్తుఁడు.

ఈకవి సమీరకుమారవిజయమను నేడాశ్వాసముల ప్రబంధమును రచియించి, శ్రీరామచంద్రున కర్పించెను. భర్తృహరి నీతిశతకము నాంధ్రీకరించెను. ఈకవి తనను గూర్చి సమీరకుమార విజయమున నిట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. శ్రీహనుమత్పాద సేవాగతాధ్యాత్మ
తత్త్వ కవిత్వ మహత్త్వ విదుఁడ

నాశ్వలాయన సూత్రహారి విశ్వామిత్ర

గోత్రాబ్ధి చంద్రుడఁ గుశలమతిని

అలపుష్పగిరి యప్పనార్యున కౌబళాం

బకును సుపుత్రుండ బ్రహ్మవేత్త

గ్రమైన వేంకటకృష్ణయార్యగ్రణికిని వేం

కటాఖ్య కవీంద్రున కవరజుఁడను

ఆ. సరసగుణయుతుండ వరతిమ్మకవి యా

హ్వాయుఁడ నేను జననమందినుట

కెల్ల ఫలముగల్గఁ గృతి యొక్కటిరచింప

నూహ సేయుచున్న నొక్కనాఁడు.

కవికిఁ బెద్దయన్నయైన వేంకటకృష్ణయ్య బ్రహ్మవేత్త. రెం డవయన్న కవి. ఈతఁ డేమేని గ్రంథములు రచించి యుండెనేమో తెలియదు. ఈకవి కగ్రజుఁ డయిన వెంకటకృష్ణకవియుఁ గవికి మిత్రులగు తాడిపత్రి కేశవపెరుమాళ్లు ప్రబల రఘుపతయ్యయను వారలును సమీరకుమారవిజయమును రచింపుమని కవిని బ్రోత్స హించి నట్లీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

సీ. మాయన్న కృష్ణధీమణియును మత్సఖుల్

ధన్యులంతరుమ్మఖుల్ తాడిపత్రి

పాపనార్యుని జెట్టపట్టనోచిన యెల్ల

మా గర్భశుక్తిని మాక్తికంబు

క్రియనుదయించిన కేశవపెరుమాళ్ల

ప్రబలవంశాబ్ధి తారాకళత్రుఁ

డగు చెన్నుభట్టారకాగ్ర కుమారుండు

రాజయోగవిదుండు రఘుపతియును

ఆ. ఇష్టగోష్ఠినుండి హితులుగావున నాదు

నెమ్మదిని బ్రబంధ నిర్మిమీష

గ్రమ్మఱ యునికి మొఱఁగి నెమ్మియు సమ్మోద
మినుమడింపఁ బలికి రిట్టులనుచు.

మ. నీవు కవిత్వతత్త్వముల నేర్పరి వౌటకు సత్ఫలంబుగాఁ
బావని నీకుసద్గురుఁడుఁ బ్రాణవిభుండు నభీష్టదైవము
గావునఁ దచ్చరిత్రలొడికంబుగఁ గూరిచి సేయుమా! జగ
త్పావనమై ప్రవర్తిలఁ బ్రబంధము దుష్కృతబంధ ముక్తికిన్.

ఈకవికి శ్రీరామచంద్రమూర్తి స్వప్నమునఁ గన్పడి, యీ ప్రబంధమును దనకంకితము సేయుమని యని న ట్లీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

ఉ. ఓయిసుధీంద్ర! నీవిమలయోగ విరోధముసేయ రాము నే
మీయెల నాఁగసీత, వినుమేరఘురాముఁడ మామకుత్సుతుం
బాయకఁ గొల్చితత్కథఁ బ్రబంధముచేసెద నంకితంబుగాఁ
శ్రేయము మాకు నీకెలుక చెల్వగునంచు నదృశ్యమాటయుణ్.

ఈ తిమ్మనార్యుఁడు పండితుఁడు. ప్రౌఢకవి. చక్కని శైలిలో నీకావ్యమును సృష్టించి, కీర్తికాయుఁడైనవాఁడు — కంకంటి పాపరాజకృతమైన యుత్తరరామాయణమును, ధరణీదేవుల రామమంత్రి రచితమైన దశావతారచరిత్రయు నీతని రచనములేయని యొకప్రతీతి కలదు. ఆవిషయమునుగూర్చి యా యా కవుల చారిత్రమున వ్రాయుచున్నాఁడను. పాపరాజును రామమంత్రియు నీతఁడును సమకాలికులు కావున తిమ్మకవి పదునేడవ శతాబ్దిపూర్వార్ధమున నున్నవాఁడని చెప్పవచ్చును.

ఈతఁడు సలక్షణమును ప్రౌఢమును నగు పద్యకవిత్వమును వ్రాయుటయం దాఱితేరినను గొండొకపట్టుల వ్యాకరణవిరుద్ధములైన ప్రయోగములుఁ జేసినాఁడు. ఈతని కవిత్వశైలిఁ దెలియుటకై సమీరకుమారవిజయమునుండిఁ గొన్ని పద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

మ. అనిలోఁ బక్షిముఖుం జయించుటకె యత్యానందముం జెందెదో
జననాథా! దధిసాగరావృత మహాశాకాంతరీ పాంతరం
బున మాయాపురి రాజధానిగ జగంబుల్ గెల్చి పేర్మిన్ శతా
ననుఁడన్ దైత్యుఁడు నిన్ను గెల్తు ననియున్నాఁడయ్య వెయ్యేటికిన్ ౧౬

శా. మాంపాహీతి వచస్కులై భయమునన్ మాటాడలేకంగముల్
గంపింపన్ జపమాలికల్ విడిచి సాక్షాత్కారుద్రక్రియా
సంపన్నుండిదె వచ్చెలోక మ్రుగసింపంబూని యిమ్మేటికిన్
సంపశ్యామి నచింపవే శుభకటాక్షంబుంచవే మా మొకన్. ౨౬

ఉ. రిపుపరిభేదనంబు సవరించి ప్రతాపముమించఁగాననం
త పథమునందుఁ ద్రిమ్మరి పదంపడి రక్తిబయల్పడంగ మో
హాపుసతిఁ జేరుకాంతుని క్రియన్ మనుగెంపు నడంపుఁ గెంపుతో
నపర దిశాంగనంగ దిసెనర్కుఁడు తీవ్రతమాని యయ్యెడన్. ౩౬

సీ. జడివట్టికురియు నిర్ఝరుల పూవులసోన
తావిఁ జెందెకు మిళిందముల మ్రోఁత
బెళుకుఁ జూపులుమించు తళుకుమించ నటించు
తెలిగంటి చెలుల యందియల మ్రోఁత
జయరాజశేఖర! జయధరాత్మభవేశ!
యంచు వేల్పులు సన్నుతించు మ్రోఁత
తంత్రులుసారించి తపసి వీణియమీటఁ
బరగు గీతిపరంపరల మ్రోఁత

తే. మద్దెలల మ్రోఁత ఋషిపాఠ్యమాన వేద
మంత్రముల మ్రోఁత లోకకైమట్టుమీఱి
తనకు శ్రీరామలింగ సంస్థాపనోత్స
వంబు సూచింప నొకయింతడంబు మాని. ౪౬

చ. హరువుగ నొక్కరాగ మనుమాయనుమాయను మాట వీనులం
బొరసిన స్వామికింపయిన పోలికరాగముఁ దానసంగరాల్
గరఁగి ఘుళంఘుళార్భటిఁ జెలంగిననీదగు రాగరక్తిమైఁ
గరఁగెడు సాధలక్ష్మియని కౌఁగిటఁ జేర్చునృపాలుఁడొక్కెడన్ ౫౯

క. ఘన విధము పంజరంబును
బెనఁగొనఁ బలికింప మఱియు బిగియంగఁ దోఁశం
గెను ఊయి చదువఁ బెట్టిన
మనుపతి మతిపోయె ననుట మోఘముగాఁగన్ ౬౦

సీ. మాకుఁ జెప్పెడిబుద్ధి మీకేలలేదని
శిష్యులు గురుల దూషింతురనియు
మగఁడేమి? మనసుకింపగు వాఁడె మగఁడని
యింతులు స్వేచ్ఛ వర్తింతురనియుఁ
గృతకర్మఫలమెవ్వఁ డెఱుఁగుఁ బొమ్మని ద్విజుల్
విహితకృత్యంబులు విడుతురనియు
జదివితిరే వేదశాస్త్రంబులని బుధ
శ్రేణి శూద్రులు పరీక్షింతురనియు

తే. నధికవర్ణులు నీచులై యడఁగ నీచు
లధికవర్ణాఢ్యులై మించురనియు మఱియు
వైపరీత్యంబుగా బుధుల్ పాపకర్మ
కారణంబుగఁ జెప్పిరి కలియుగంబు.

ఈకవి భర్తృహరి శతకత్రయమును దెలిఁగించెనని యందురు కాని నీతిశతకము మాత్రమే యిప్పుడు లభించుచున్నది. ఈసుభాషితత్రిశతి నేనుఁగు లక్ష్మణకవికూడ నాంధ్రీకరించియుండెను. తిమ్మకవి యాంధ్రీకరణముకంటె లక్ష్మణకవి యాంధ్రీకరణము మేలుగా నున్నదని పండితుల యభిప్రాయము. తిమ్మకవి నీతిశతకమునుండి కొన్నిపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

చ. కనఁబడ దెవ్వరే బలిమిఁ గైకొనవచ్చిన నిచ్చలుర్ సుఖం
బెనయఁగఁ జేయు నర్థులకు నిచ్చినహెచ్చు యుగాంతవేళలం
దును జెడదట్టి విద్యయును నూత్నధనంబు గడించికొన్న వా
రిని నవరింపనేరని కుభృత్తులతోడ విరోధ మేటికిన్.

ఉ. ఊరకయున్న మూఁగ వచనోద్ధతిఁ జూపిన గొంటుచేరువన్
జేరినదంట దప్పుల వసించినచో ననమర్థుఁ డోర్వుతో
నోరిచికొన్న భీరుఁడు దురుక్తులుసైఁచిన జాతిహీనుఁ డం,
చారడిఁ బెట్టురాజు వశమౌనృపసేవయగమ్య మేరికిన్.

ఉ. ఆపదలందు ధైర్యము, మహాభ్యుదయంబున నోర్పుఁ, బ్రౌఢ వా
చాపటిమంబు రచ్చలను, సంగరరంగమున న్పరాక్రమా
టోపము, కీర్తినిచ్చయుఁ, గదుర్ వ్యసనంబు శ్రుతిన్దలిర్పఁ బ్రి
జ్ఞాపరు లొప్పుచుందురివి సాజములై తమయందుఁ బొందఁగన్.

చ. అమరులు వార్థిఁ ద్రిచ్చునెడనం దుదయించిన రత్నపాళి హా
ర్యముగనరా హాలాహాలవిషంబున భీతి వహింపరాత్మ న
య్యమృతముఁ గన్నదాఁక విడనప్పనియే తెలుఁగైన ధీరస
త్తములు సునిశ్చితార్థమవుదాఁక ప్రియత్నము మాననేర్తురే.

మదరాసుసందలి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున భాగవతసారమను పేర రెండవస్కంధము మొదలాఱవస్కంధము తుదివఱకునుగల యొకవచనకావ్యమున్నది. అది పామరులకొఱ కుద్దేశింపఁబడి సులభశైలిని వ్యాకరణనియమముల నంతగా పాటింపకుండ వ్రాయఁబడియున్నది. ఆగ్రంథమునకు గద్య యీవిధముగానున్నది.

"ఇది శ్రీమహాభాగవతమహాపురాణకవి తిమ్మనార్యుఁడు లోకోపకారముగా రచించిన వచనకావ్యము. భాగవతం. ద్వితీయ స్కంధం సంపూర్ణం." అరవభాషలో నొకవచనభాగవతము కలదఁట. అందు పుష్పగిరి తిమ్మయ్య తెలుఁగున రచించినదాని ననుసరించి రచియింపఁ బడినట్లున్నదఁట. ఆ యరవ వచనమునకు

మూల మీ తెలుఁగు రచన మీగ్రంథమే కావచ్చునని యీ పుస్తక భాండాగార సంరక్షకులు గ్రంథపట్టికలో వ్రాసియున్నారు. వచన రీతి తెలియుట కాపట్టికలో నీయఁబడిన భాగము నీక్రింద నుదాహ రించుచున్నాఁడను.

“సూతుండు శౌనకాది మహామునులఁజూచి వింటిరా! మునులారా! ఇటువలె నుత్తరపుత్త్రుం డడిగితే ప్రత్యుత్తరముగా శుక యోగి మహానుభావుండు పలికెను. ఓరాజేంద్రా! నీవడిగినప్రశ్నము మంచిది. ఇది పెద్దలు మెత్తురు. వినఁదగినది వేయునేలుం గలవు. వాటిలో నీవడిగినవి ముఖ్యము సంసారమగ్నులకు ఈతత్వము తెలియ గూడదు. కాలమహిమ కనియుఁ గానలేరు. విష్ణుతత్వము వినియు వినలేరు. ప్రాణము విడుచునప్పుడు నారాయణస్మరణ సేయువాని దే భాగ్యము. సేవనే చేయఁదఁగునాడు, పూజింపఁదగువాఁడు, పురు షోత్తముఁడే కాని అన్యుఁడులేఁడు. బ్రహ్మధ్యానము సేయు పరమ యోగులున్ను హరిస్మరణనే సేయుదురు. ద్వాపరయుగమందు మాతండ్రి వ్యాసులు భాగవతము నిర్మించి నాచేతఁ జదివించెను. నేనున్ను హరిగుణములకులోనై చదివితిని”.

ఈతని నివాస మరవదేశమని యొక ప్రతీతికలదు. కాని యాంధ్రకావ్యములను రచించి కొందరాంధ్రకవులకు గ్రంథరచన యందు తోడ్పడి యాంధ్రుడైన కంకంటి పాపరాజాదులకు నప్పు లను గైకొననని ప్రతీతిగల యీమహాకవి నివాసమాంధ్రదేశమనియే భావించుటయుచితమనియు ప్రాయశః నెల్లూరుమండలవాసియనియుఁ దలంచుట యొప్పగునని నాయభిప్రాయము. ఈ విషయమింకను బరిశోధనీయము.

ఏకు మల్లరంగశాయి భాగవత ద్విపదకావ్యముగా రచించి నప్పుడీ తిమ్మకవి సాహాయ్యమును బొందెనట — మరియు కంకంటి

నరసింహకవి యీ తిమ్మకవి సాహాయ్యమును బొంది, విష్ణుమాయా విలాసమును ద్విపదగా రచియించెనందురు.

ఈ తిమ్మకవి చోడేగుంకి యను గ్రామమందుండెడి సరస్వతీ పీఠమున కధ్యక్షుఁడుగా నుండెనఁట.

---

# 278. కంకంటి పాపరాజు

ఈకవి యాఱువేలనియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శ్రీవత్ససగోత్రుఁడు; అప్పయామాత్య నందనుఁడు; అయ్యనమంత్రి పౌత్త్రుఁడు; వల్లభామాత్యునకు లక్ష్మాంబికకుఁ మునిమనుమఁడు. బిదురూరి నరసయకుఁ దిమ్మమకు దౌహిత్రుఁడు; ఇతని తల్లినరసమ్మ పితామహియు నరసమ్మయే.

ఇతఁడు విష్ణుమాయా విలాసమను యక్షగానమును, ఉత్తర రామాయణమను నెనిమిదాశ్వాసముల మహాకావ్యమును రచియించి, శ్రీకృష్ణునకంకితము చేసెను. ఆఱువేలనియోగి బ్రాహ్మణులను దనయుత్తర రామాయణమునం దీతఁ డిట్లు కీర్తించి యున్నాఁడు.

సీ. అఖిల రాజాధిరాజాస్థానజనహృద్య
విద్యావిహారులా ర్వేలవారు
కల్పకబలికర్ణకలశార్ణవో దీర్ణ
వితరణోదారు లా ర్వేలవారు
సజ్జనస్తవనీయ సతత నిర్వ్యాజహా
రి పరోపకారు లా ర్వేలవారు

ఘనదుర్ఘటస్వామికార్య నిర్వాహణ ప్ర
వీణతాధారు లార్వేలవారు.

తే. విమతగర్వాపహారు లార్వేలవార
లట్టి యార్వేలవారిలో నలఘుకీర్తి
వెలయు శ్రీవత్సగోత్రారవింద హేళి
మహితగుణశాలి వల్లభామాత్యమౌళి.

ఈవల్లభామాత్యుఁడే, కవికి ముత్తాత. వాల్మీకి రచితమగు నుత్తర రామాయణము ననుసరించి కవి యుత్తరరామాయణమును రచియించెను. తిక్కనసోమయాజి నిర్వచనోత్తర రామాయణము నంతకు పూర్వమే రచియించియుండెను కదా! దానిచే మరల నీకవి యేల రచించెనను ప్రశ్నకుఁ గవియొసంగిన యుత్తరము నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

మ. వరుసం దిక్కనయజ్వనిర్వచనకావ్యంబై తగం జేసె ను
త్తరరామాయణమందునన్ మఱి ప్రబంధంబూని నిర్మించుటే
సరసత్వంబని ప్రాజ్ఞులారా! నిరసించంబోకుఁ డీ రాఘవ
స్వామిచారిత్రము నెందఱెన్నిగతులన్ వర్ణించినం గ్రాలదే.

ఉ. మానక కర్మభూమిపయి మానుషదేహముతో హితాత్మిత
జ్ఞానమెఱుంగు బ్రాహ్మణుఁడు చారుకవిత్వము నేర్చి జానకీ
జానికథల్ రచింపక యసత్కథలెన్ని రచించెనేనియున్
వాని వివేకమేమిటికి వానికవిత్వమహత్త్వమేటికిన్.

సంస్కృత రామాయణమునందున్న కథలను గ్రహించి, సందర్భోచితముగా వర్ణనాంశములం జేర్చి, ప్రబంధశైలి నీమహాకవి యీయుత్తరరామాయణమును మహాకావ్యమును నిర్మించినాఁడు. ఈయుత్తరరామాయణ ప్రశంసను కవి యీ క్రింది రెండు పద్యములలోఁ జేసియుండెను.

మ. పరమశ్రావ్య మఘవ్యయామితకథాభవ్యంబు దివ్యత్సుధీ
పరిషత్సంతతసేవ్య మబ్జభవ సంభావ్యంబు నైమించు ను

త్తరరామాయణ కావ్యముఁ మ్మృదువచోధారార్థ సందర్భ ని
ర్భర తత్తద్రసముల్ రహింప రచియింపంబూనితిన్ వేడుకన్.

శా. ఆ వాల్మీకిమనీషివర్యమతి మంథాహార్య సంశోభితం
బై విశ్వాతిగ కామితార్థ ఫలదంబై శ్రీపదంబై సుశ
బ్దావాసంబయి మాధురిం దనరు రామాంచత్కథాక్షీర పా
రావారంబు సమాశ్రయింతుఁ గవితా ప్రఖ్యాతి కర్థంబుగన్.

శ్రీమదనగోపాలస్వామి స్వప్నమునఁ గవికిఁ బ్రత్యక్షమై

ఉ. అమ్మహనీయకీర్తి కరుణాన్వితుఁడై యను వత్స! నీ ప్రబం
ధమ్మును దంకితంబుగ నొనర్పు కృతార్థుఁడ వయ్యెదంతె కా
దిమ్మహి వస్తువాహన సమృద్ధ రమారమణీయ భోగభా
గ్యమ్ములుఁ గల్గెడుం గృతియు నారవితారకమై ప్రకాశిలున్.

తే. శ్రీ వెలయుచున్న విష్ణుమాయావిలాస
యక్షగానంబు మాకె సమర్పణముగఁ
జేసి తదియాదిగా మేము నీసుధాను
సారి వాక్కులఁ జొక్కియున్నార మనఘ.

అని యాజ్ఞ యిచ్చెనఁట! అందుపై నీకృతి శ్రీకృష్ణుని కంకి
తముచేసి తనభక్తి నీక్రిందిమూఁడు పద్యములలో వెల్లడించి
యున్నాఁడు.

ఉ. కాంచనగర్భ శంకరముఖత్రిదశేంద్రులు ప్రౌఢరీతిఁ గీ
ర్తించిన మెప్పుతో వినని కృష్ణుఁడు మత్కృతకీర్తనం బ్రహ
ర్షించి వినున్ స్వకీయకృపచే విలసిల్లెడు వాక్కులొంటఁ దా
ర్చించిన చిల్కపల్కు వినఁ బ్రీతివహింపక యుండు రే దొరల్.

శా. వైదర్భీవిలసద్విలాసమునఁ జెల్వంబూని, సత్యోక్తి నెం
తే దీపించి కళిందజోజ్జ్వల రసాప్తిన్మించి భద్రాత్మకం
బై దివ్యద్ధ్వనలక్షణాశ్రియ సమాఖ్యంగాంచు మత్కావ్యమా
హ్లాదంబిచ్చు గ్రహింపఁ గృష్ణునకు నర్థంబేకదా యెయ్యెడన్.

ఈపద్యమున శ్రీకృష్ణునిభార్యల నామములకును గాన్యలక్షణములకును శ్లేషగల్పించి, కావ్యకన్యకాస్వీకృతికి శ్రీకృష్ణుని యర్హతను సూచించినాఁడు.

ఈకావ్యమున నాయికానాయకుల నవరసములను సందర్భోచితముగఁ జూపించినను, నిందుఁ బ్రధానముగనున్నది శృంగారరసము. ఈకవి యలంకారముల నుపయోగించుటలో కడు నేర్పరి. ఆశాస్త్రమును బాగుగా నభ్యసించిన వాఁడని యీతఁడు రచించినపద్యములు చెప్పుచున్నవి. తనప్రియురాండ్ర నలంకరించి యానందించు శ్రీకృష్ణుని శృంగారము నీక్రిందిపద్యములో వర్ణించి కవి తనయలంకార శృంగార రసప్రియత్వమును వ్యక్తీకరించి యున్నాఁడు.

సీ. శ్రీరుక్మిణికి మకరికలు చెక్కులవ్రాసి
సత్యకీల్జడకుఁ బూసగులుసుట్టి
జాంబవతికిఁ గొప్పుచక్కఁగానిడి మిత్ర
విందకుఁ బుక్కిటివిడెమొసంగి
భద్రసిచ్చెంపు గుబ్బలగంధమలఁది సు
దంతకుఁ దిలకమందముగదిద్ది
కాళిందిముఖ ఘర్మకణము గోటనుమీటి
లక్షణ యడుగుల లాక్షయుంచి
తే. నీళకు మణివిభూషణ పాళిదొడగి
నవ్యకువలంబు రాధకర్ణమునఁ జెరివి
వెలఁది మిన్నలు పదియాఱువేలు గొలువ
మించుకృష్ణుని శృంగార మెంచతరమె.

ఈ కవి కేవల కవిమాత్రమే కాక గణితశాస్త్ర విశారదుఁడైనట్లును, రాజనీతిజ్ఞుఁడైనట్లును గద్యలో వ్రాసికొని యున్నాఁడు. గద్యమొక్కింత పెద్దదిగానున్నను, కవి వృత్తాంతమును దెలుపునది కావున నిట నుదాహరించుచున్నాఁడను.

"ఇది శ్రీమదన గోపాలకృపాలలితకటాక్ష వీక్షాసమాసాదిత చతుర్విధానవద్యకవిత్వవిద్యా వధూనాధునాతన భోజరాజ సకల విద్వజ్జనాభివర్ణితోదీర వితీర్ణి వైభవాఢ్య కృతరాజరాజ రాజయోగసామ్రాజ్యలక్ష్మీవిలాస ధురంధరాధిప సభాంతర స్తవనీయ నయకళాయుగంధర బంధుర మనీషావిశేష మంథాన వసుంధరాధరశోభితాగణితశాస్త్రరత్నాకర వినయాదిక గుణరత్నాకర కంకంటి వంశపయఃపారావారపరిపూర్ణ సుధాకరాప్పయామాత్య సంక్రందననందన విజ్ఞాన విభవ విజితసనందన విష్ణుమాయా విలాసాభిధాన యక్షగాననిర్మాణ ప్రవీణతానిధాన పాపరాజ ప్రధాన ప్రణీతంబైన శ్రీమదుత్తరరామాయణంబను మహాకావ్యంబు."

శబ్దాడంబరము కొఱకుఁ జేర్చిన యీగద్యయందలి పదముల వలన నీతఁ డాత్మస్తుతిపరాయణుఁ డనియుఁ, స్వాతిశయ స్వభావము గలవాఁ డని తోపింపఁ జేయుచున్నను, గవి పరాపేక్ష లేనివాఁ డనియుఁ, గొంతభూస్థితి గలవాఁడై గౌరవముగా జీవించుచున్నవాఁ డనియు, స్పష్టమగుచున్నది.

ఈకవికి, ఉత్తరరామాయణ రచనమునం దాతని సహశ్రోత యగు పుష్పగిరి తిమ్మనార్యుఁడు తోడుపడిన ట్లీక్రింది పద్యములలోఁ గవి చెప్పియున్నాఁడు.

మ. హనుమద్దివ్యపదారవింద మకరందానంద నేందిందిరా
త్మునకే నాంధ్రకృతి ప్రకల్పన సమర్థుం బుష్పగిర్యప్పనా
ర్యుని సత్పుత్రునిఁ దిమ్మనాఖ్యకవిచంద్రున్ మత్సహశ్రోతఁ బ్రా
ర్థనసే పిల్వఁగఁ బంచికన్నకల సంతోసంబునన్ జెప్పినన్.

మ. అతఁ డానందముఁ జెంది నన్నుఁ గని యన్నాజాభువాం పైఁడికిం
గృతవర్ణాంచితరత్న మచ్చినటులయ్యెన్ నీవు వాక్ప్రౌఢిమన్
గృతిసేయంగఁ దొడంగు రామకథకుం గృష్ణుండు రాజౌటఁ బ్ర
స్తుతి గావింపఁగ మాకుశక్యమె భవత్పుణ్యప్రభావోన్నతుల్.

తే. అని కిరీటికి శౌరితో నాడైన యట్లు
లమ్మహాకవి సాహాయ్యమాచరింపఁ
గృతినొనర్పఁగ బూనినయేను మొదట
నెంతు మద్వంశవిధమది యెట్టులనిన.

పుష్పగిరి తిమ్మన్నయే, యుత్తరరామాయణమును రచించి నట్లును, పాపరాజున కొతఁ డీయవలసిన యప్పును దీర్చలేక, యందు లకు మాఱుగా, నీగ్రంథమును పాపరాజు రచించినట్లే రచించియిచ్చె ననియు, నొక ప్రతీతికలదు. ఈకథయందలి సత్యాసత్యముల నిర్ణ యించుట దుర్ఘటమైన కార్యము. కాని బలవత్తరమైన సాక్ష్యము న్ననే తప్ప గ్రంథస్థమైయున్న విషయముల నూరక త్రోసిపుచ్చి యిట్టి పుక్కిటి పురాణములను సత్యములుగాభావింపకూడదు. పుష్ప గిరి తిమ్మనార్యుఁడు సమీరకుమారవిజయమును, భర్తృహరి నీతిశతక మును, భాగవత రచనమును రచియించియుండెను. సమీరకుమార విజయ శైలికిని, ఉత్తరరామాయణ శైలికిని విశేషభేదమున్నదనియు, నందుచే నీయుభయగ్రంథకర్తలు నొక్కరుగారనియుఁ బండితులభి ప్రాయమునిచ్చియున్నారు. ఈరెండు గ్రంథములను విమర్శనా పూర్వకముగఁ జదివినవా రిట్లే తలంచెదరు. పాపరాజునకు, తిమ్మ కవి ఋణమీయవలసినమాట వాస్తవమైనను, గ్రంథకర్తృత్వమును దిమ్మకవికారోపించుటకది యొకకారణము గాఁజాలదు.

ఉత్తరరామాయణమందలి కవిత్వమనిర్గళధారా కలితమై ద్రాక్షా పాకమున రమ్యముగా నుండి పాఠకునకు విసువు దోఁపింపక మఱల మఱల చదువవలయునని యుత్సాహము కల్గించుచుండును. శైలి దెలియుటకై కొన్నిపద్యముల నుదాహరించుచున్నాఁడను.

మ. పురుషుండంచుఁ బరేశ్వరుండనుచు వేల్పుంబెద్దయంచున్ మహే
శ్వరుఁ డంచుం బరమాత్ముఁడంచు శ్రుతిశాస్త్రజ్ఞాన పారీణులే
ర్పఱుపంజాలక పెక్కుభేదములనే భవ్యాత్ముమాహింతురా
పరమేశున్ నినుగొల్తు మేము శుభముల్ ప్రాపింపన శ్రాంతముల్ గతి

శా. ప్రావృట్కాల ఘనార్భటుల్ విని శిఖివ్రాతంబు లేతెంచు న
ట్లా వీరాగ్రణిసింహగర్జవిని మున్నాపన్నులై చన్నయా
దేవద్వేషులు క్రమ్మఱన్ మరలి బుద్ధి స్థైర్య శౌర్యాఢ్యులై
గోవిందున్వెసఁదాఁకి మున్పటివలెనన్ ఘోరంబుగాఁ బోరఁగన్.
౨౮

ఉ. రోగికి భక్ష్యభోజ్యముల రోగము హెచ్చగతిన్ బటుక్రియా
యోగికి నీకుమాదృశహితోక్తుల క్రోధముమించుమాటికిన్
నీగుణచర్య లేటికవి నిందగొనర్పఁగ నీకెతెల్లమా
రాఁగలమృత్యువుం బారసి రౌరవబాధల నొందుచున్నెడన్. ౩౮

ఉ. కొప్పొకచేతఁబట్టి మదిఁ గోరికలీరికలెత్తఁ దేనియల్
చిప్పిలుమోవిఁ గ్రోలి నునుచెక్కిలినొక్కుచు గుబ్బలంటుచుం
గప్పురవీడె మిచ్చితమకంబున నీవివదల్చి యంతనీ
గొప్పపిఱుందుపై నొలసికూడినమేటికి స్వర్గమేటికిన్. ౪౮

మ. వఱమూనాంబు కరీంద్రహస్తచలనావర్తభ్రమత్తోయదా
వలి మంథానమహీధర భ్రమణభావంబూన శంఖాబ్జశై
వలకూర్మాదులు తత్తదంగముల శేవల్ గుల్కఁజెల్వయ్యెని
క్కలశాబ్ధిన్ బునరప్సరోజనన శంకాహేతువుల్ చంచలల్. ౫౮

మ. జవరాలొక్కతె దొల్తఁ దన్ను సరసీజాతంబులనొప్పించిన
ట్టి వధూటిన్ మరలన్ బయోజములఁ దాటించంగనంకించియం
బువులన్ దోఁచు నిజస్తనంబు లరుణాంభోజాత కోశంబులం
చు వెసన్ బాణులుచాఁపఁ జూచి నగిరచ్చోనున్న కన్యామణుల్
౬౮

ఉ. అక్కట వైదువర్ణముల యర్భకుఁ డెక్కడమృత్యు వెక్కడే
దిక్కున నింతవింతగలదే తలిదండ్రుల కౌర్ధ్వదేహికం

వెక్కుడఁ బుత్త్రులుండి ఘటియింపుము రాత్మజశోకవహ్నిచేఁ
బొక్కుచుఁ దండ్రి సేయునొకొ పుత్త్రినకుఁ దహనాదికృత్యముల్
౭౬

చ. బుధనుతుఁడౌ ప్రచేతసుని పుత్త్రుఁడవై శత్రులెల్ల నేర్చునే
నధిక తపోవిభూతిఁ జెలునంది యసత్యములాడ నేర్తునే
యధిప మనోవచఃక్రియల నన్యమెఱుంగను సీతఁ క్షీరవా
రిధిసుతకున్ హిమాచలవరేణ్యజకున్ బ్రతిసద్గుణోన్నతిన్. ౭౮

తే. ఈమహాకావ్య మతిభక్తినెవ్వఁడువిను
నతఁ డిహంబున సకల సౌఖ్యములఁ జెంది
తనివిఁగని యంతఁబున రాగమునవిరహిత
శాశ్వత బ్రహ్మలోకవాసంబునొందు ౭౯

రేఫ శకటరేఫమైత్రిమున్నగాఁ గొన్నిదోషంబు లీ కావ్యంబున నున్నను, లాక్షణికు లీతని గ్రంథమునుండి లక్ష్యంబుల గ్రహించుటకుఁ గారణమీతని శైలియందలి మార్గదర్శకమును రచనాపటిమయు నై యున్నది.

ఈకవి యేకాలపువాఁడో తెలిసికొనుట చాలకష్టమైన పనిగా నున్నది. బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారు తమకవుల చరిత్రలో నీకవి నూఱుసంవత్సరముల క్రిందటివాఁడై యుండునని వ్రాసియున్నారు. దానినిబట్టి యీతఁడు 1790 ప్రాంతమువాఁడగును. కాని యిది సత్యముకాదు.

ఈకవి కాలమును నిర్ణయించుటకు నితరకవులను కొందరి నాధారముగా దీసికొనవలసి వచ్చినది. పుష్పగిరి తిమ్మకవి యీతని కాప్తమిత్రుఁడనియు నీతనికి గ్రంథరచనమున సాహాయ్యమొసఁగెననియు పైన నుదహరించిన పద్యములలో నున్నది. ధరణిదేవుల రామమంత్రికృతి దశావతార చారిత్రమునుగూడ నీ పుష్పగిరితిమ్మకవియే రచియించి రామమంత్రి పేరఁ బెట్టెనను కిం వదంతిగలదు.

పేసుమళ్ళ రంగశాయికిఁగూడ నీతిమ్మకవియే గ్రంథరచనమునసాహా య్యమొనర్చెనని చెప్పుచున్నారు. దీనినిబట్టి యీకవులందరును నేక కాలమువారని స్పష్టపడుచున్నదిగదా!

ధరణిదేవుల రామమంత్రి కాలము ననేక కారణములబట్టి క్రీ.శ. 17 శతాబ్దియందు త్తరార్థమని నిర్ణయించియుంటిని. ఆతని చారిత్ర మీసంపుటమందే గలదు. పరికింపుడు. దీనినిబట్టి పాప రాజుకవి కాలము క్రీ.శ. 1660 అని నిర్ణయింతము.

శ్రీ జోగారావుగారు ఆంధ్రపత్రిక సారస్వతానుబంధములో (1955 ఆగష్టు 7వ తేదీని) నీకవికాలమును క్రీ.శ. 1660 ప్రాంతమని మరియొక యాధారముచే నిర్ణయించియున్నారు. అందుచే నీకవి కాల నిర్ణయమునుగూర్చి వ్రాయనక్కఱలేదు. ఈతని తమ్ముఁడైన నరసింహకవి విష్ణుమాయావిలాసమును ద్విపదకావ్యముగారచియించి యున్నాడు. ఆతనికిఁ గూడ నీ పుష్పగిరి తిమ్మకవి సాహాయ్య మొనర్చెనఁట!

పాపరాజకవి రచించిన విష్ణుమాయావిలాసము యక్షగానము లలో నుత్తమమైనది. శ్రీకృష్ణావతారములో సలుపబడిన మాయ లిందు వర్ణితములు. కవిత్వము రసవంతమై పండితపామరహృదయం గమముగా నున్నది. ఇది ముద్రితముకాలేదు. తంజావూరు పుస్తక భాండాగారములో వ్రాతప్రతులున్నవి. ఇది ముద్రణభాగ్య మెప్పు డొందునో!



# 279. కంకంటి నరసింహకవి



"ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; అప్పయార్య నరసమాంబల పుత్త్రుఁడు; అయ్యనమంత్రి పౌత్త్రుఁడు, ఉత్తరరామాయణ కృతికర్తయగు కంకంటి పాపరాజునకుఁ దమ్ముఁడు.

ఇతఁడు విష్ణుమాయావిలాసమను నైదాశ్వాసముల ద్విపద కావ్యమును రచియించి శ్రీరామచంద్రున కంకితము చేసెను. ఇది క్రీ. శ. ౧౮౬౫వ సంవత్సరమున ముద్రితమైనది కాని యా ప్రతు లిప్పుడు లభించుటలేదు. ఆగ్రంథమునఁ గవి తన వంశము నిట్లు వర్ణించియున్నాఁడు."

ఈ పైవాక్యములుగల కాగితమొకటి ఆంధ్రకవితరంగిణి చిత్తు ప్రతులలో నీనడుమ నాకు లభించినది. ఆకాగితము నేను వ్రాసికొనినదియే. కాని యిది యేయాధారమునుబట్టి వ్రాసితినో యందు వ్రాసుకొనలేదు. నాకిప్పుడు జ్ఞాపకమునులేదు. దీనినిగూర్చి పరిశోధనము చేయవలసియున్నది. 1765న సంవత్సరములో ముద్రితమైన ప్రతి యేపుస్తకభాండాగారమందైననున్నదేమో తెలిసికొనవలసియున్నది.



## 280. చేకుమళ్ల రంగశాయి



ఈకవి మధ్వబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు. శ్రీవత్స గోత్రుఁడు; తిప్పనూంబ తల్లి. తండ్రి కప్రియామాత్యుఁడు.

ఈకవి, జానకీపరిణయము, తిరువళ్లూరు వీరరాఘవశతకము, వాణీవిలాసవనమాలిక, భాగవతము ద్విపద, కృష్ణదండకము అను గ్రంథములను రచియించినట్లు కనుపట్టుచున్నది. ఇవి ముద్రితములు కాలేదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున వాణీవిలాస వనమాలికకైను ప్రతులును♦, ద్విపదభాగవతమున కొకప్రతియు§ నున్నవి. తక్కిన గ్రంథములు లభింపలేదు.

వాణీవిలాసమాలికయందలి యీక్రింది పద్యమువలన నీకవి రచించిన గ్రంథముల పేళ్లు తెలియవచ్చుచున్నవి.

చ. ఉరుశుభసన్మతిన్ దిరువలూరపురాధిప వీరరాఘవ
స్థిర శతకంబు, కృష్ణగుణదీపిత దండక మొప్పుజానకీ
పరిణయ యక్షగానమును భాగవత ద్విపద ప్రబంధమున్
విరచనచేసినట్లయిది వేడ్కనొనర్పుము రంగధీనిధీ!

ఈకవి భార్యనామమును, సీతనితనయులైదుగురినామములును నీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నవి.

సీ. ధర మొలురన్వయా మరతరుఫలలీల
మంతు కెక్కిన నంత మంత్రిపత్ని
యగు లక్ష్మమాబయందనువొందఁ గలశాబ్ధి
ఘనవీర శ్రీకాంతకరణిఁ బొడమి

♦ D No 762 to 766

§ R No 697

యన్వర్థనామ్ని యైనట్టి లక్ష్మాంబ శ్రీ
రంగశాయుపరిభరంగుమీఱ
వరునిన్నువరియించి నిరుపమశుభగుణో
దార సద్బాంధవాధార గరిమ
నమరి వేంకటపతి, నచ్చనాఖ్యు, నయ్య
నంతు, వేంకటపతి, జగన్నాథుఁ బద్మ
నాభు బాహులు నాగనందనులఁ గాంచి
ధరణివర్ధిల్లు నీవు నీ ధర్మమమరె.

వాణీవిలాసవనమాలిక రచియించునాఁటికిఁ గవి కైకొనుగుఁడు కుమారు లుండుటచే, నాకాలమునకుఁ గవి కేఁబదేండ్లుండునని తలంపవచ్చును. ఈకవి భార్యపేరు లక్ష్మాంబ. ఈక్రింది గద్యవలన నీగ్రంథమును రచించుటలోఁ గవికి మహంకాళి వెంకటపతికవి సాహాయ్యమొనర్చినట్లు తెలియుచున్నది.

"గద్య: ఇది శ్రీమదలమేల్మంగా వెంకటేశ్వర ప్రసాదాసాదిత కవివిచిత్ర మహంకాళ్యప్ప కొండార్యపుత్రపవిత్రగాత్ర వినయగుణాను నయ వెంకయకవి సహాయ టేకుమేళాన్వయ పాథోధి పూర్ణసుధాకర తిమ్మమాంబాక ప్రియామాత్యకుమార సకలవిద్వజ్జనాధార శ్రీవత్స గోత్రపవిత్ర, ఆపస్తంబసూత్ర సత్కవి ప్రమోదానుసంధాయ రంగ శాయి ప్రణీతంబైన శ్రీవాణీవిలాస వనమాలికయను ప్రబంధంబు నందు... ..."

ఈ వెంకటపతికవి నీక్రింది సీసపద్యములో నితఁడు శ్లాఘించి యున్నాఁడు.

సీ. అతఁ డలకుత్సగోత్రాన్వయ క్షీరపా
రావారతుహినాంశుఁడై వెలుంగు
నన్నపార్యన్నమాంబాత్మజుఁ డగు కోన
యార్యుఁడు లింగాంబయందుఁ గనిన

గుణనిధియునుఁ దప్పకొండాఖ్యుఁ దచ్చమాం
బికయందుఁ గనిన సంప్రీతమతులు
లింగాఖ్యుఁ డలమేలు మంగాకృపాప్తుండు
విశ్రుతసుకృతియౌ వెంకటపతి
ప్రచురలీల చతుర్విధ రచనలెఱుఁగు
నెమ్మినాతఁడు నీకృతి నిర్వహించు
నింపు దళుకొత్త శ్రీవెంకటేశు పేర
నంకితమొనర్పుమనుచు నే హర్షమొంద.

ఈ మహాంకాళి వెంకటకవి యేమయిన గ్రంథములను రచించెనేమో తెలియదు. కవి యింటిపేరు గద్యనుబట్టి ఏకుమేళయని తెలియు చున్నది. కాని వాడుకయందు ఏకుమళ్లయని యున్నది. కాని యీ రెండిటికిని భేదములేదు. ఈక్రింది పద్యములో 'ఏకుమళ్ల' యనియే యున్నది.

గీ. మహిమఁ జెన్నగు శ్రీవత్సమానిగోత్రుఁ
డనఘుతర ఏకుమళ్లాన్వయైక ధర్మ
పురి నృసింహాంఘ్రిభజనార్త నిరతరామ
భద్రగురుభక్తియుతుఁడు తిప్పప్రభుండు.

ఈ ధర్మపురి నైజాము రాష్ట్రములోనిది. ఈ తిప్పమంత్రి, కవికిఁ బూర్వుఁడు. తిప్పమంత్రికుమారుఁడు అప్పయ. ఇతని తనూజుఁడు రామమంత్రి. ఇతని తనయుఁడు కప్పమాత్యుఁడు. ఇతఁడే కవికి జనకుఁడు.

ఈ వంశక్రమ మీక్రింది పద్యముల వలనఁ దెలియనగును.

క. ఆ మంత్రి రామమాంబా
సీమంతినియందుఁ గనియె శ్రితకవిజన
స్తోమ క్షేమంకర వి
ద్యా మహిమోన్నత్యు నప్పయామాత్యు నొగిన్.

ఉ. ఆయత కీర్తిశాలియగు నప్పన గృష్ణురి తిల
క్ష్మాయి శుభప్రదాయిని బుధాడ్య విధేయిని భార్యగాఁగఁ దాఁ
గాయజు వంటి సద్గుణ నికాయుఁ దనూభవుఁ గాంచె వైభవ



## 281. రాచపూఁడి వెంకటయ్య

ఈక్రింది పద్యమీతని చాటుధారయని అప్పకవీయమునం దుదాహరింపఁ బడినది.

క. వ్యాయామజనిత మాయా
పాయ సమస్తాఘములు నివారణమగు దు
ష్కాయంబు పూతమగు గం
గాయిని జూడగన్నఁ జానగూడిన మాత్రిక.

అప్పకవి క్రీ. శ. ౧౬౬౦ ప్రాంతమువాఁ డగుటచే నీకవి యంతకుఁ బూర్వుఁ డనుట స్పష్టము. ఇంతకంటె నీతనినిగూర్చి యింక నేమియుఁ దెలియదు. అప్పకవి యీతని పద్యమును లక్ష్యముగా గ్రహించుటచే, నాకాలమున నీతఁడు సుప్రసిద్ధుఁడై యుండెనని భావింపవచ్చును. రాచపూఁడి యను గ్రామము గుంటూరు మండలములోని వంగవోలు తాలూకాయందున్నది.



# 282. కుమార ధూర్జటి



ఇతఁడు పాకనాటి యాఱువేల నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భరద్వాజగోత్రుఁడు; ధూర్జటికి పౌత్త్రుఁడు; కాళయామాత్యుని పుత్త్రుఁడు.

ఈకవి కృష్ణరాయవిజయ మను నాల్గాశ్వాసముల ప్రబంధమును, ఆర్వీటి చినవెంకటరాజు ప్రేరణచే రచించి, శ్రీరామచంద్రునకు నంకితము చేసెను.

ఇతఁడు రచించిన యీక్రింది పద్యమువలన కవికులగోత్రాదులు తెలియుచున్నవి.

సీ. నను భరద్వాజగోత్రుని సదాపస్తంబ
 సూత్రుని బాంధవస్తోత్రపాత్రు
పాకనాటార్వేలవంశ ప్రసిద్ధుని
 ధూర్జటిపౌత్రు బంధురచరిత్రు
సద్గురుకారుణ్యసంప్రాప్త విద్యావి
 హారుని శ్రీకాళహస్తినిలయ
చిత్రప్రసూనాంబికా శ్రీకరానుగ్రహా
 సాదిత కవితారసజ్ఞహృదయు

తే. సారరచనాధురీణుఁ గుమారధూర్జ
టి ప్రధానాగ్రగణ్యుఁ బటీరహీర
మహితసత్కీర్తి కాళయామాత్యపుత్త్రు
వేంకటార్యునిఁ బిలిపించి వేడ్కనమె

ఈకవికి వెంకటార్యుఁ డని నామాంతర మున్నట్లు పై పద్యమువలనఁ దెలియుచున్నది. గ్రంథాంతమందలి యీక్రింద గద్యను బట్టి యీతఁడు, ఓరుగంటి కాశీపతికి శిష్యుఁ డనియు కాళయామా

త్యలక్ష్మాంబికల కౌరసపుత్త్రుఁ డనియు, పోలనమంత్రి గుర్వమాంబిక లకు దత్తతపుత్త్రుఁ డనియు నెఱుంగనగును. "ఇది శ్రీమదోరుగంటి కాశీపతి సద్గురు రాజయోగీంద్ర చరణారవింద సంధానితమనో విహార నిరంతరానందకర రాజయోగసామ్రాజ్య లక్ష్మీధురంధర స్వస్వరూపానుభవసంపన్న జ్ఞానప్రసూనాంబికా కాళహస్తీశ్వర కటాక్షవీక్షణ ప్రసాదాసాదిత కవితాచమత్కార ధూర్జటిపౌత్ర కాళయామాత్య లక్ష్మాంబికాదత్త పోలనమంత్రి గుర్వమాంబికా కుమార ధూర్జటిప్రణీతంబైన కృష్ణరాయవిజయంబు ... ..."

ఈ కవియింటిపే రేదియో తెలియరాలేదు. కృష్ణదేవరాయల యాస్థానకవులలో నొకఁ డని ప్రఖ్యాతిఁ గని కాళహస్తి మాహాత్మ్యమును రచించిన ధూర్జటికవి యీతనికిఁ బెదతాతయై న ట్లీక్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

చ. స్తుతమతి యైన యాంధ్రకవిధూర్జటిపల్కుల కేల్కు గల్గెనో
యతులిత మాధురీమహిమ నా మును మీ పెదతాత చాల స
న్నుతిఁ గనె గృష్ణరాయలమనోజ్ఞసభ న్మీరు నిట్లు మ
త్కృతబహుమాన వైఖరులఁ గీర్తివహింపుము ధాత్రిలోపలన్.

కృతిప్రేరకుఁ డైన యార్వేటి చినవెంకటభూపతి కవితోఁ బలికినట్లు రచింపఁబడిన యీక్రిందిపద్యములవలన నీకవి కృష్ణరాయ విజయమును రచియించునప్పటికి విశేషవయసు కలవాఁడు కాఁడ నియు, సావిత్రీచరిత్రము, ఇందుమతీ వివాహము నను రెండు ప్రబంధముల నదివఱకే రచియించియుండెననియు, నీతఁడు చేటతెలుఁగు మాటలతో మనోహరముగాఁ గవిత్వము చెప్పఁగలిగినవాఁడనియుఁ దెలియుచున్నది.

క. బాలుఁడవయ్యును విద్యా
శీలుఁడవు గభీరమధుర శృంగారకళా
లాలితచాతుర్య కవి
తాలోచన నిపుణ! వేంకటామాత్యమణీ!

ఉ. చిత్రముగాఁగఁ జేసితి వౌ రసముల్ చెలంగ సా
విత్రిచరిత్రమున్ మిగుల వేడుక నిందుమతీవివాహమున్
స్తోత్ర మొనర్పనర్హమగు సూక్తిగతిన్ రచియించితౌఁ గదా
ధాత్రిఁ బ్రసిద్ధిఁ గాంచితివి ధన్యుఁడవౌర! కుమారధూర్జటీ!

చ. తెలుఁగునఁ జెప్పనేర్చితి సుధీజను లెల్ల సెభాసు ధూర్జటీ
భళి యనఁ దళ్కుగుల్కునగఁ బాటిలు తేటతెనుంగుమాటలన్
మెలకువఁ గాంచు బెళ్కుజిగిమించఁ బ్రబంధములన్ ఘనంబుగాఁ
బలుకులముద్దరాలి జిగిబంగరుటం దెరవల్ చెలంగఁగన్

ఉ. ఒక్కొకవింత హారి నిజయుక్తుల సూరిజను ల్నుతింపఁగాఁ
జక్కనిమాట లెంతయు రసస్థితి ముందర బాఱుదీఱఁగాఁ
జక్కెరలొల్కఁ దేనియలు సారెకుఁ జిల్కఁగ భవ్యకావ్యముల్
గ్రక్కునఁ జెప్పనేర్తువనఁగా వినఁగాఁ గడువేడుకయ్యెడిన్.

క. మా కరుణకుఁ బాత్రుండవు
ప్రాకటగతిఁ బద్యకావ్యఫణితం జెప్పుమా
శ్రీకృష్ణరాయచరితము
నీ కవితాప్రౌఢి సుకవినికరము మెచ్చన్.

క. శ్రీరాముని కంకితముగ
గారవమునఁ జేయు మనఘ! కడు శీఘ్రముగా
శ్రీరంజిలు నీ కవపుడు
సౌరమహిన్ భాగ్య మచ్చెనని కడువేడ్కన్.

ఈ కుమారధూర్జటి రచియించిన సావిత్రీచరిత్రమును, ఇందుమతీవివాహమును, కాలగర్భమునఁ బడిపోయినవి. కృష్ణరాయవిజయప్రేరకుఁడు, ఆకువీటిరాజగుచినవెంకటాద్రియని, ఆగ్రంథముద్రితపీఠికలో శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిలువారు వ్రాసియున్నారు. కాని యది పొరపాటు. ఆకువీటి చినవెంకటాద్రి రాఘవపాండవీయ కృతిభర్తకు సోదరుఁడు. కృష్ణరాయవిజయకృతి

పేరకుఁడు ఆర్వీటి చినవెంకటరాజు. ఇతఁడు ఆర్వీటి బుక్కరాజు వంశములోనివాఁడు. "రామపృథ్వీరమణ సాధ్వీమణి నాంచారమాంబాగర్భశుక్తి ముక్తాఫలంబుననగు చిన్నవెంకటరాయరాజదేవేంద్రుండు" అని కవి చెప్పియుండుటచే నీకృతిపేరకుని తండ్రి రామరాజనియుఁ దల్లి నాంచారమ్మ యనియు స్పష్టమగుచున్నది. ఆర్వీటి వంశములో నళియరామరాజునకు మనుమఁడు చినవెంకటరాజుకలఁడు. కాని యీ కృతిపేరకుఁ డాతఁడు కాడు. అతని మనుమఁడు కోదండరామరాజు ఇతనిని రామరాజని పిలిచెదరు. ఈతనికుమారుఁడే కుమారధూర్జటి కాశ్రియుఁడైన చినవెంకటరాజు. కోదండరామరాజు భార్య నాంచారమ్మయని అందుగుల వెంకయ్యకృతమైన రామరాజీయమునం దున్నది. (ఆంధ్రకవితరంగిణి 11 భా॥ 198 పుట అందుగుల వెంకయ్య చరిత్రమును చూడుము). దీనినిబట్టి రామరాజీయకృతిభర్తయైన ఆర్వీటికోదండరామరాజుయొక్క రెండవ కుమారుఁ డయిన చినవెంకటరాజే శ్రీకృష్ణరాయవిజయకృతి పేరకుఁ డనుట నిశ్చయము.

బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారు కవులచారిత్రములోఁ, బింగళి సూరనార్యుని చారిత్రమునందు

"కలితపంపాతటంబున నిలుచువాఁడు
శ్రీవిరూపాక్ష శివుఁడు రక్షించు నెప్పు
డఖలసద్గుణమణిపేటి యాకువీటి
చిన్నవెంకటరాయని చెలువుమీఱ"

అని కృష్ణరాయవిజయములోని పద్యభాగము నుదాహరించుచు 'యీ చినవెంకటరాయఁడు రాఘవపాండవీయములో వర్ణింపఁబడిన కృతిపతి తమ్ముఁ డయిన వేంకటాద్రియేయైన పక్షమున' అని సంశయచిత్తులయ్యును తుదకు నాతఁడే యని నిర్ధారణముచేసి సూరనార్యుని కాలనిర్ణయమును గావించియున్నారు. కాని యదియును బొరపాటే.

పై పద్యములోని "యాకుపీటి" యనుశబ్దమును "నారవీటి" యని సవరింపవలసియున్నది. ఈసవరణను నేను చేయుమని యనుటకాదు. కృష్ణరాయ విజయముద్రితప్రతిలో "యారివీటి" అనియే యున్నది. ఇంతేకాదు ఆగ్రంథముయొక్క మొదటి పద్యములోనే "యార వీటి" అనియున్నది చూడుఁడు.

శా. శ్రీసీతాపతితోడఁ గూడి భువనక్షేమంకర ప్రశ్రియో
ల్లాసం బొప్పఁగ లోకకంటకుల నెల్లంద్రుంచి సత్కీర్తులన్
భాసిల్లుం రఘువీరుఁ డెంతయును సంపత్ప్రౌఢి రక్షించు వీ
క్షాసద్వైఖరి నారవీటి చినరాజ శ్రీమహారాయనిన్.

మఱియు నాగ్రంథకృత్యాదియందలి 8వ పద్యములోఁగూడ యార్వీటి యనియే యున్నది పరికింపుఁడు.

తే. అంతనొకనాఁడు పొడఁగంటి నలరు విలుతు
వంటి చక్కదనంబున వలను మీఱి
సకలకవిరాజ రక్షణోత్సుకత వెలయు
నట్టి యార్వీటి చినవెంకటావనీంద్రు.

దీనినిబట్టి కృతిపేరకుని యింటిపేరు ఆరవీటి గాని యాకుపీటి కాదని నిర్ణయింతము

ఆరవీటి చినవెంకటరాజు తల్లినాంచారమ్మ. తండ్రి (కోదండ) రామరాజు. ఈవిషయము కృష్ణరాయవిజయమునందలి పై వాక్యముల వలనస్పష్టమగుచున్నది. ఆకుపీటి పెదవెంకటాద్రి, చినవెంకటాద్రి అను సోదరులకు తల్లి తిమ్మాంబ; తండ్రి తిమ్మనరపాలుఁడు. ఈవిష యము రాఘవపాండవీయము కృత్యాదియందలి యీక్రింది పద్యములు ధృవపఱచుచున్నవి. కావున కుమారధూర్జటి కాశ్రియదాత ఆరవీటి చినవెంకటరాజు కాని యాకుపీటి చినవెంకటాద్రి కాఁడని మున్మా టికిని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

క. ఉభయకులసిద్ధిఁ దనరెడు
   నభినవగుణములఁ బ్రసిద్ధయగు తిమ్మాంబన్
   విభవమునఁ బెండ్లియాడెను
   ద్రిభువన విభుఁ డాకువీటి తిమ్మవిభుఁ డోగిన్.

చ. పటుబలశాలి తిమ్మనరపాలుఁడు పుత్త్రులఁ గాంచె విక్రమో
   ద్భటుఁ బెదవెంకటాద్రిఁ బ్రతిపక్షహరున్ చినవెంకటున్ మరు
   ద్విటపిసమానదానఘను వేంకటరాయని భవ్యతేజు వేంక
   కట వరదున్ బుధప్రణుతిఁ గాంచిన తిమ్మనమంత్రి యింపుగన్.

కృష్ణరాయవిజయ ప్రోత్సాహకర్త యగు నారపీటి చినవేంకటరాజును రాఘవపాండవీయ ప్రోత్సాహకుఁ డగు నాకువీటి పెదవెంకటాద్రి సోదరుఁడైన చినవెంకటాద్రియుఁ గూడ విరూపాక్షస్వామి భక్తులే. మొదటివిరూపాక్షస్వామి పంపానదీతీరమున విజయనగరమునందు వెలసినవాఁడు. రెండవవిరూపాక్షస్వామి తుంగభద్రాతీరమునఁ గోవిలకుంటకుఁ బడమట నాలుగు క్రోసులదూరమున నున్న నాకువీటి యందున్నవాఁడని శ్రీ పి. శేషలింగము పంతులుగారు వ్రాసి యున్నారు.

కుమారధూర్జటికిఁ బెదతాత యైన ధూర్జటికవి శ్రీకృష్ణదేవరాయలకాలములోనున్నవాఁడని యతనివ్రాసిన "స్తుతమతియైన..." అను పద్యమువలనఁ దెలియుచున్నది. అతనికి సోదరుని మనుమఁడైన యీకవి, యాతనికిఁ దరువాత నేబది, యరువది సంవత్సరములలో నున్నాఁడని యూహించినచో పదునారవ శతాబ్ది యుత్తరభాగమున నున్నాఁడని యూహింపవచ్చును. కాని దీనికొక బాధకము కన్పట్టుచున్నది. కుమారధూర్జటి కాశ్రయము నొసంగిన చినవెంకటరాజు, ఆర్వీటి యళియరామరాయలకు మనుమనిమనుమని కుమారుఁడై యున్నాఁడు. అళియరామరాయలు క్రీ. శ. ౧౫౬౫ సంవత్సరమున తాళికోట యుద్ధమునఁ గాలధర్మము నొందినవాఁడు. అతని

మనుమని మనుమనికుమారుఁడు పదునాఱవ శతాబ్దిని బూర్వభాగమున నుండుట సంభవము కానేరదు. ఈచిన వెంకటరాజుతండ్రి యైన కోదండ రామరాజు కాలము క్రీ.శ ౧౬౩౦ సంవత్సర ప్రాంతమై యుండునని అందుగుల వెంకయ్యకవి చారిత్రమున వ్రాసి యున్నాఁడను. కావున నీచిన వెంకటరాజును, కుమార ధూర్జటియు, ౧౬౫౦–౬౦ ప్రాంతము వారై యుందురని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. అట్లయినచో కుమార ధూర్జటికి, ధూర్జటికవి పెదతాత యగుట పొసఁగదు. కుమారధూర్జటికి, కాళహస్తి మహాత్మ్యకృతికర్తయగు ధూర్జటి నిజముగాఁ బెదతాతయే (తాతకు అగ్రజుఁడు) యని నిశ్చయించితిమేని యాతఁడు కృష్ణదేవరాయల యాస్థానమునలేఁడని చెప్పవలసివచ్చును. కుమారధూర్జటియు, నాతనికుమారుఁడును, నాతని పుత్త్రుఁడును లోకమును ధూర్జటి, కృష్ణదేవరాయల యాస్థానమునందున్నవాఁడని చెప్పుచుండగా మన మందులకు వ్యతిరేకముగా నిర్ణయించుటకంటె కుమారధూర్జటి చెప్పిన "పెదతాత" యనుమాటకు వరుసకు, తాతయనియర్థము చెప్పి సమన్వయించుట యుక్తమని తలంచుచున్నాఁడను. మనలో తాతపేరు మనుమనికిఁ బెట్టుచుండుట యాచారము. కావున కుమార ధూర్జటి కాధూర్జటి తాతకుఁ దాతయని యనుకొనినచో పైనిచెప్పిన యసందర్భము తొలఁగ పోవును. అళియరామరాజును, ధూర్జటియు కృష్ణదేవరాయల కాలములోనివారు. ఆతని మనుమని మనుమనికుమారునకు, నీతని మనుమని మనుమఁడు కావ్యమును గృతి యిచ్చెననిన నంతవ్యత్యాసము గనుపట్టదు. ఇందులకు వ్యతిరేకముగా నేవేని యాధారములు లభించిననే తప్ప యిదియే సత్యమునకు సమీపమై యుండునని యనుకొందము. కుమారధూర్జటి తనయుఁడైన లింగకవి తనతండ్రిని వర్ణించునప్పుడు "ధూర్జటివంశపాథోధిచంద్ర కుమారధూర్జటి"యనియెనే కాని ధూర్జటికిఁ దమ్మునిమనుమఁ

డని చెప్పకపోవుటకూడ పై యూహకు బల మొసంగుచున్నది. కావునఁ గుమారధూర్జటి పదునేడవ శతాబ్ది పూర్వార్థమున ననగా 1640–1650 ప్రాంతమున నీకావ్యమును రచియించెనని నిశ్చయింతము.

ఇతని కుమారుఁడు లింగరాజు పెదకాళహస్తిమాహాత్మ్యమును; మనుమఁడైన వెంకటరాయకవి రత్నావళీపరిణయమును రచించి యుండిరి. వారలచారిత్రములు వేఱుగ నిందు వ్రాయుచున్నాఁడను.

కృష్ణరాయవిజయమునందు ప్రథమాశ్వాసమున విజయనగర వర్ణనమును, రెండవయాశ్వాసమున విద్యారణ్య కృత విజయనగరనిర్మాణ వృత్తాంతమును, కృష్ణరాయల పట్టాభిషేకమును నాతని దిగ్విజయ ప్రయత్నమును, తృతీయాశ్వాసమునఁ గృష్ణరాయలు చేసిన దిగ్విజయ విషయములును నాల్గవ యాశ్వాసమున గజపతి తన తనయను కృష్ణరాయలకుఁ గన్యాదానమిచ్చి చేసిన పరిణయ వృత్తాంతమును వర్ణింపఁబడినవి. ఈగ్రంథము చరిత్రకారుల కంతగా నుపయోగబడదు. ఇది ప్రబంధదృష్టితో రచియింపఁపడినది, కాని చారిత్రిక దృష్టిలో వ్రాయబడినది కాదు. కృష్ణరాయలతండ్రి నరస రాయలని శాసనముల యందున్నది. ఇందు వీర నరసింహ రాయలని చెప్పఁబడినది. నరసరాయలనే యీతఁడు వీర నరసింహ రాయలని చెప్పి యుండవచ్చును. కాని నరసరాయలకు వీర నరసింహరాయలను దనయుఁడున్నప్పుడా భేదమును గన్పరుప వలసి యుండునుకదా! వీరనరసింహరాయల మాట యీ గ్రంథమున లేనేలేదు. నరసరాయల యనంతరమున నాలుగైదేండ్లు వీరనరసింహ రాయలు రాజ్యము చేసిననియు, నాతనికిఁ బిమ్మటఁ గృష్ణదేవ రాయలు రాజ్యమునకు వచ్చెననియు, శాసనదృష్టాంతము లున్నవి. ఇందుఁ గృష్ణరాయల తండ్రియే, అప్పాజీతో నాలోచించి, తన యనంతరమునఁ గృష్ణరాయలు రాజ్యార్హుఁడని నిశ్చయించి యుంగర మొసంగినట్లు చెప్పబడినది. ఇతరాధారములవలన నిశ్చయమైననే

తప్ప, కృష్ణరాయవిజయమునందలి యంశములు సత్యములని చరిత్ర కారులు భావింపరాదని తలంచుచున్నాఁడను.

ఈతని కవిత్వము కవి చెప్పినట్లు మృదుమధురపదసంయుతమై ద్రాక్షాపాకమున మనోహరముగా నున్నది. ధూర్జటి కవిత్వము నందువలెనే రేఫద్వయమైత్రి ఇకారసంధి మొదలగు ప్రయోగము లిందును గలవు. శైలి తెలియుటకై నాల్గాశ్వాసములనుండియు నాలుగు పద్యముల నుదాహరించుచున్నాఁడను.

చ. రతిపతి మోహనాస్త్రములు రత్నశలాకలు కాంచనోజ్జ్వల
ప్రతిమలు మల్లికాలతలు పద్మజునంచలు నాట్యశాస్త్రదే
వతలు సుధాంశురేఖలు ప్రవాళపురెమ్మలు ముద్దుగుమ్మ ల
ద్భుత నవయౌవనాకృతులఁ బొల్చినతత్పురి వారకామినుల్. ౧అ

మ. నరు లజ్ఞానవిమోహితాత్మ లగుటన్ రక్షించఁగా నెంచి శం
కరుఁడే శంకరుఁడై విభేదమతముల్ ఖండించి వేదాంత శా
స్త్రరహస్యస్థితి దెల్పఁగా నతఁడె విద్యారణ్యమూర్తిన్ జగ
ద్గురుఁడై తోఁచెఁ దదీయవైభవము లెందు న్మెచ్చఁగా శక్యమే.
౨అ

చ. ఇతరులు శక్తులే తలఁప నేదులశాహు నిజాముశాహులన్
గుతుపనమల్కునున్ గెలిచి గొబ్బున సర్వగిరీంద్రదుర్గముల్
జతురతఁ గైకొనన్ ధరనసాధ్యము నీకిఁకఁ గల్గదైన నం
చితయశ! యొక్కవిన్నపముఁ జేసెద వేదురఁ జిత్తగింపుమా. ౩అ

చ. అలగురుఁ డట్టివేకువ సురాపగఁ గ్రుంకి తదీయతీర మం
దలరిచినట్టి సైకతమయుం బగులింగము పూజసేయఁగా
దలఁచి తదేకనిష్ఠ నవతామరసం బపుడెత్తిభక్తి రం
జిల నన వేగుఁజుక్క వెలసెన్ తళుకుం జిగితోడఁ బ్రాగ్దిశన్ ౪అ



# 283. చిత్రకవి వెంకటరమణకవి



ఈకవి కాత్యాయనసూత్రుఁడు, భారద్వాజగోత్రుఁడు, శుక్లయజుశ్శాఖాబ్రాహ్మణుఁడు సర్వలక్షణ సారసంగ్రహకర్తయగు చిత్రకవి పెద్దనార్యునకు♦ పౌత్త్రుఁడు; ఇందుమతీపరిణయాది ప్రబంధరచనా దక్షుఁడగు ననంతార్యునకును నోబళాంబకును బుత్త్రుఁడు.

ఈకవి త్రిలోకసంజీవని, సకలవర్ణనాపూర్ణరామాయణము§, కుమారగురువిలాసము, అభిమన్యువిలాసము, సాంబవిలాసము నను గ్రంథములను రచియించెను. సాంబవిలాసము మూఁడాశ్వాసముల శృంగారకావ్యము. ఇందు శ్రీకృష్ణుని కుమారుఁడైన సాంబునకును, దుర్యోధనుని కుమార్తె లక్షణకన్యకును జరిగిన పరిణయకథ వర్ణితమైనది. ఈ కావ్యము సుబ్రహ్మణ్యేశ్వర మండలిస్వామి కంకితము చేసిన ట్లీక్రింది పద్యములో నున్నది.

ఉ. శ్రీకనకాంగి వక్షమునఁ జేరిచి సౌఖ్యమునందు దేవు న<br>
స్తోకదయాకటాక్షమునఁ జూచి నిజాశ్రిత రాజికిన్ సిరుల్<br>
జోక నొసంగుదానగుణశూరు నుమావిభు నుత్యచర్య ద<br>
ర్వీకరరాజగోత్రమున నుండెడుస్వామిని భక్తి గొల్చెదన్

సాంబవిలాసములోని (యీక్రింది గద్యమువలన నీతని తక్కిన గ్రంథములు సాంబవిలాస రచనమునకుఁ బూర్వమే రచింపఁబడినట్లు తేటపడుచున్నది. ఇది శ్రీహనూమదద్వర ప్రసాద లబ్ధసార సారస్వత పాత్ర భారద్వాజ గోత్ర పవిత్ర ప్రథమ శాఖాసముద్భవ సముజ్జ్వల కాత్యాయనసూత్ర లక్షణసారసంగ్రహ రచనావిశారద. చిత్రకవి పెద్దనార్యపౌత్ర హరిశ్చంద్రనలో పాఖ్యాన హరిహర శ్లేషోదా

---

♦ ఆ. క. త సం. పుట 101

§ ఆ. క. సం. 10 పుట 168

హరణ సకలజీవసంజీవన ప్రబంధ బంధుర నంశావళీ సృజనాధురంధ రానంత సత్కవీంద్రపుత్రి దయాదాక్షిణ్యాదిక సమస్తసద్గుణ కదంబాంబాసమా నౌబళాంబికా గర్భక్షీరవారాశి కుముదబాంధవ చరిత్ర శ్రీసుబ్రహ్మణ్యేశ్వరాంజనేయాంకన మంజుల త్రిలోకసంజీవన్యభిమన్యువిలాస సకలవర్ణనాపూర్ణ రామాయణ కుమార గురువిలాసాదిక దివ్యకావ్య కరుణాతిధురీణ శేముషివిశేషపారీణ రాఘవ పాండవీయ విష్ణుచిత్తీయవసుచరిత్ర ప్రముఖదివ్యకావ్యార్థ బోధన సమర్థ హృదయకమల సకలవిద్వత్కవీంద్ర విధేయ వేంకటరమణ నామధేయకవీశ్వర విరచితంబైన సాంబవిలాస మను మహాప్రబంధము''

ఈకవి రాఘవపాండవీయ విష్ణుచిత్తీయ వసుచరిత్రాద్యాంధ్రకావ్యార్థ బోధనాసమర్థుఁడనని పైగద్యలోఁ జెప్పుకొనియున్నాఁడు. కవి తనను గూర్చి సాంబవిలాసమునం దిట్లు వ్రాసికొనియున్నాఁడు.

ఉ. ఓరమణాఖ్య సత్కవి కులోత్తమ! మామకమంజులాహ్వయ
శ్రీరమణీయ! నీవిపుడు చేయఁగఁబూనిన సాంబలక్షణా
సారసదృగ్వివాహకథ సన్మతి మా కిపుడంకితంబుగాఁ
గూరుపు నీకుఁ గల్గు జయగుర్వచ నాయురభీష్టవస్తువుల్.

సీ. సర్వలక్షణ సారసంగ్రహం బొనరించి
తనరె మాతాత పెద్దనకవీంద్రుఁ
డల హరిశ్చంద్రనలాధీశసత్కథా
శ్లేషసత్కృతికిఁ బ్రసిద్ధిగాఁగఁ
గవిహితుం డౌచు వ్యాఖ్యానంబు నొనరించి
మఱియు నిందుమతీపరిణయంబు
మొదలైన సత్కావ్యములు చేసి రహి గాంచె
నరయ మాతండ్రి యనంతసుకవి

చిత్రకవి మంజులాన్వయ క్షీరవార్ధి
చంద్రమూర్తివి సద్బుద్ధిశాలి వీవు
రమణసత్కవి! నీ వొనర్పంగఁబూను
కృతివతంసంబు నతనికంకిత మొనర్పు.

ఈకవి తండ్రియైన యనంతామాత్యుఁడు రామరాజభూషణునిచే రచియింపఁబడిన హరిశ్చంద్రనలోపాఖ్యానమునకు వ్యాఖ్యానమును వ్రాసియున్నట్లీ పద్యములో నున్నది. రామరాజభూషణుఁడు క్రీ.శ. ౧౫౫౦వ సంవత్సరప్రాంతము వాఁడగుటచేత ననంతామాత్యుఁడు ౧౬౦౦వ సంవత్సరప్రాంతము వాఁడని యెంచఁ దగియున్నది. అప్పకవి సాంబవిలాసమునుండి లక్ష్యములను గైకొనియున్నాఁడు అప్పకవి క్రీ.శ.౧౬౬౦ సంవత్సరప్రాంతము వాఁడగుట నిశ్చయము. కావున నీ వెంకటరమణకవి పదునాఱవశతాబ్ది తుది పాదమునను బదునేడవశతాబ్ది ప్రథమపాదమున నుండెనని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఈతఁడు సాంబవిలాసమును వ్రాయుటకుఁ బూర్వమే తక్కిన గ్రంథములను వ్రాసియుండెను. బహుశః ఈతని రచనములలో నిదియే కడపటి గ్రంథమై యుండును. కావునఁ గవి క్రీ.శ. ౧౬౨౫ ప్రాంతమున దీనిని రచియించెననియు నీతనికాలము ౧౫౭౫–౧౬౩౦ అనియు నిశ్చయింపవచ్చును. ఇక్కవి రచించిన యితరగ్రంథము లెవ్వరికిఁ గృతియిచ్చెనో తెలియదు.

ఈతని కవిత్వము నిర్దుష్టమై మనోహరమైనదగుటను నెవ్వరైన నీతని గ్రంథములను సంపాదించి ముద్రింతురను నాసతోడను గ్రంథవిస్తరమైనను దొరకిన గ్రంథములనుండి పదేసి పద్యముల గ్రింద నుదాహరించుచున్నాఁడను.

ఈతని గ్రంథములలో సాంబవిలాసమును రామాయణమును మాత్రము ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందు శిథిలావస్థలో నున్నవి. తక్కిన గ్రంథము లింకను బయల్పడలేదు.

సకల వర్ణనాపూర్ణ రామాయణము నీక్రింది పద్యమును బట్టి యెవరో సుబ్బరాయునకుఁ గృతియొసంగెనని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార గ్రంథావళీ సంపాదకులు వ్రాసియున్నారు.

క. ప్రతిపర్వదివస సేవా
గత భూజన నేత్రమోదకర! సూర్యవి భా
తత దివ్యమంగళాకృతి
భృతసేవక! సుబ్బరాయ! బుధజనగేయా!

ఇందలి సుబ్బరాయఁడు మానవుఁడు కాఁడనియు సుబ్రహ్మణ్యేశ్వర స్వామి యనియు నాయభిప్రాయము.

ఈతని కవిత్వము సలక్షణమై, ప్రౌఢమై హృద్యముగానున్న దనుటకు సందియములేదు. కవిత్వశైలి తెలియుటకై సాంబవిలాసము నుండి కొన్ని పద్యముల నుదాహరించుచున్నాఁడను.

చ. కొడవలిచేత బొజ్జు తగఁగోసి కడానిపసిండి చేటలో
నిడి నులివెచ్చనీట తల నెంతయు నారిచి మేలిచల్వపా
వడఁ దడిగొత్తి ఫాలమున బాగుగ నున్నని కాపుదృష్టి బొ
ట్టిడి రహి దీవనల్ సలిపి హెచ్చుగ నారతులిచ్చి క్రిచ్చఱన్.

ఉ. ముందరశత్రుభూధరసమున్నతమస్తకరాళి నెల్ల నీ
యందముచేత మొట్టుదు నటంచు జనాళికిఁ దెల్పులీల నా
నందముతోడ పాదనలినద్వయి మీఁదికి నెత్తు నెంతయున్
పొందుసనయ్యెడు ప్రవరుపుత్త్రుడు సాంబుఁడు బాల్యపుందరిన్.

మ. ఒక భిల్లాగ్రణి వెంబడించి తనపై నుత్సాహముప్పొంగ వ
చ్చు కఠోరాధిక గర్వధూర్వహతరక్షశ్రేష్ఠమున్ సాంబభూ
ప కిరీటంబు నుతింప మేలితళుకుల్ బల్వాడి యందంపు నుం
జికటారిం బడఁగూల్చి యార్భటులొనర్చెన్ బెంచి శౌర్యంబునన్.

చ. ఒక రమణీశిరోమణి పయోరుహజాతము నెల్లఁ జూచి మా
మకముఖచంద్రమండల సమక్షమునన్ ముకుళింప కిట్టులన్

వికసన మందఁగాఁ దగు నె! నీకిది గానని మూలముట్టుగాఁ
బెకలిచి యీదులాడె నలివేణులు గొందఱు చెంత నీడఁగన్.

మ. నిజ విరాభామినియూరుదీధితుల నెంతేఁ జౌర్యవృత్తిన్ హరిం
ప జగద్దంతికరాళికిన్ రదనసంపాతోగ్రపీడార్తి రా
ద్ర్వజగేహాంగణభాగవాస విధముల్ రంభాళికిన్ చాలనీ
రజగర్భం డొనరించి శాస్తి యిడె చౌర్యం బేరికిం జెల్లునే.

చ. నలు వగునాభికాహ్రదమునన్ విహరించి యుగోజచక్రముల్
వెలువడివచ్చునప్పుడు నవీనతదంఘ్రిల వెంబడిం గడుం
దళముగ నంటి వచ్చి తగువాభుమెఱుంగుల బొల్చునా
కలికికి నాగు సౌరగుచుఁ గన్పడు భంభరమాలికాగుచిన్.

ఉ. క్రొవ్వెను గొల్లపిల్లయిదిగో యని కోయని యార్చి యుద్ధమం
దెవ్వసుధాధినేతకు సహింపఁగఁగూడని వాఁడి బాణముల్
జివ్వున జివ్వునం బరపె లేఖనికాయము లెల్ల బాలకుం
డివ్విశిఖాళి తాఁకులకు నేగతి నోర్చునటంచు నెంచఁగన్.

చ. నదులను కన్యకామణుల నాటినప్రేమ నొసంగి వార్ధి కిం
బొదవెడు మామయయ్యెనని యుర్వర పైఁ గల మానవౌఘముల్
ముదమున నాడఁగాఁ గడుసముస్నతమై యలవర్ష వేళ న
భ్యుదితగతిం జెలంగె కమఠోరుతరప్రమద ప్రదాయియై

ఉ. బాంధవమెంచియైన మము భావమునందుఁ దలంచియైన ని
ర్బంధము సేయరా దనక బాలుని బందికమందు నుంతురా
కంధర నీలవర్ణుఁడు జగత్పతి కృష్ణుఁడు శత్రుగంధ ని
ర్గంధనుఁ డివ్విధంబు విని గాఢతరోగ్రమహోగ్రహంబునన్.

సాంబునకు లక్ష్మణతో నైన పరిణయకథను సాంబోపాఖ్యానమను పేర రామరాజు రంగపరాజును, సోచర్లనన్నయకవియుఁ బద్యకావ్యములుగా రచించియున్నారు.

ఈతఁడు రచించిన రామాయణమునుండి కొన్నిపద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

మ. కౌమరుంబ్రాయఁపుఁ గాంత లెంతయుఁ గొలంకుం జొచ్చి యిచ్ఛావిహా
రములన్ నీరముఁ జల్లులాడు తరి తద్రాకేందు బింబాననా
కమనీయాస్యములన్ నుతింపుచు శిరఃకంపంబు గావించు నం
దములన్ నీరజముల్ చలింపఁ దొడఁగెన్ దద్వేళ నొక్కమ్మడిన్

చ. అనిలజుచేత నీవిభవ మచ్చెను మాకు నటంచు రాముఁ డా
జనకజ కిచ్చెఁ గొంిదళుకు చక్కనిముత్తెపుదండ నట్టు లి
చ్చినఁ గొని సీత దాని నల్రశీరఘునాయకు నాశయం బెఱిం
గినయదియై మరుత్తనయుగ్రీవమునందుఁ ఘటించె నెంతయున్.

ఉ. భూరిమణీ సముజ్జ్వలిత భూషణముల్ ధరియించి మౌక్తికో
దారసుహారముల్ గళమునందునఁ దాలిచి మేలిగండ పెం
డేరము బూని చొక్కఁపుపటీరపు చర్చ వహించి యా రఘు
త్స్మారమణుండు పూర్ణశశికైవడిఁ బొల్చె సమగ్ర మాకళన్.

ఉ. మమ్ములఁ నందఱన్ మనుప మానవవృత్తి ధరిత్రిఁ బుట్టి యు
గ్రమ్మగు యుద్ధభూమి ఖలరావణముఖ్యదితి ప్రభూత సం
ఘమ్ములఁ దుంిచి మాకతిసుఖం బొనఁగూర్చి మదీయరాజ్యముల్
గ్రమ్మర మాకొసంగితివి కల్గుదురే సరి నీకు భూభుజుల్.

ఉ. నీ వొకకుందనంపుబలునిగ్గు మెకంబు స్వరూప మూని యా
భూవరు నాశ్రమంబునకుఁ బోయి సమీపపుభూమిఁ గుమ్మరం
గా వసుధాతనూజ నినుఁ గాంచి భ్రమన్ నినుఁబట్టి తేరఁగాఁ
దావడిఁ బంపు రామవసుధావరు లక్ష్మణుఁ నాక్షణంబునన్

ఉ. శ్రీరఘురాముతోఁ జెలిమి సేసిననీకు జయంబు భాగ్యమ
వ్వారిగఁ గల్గు వాలి బలవంతుసిఁ గెల్వఁగవచ్చు నిశ్చయం
బో రవిపుత్ర! యంతటిమహోన్నతు నాశ్రితసంఘరక్షణో
దారు రఘూద్వహుఃగొలువ నన్యులు నీకొకలెక్కయే ధరన్.

చ. పొలుపగుగంధ మందముగఁ బూసి సుమంబులు దాల్చి రత్నభూ
షలు ధరియించి కుందనపుఁ జక్కనివస్త్రము గట్టి ధాళధ
ళ్యలఘుకిరీటముల్ దశశిరాగ్రములందులఁ జేర్చి తీక్ష్ణతా
సలలిత చంద్రహాసము భుజంబున నీటుగఁ బూని యెంతయున్.

చ. పతిహితశక్తి యార్తిజనపాలనరక్తి సుధాసమోక్తి మా
నితనగధైర్యయుక్తి గురునీతికళావిభవప్రసక్తి యం
చితరఘురాట్పదాంబురుహసిద్ధసుభక్తియు నీకె కాక యెం
దితరజనాళికిం గలుగునే తలపోయఁగ నంజనాసుతా!

చ. సకల జగత్పరంపరల సాధుకృపామతిచేతఁ బ్రోచు ప్రా
నిక హారిదశ్వవంశభవనిర్మల పంక్తిరథ క్షమాధినా
యక మణికుద్భవించిన మహాదిమవిష్ణుఁడ వీవు రామ రా
ణ్మకుటమ వీవు భూమి నరమాత్రుఁడవే గణియించి చూడఁగన్.

ఉ. రాముఁడు ఘోరరాక్షసవిరాముఁ డితం డల చిన్ననాఁడె యు
ద్దామసహస్రదంతి బలఁదాటక గీటణగించి గాధిపు
త్రామితయజ్ఞరక్షణము నాదృతిఁ జేసి గిరీశచాపమున్
భీమబలంబుచే విఱిచె వీరుఁ డితండె జగత్త్రయంబునన్.

ఈ రామాయణము పిండిప్రోలు లక్ష్మణ కవికృత రావణ దమ్మీయము వంటిది. ఈకవిపై నెవ్వరో యభియోగము తేఁగాఁ నాతనిని రావణునిగను రామునిగను బోల్చి యీగ్రంథమును రచించెనఁట! ఇందు రామాయణ మేడు కాండములును గలవు. ఈతనిపై నభియోగముఁ దెచ్చిన యాతఁ డెవ్వఁడో, యీ యభియోగము నీతని పక్షమునఁ దీర్మానించిన న్యాయకర్త యెవ్వఁడో, తెలిసినఁ గాని యీతని పద్యములయందలి శ్లేషను గ్రహించి యానందింప లేము. గ్రంథము శిథిలావస్థయం దుండుటచే నా విషయములను సంపూర్ణముగ గ్రహింపననువు గాలేదు.

ఇతని రామాయణమునకు విద్వత్కర్ణరసాయన మను నామాంతరము కలదు.

ఈకవిని బ్ర. శ్రీ వీరేశలింగముపంతులుగారు ఆఱువేలనియోగి బ్రాహ్మణుఁ డని వ్రాసియున్నారు. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁ డనుమాట నిశ్చయమేకాని ఆఱువేలవారిలోఁ బ్రథమశాఖ వారుండి రాయని తెలిసికొనవలసియున్నది. ఉన్నచో నీతని నార్వేల ప్రథమ శాఖా నియోగ బ్రాహ్మణుఁ డని చెప్పవలయును.

ఈతని తండ్రియొక్కయు తాతయొక్కయు చారిత్రముల నీ గ్రంథమున (సం 9, 10 లలో) వ్రాసి యున్నాడను.

ఈ వెంకటరమణకవి చిత్ర, ఆశు, మధుర, శ్లేషకవిత్వములు చెప్పఁగలిగిన ప్రోఢ.



## 284. సోమనాథకవి



ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆత్రేయసగోత్రుఁడు; సోమ మంత్రి పౌత్త్రుఁడు; సిద్ధేశ్వరమంత్రి పుత్త్రుఁడు; నైజామురాష్ట్రమం దలి లేములవాడ యీతని నివాసము. హేమాద్రి యీతని కగ్రజుఁడు.

ఈతఁడు రామరాజభూషణుఁడు రచించిన వసుచరిత్రకు వ్యాఖ్యానము వ్రాసిన పండితకవి. వసుచరిత్రకు వ్యాఖ్యానములిం కను గొన్నికలవు. అన్నిటిలో నీతని వ్యాఖ్యానమెక్కువ ప్రచారము గాంచినది. వ్యాఖ్యానంతమున నీతఁడు రచించిన యీక్రింది గద్య వలన నీతని నామాదిక మెఱుంగనగుచున్నది.

"గద్య: శ్రీమదాత్రేయకుల కలశాంభోనిధి సంపూర్ణసోమ, సోమాభిధాన మంత్రివర పౌత్రేణ సోమసుత సిద్ధేశ్వర మంత్రీశ్వరస్యపుత్త్రేణ శ్రీమత్పార్వతీరాజేశ్వర ప్రసాదసమాసాదితహృద్యానవద్యనిఖిలవిద్యావిశారదేన సోమనాథనామ్నా విరచితాయాం వసుచరిత్ర వ్యాఖ్యాయాం విద్వజ్జన రంజనీసమాఖ్యాయాం ప్రథమాశ్వాసస్సంపూర్ణః."

లేములవాడ యందున్న రాజేశ్వరస్వామి నీ క్రింది శ్లోకములోఁ గీర్తించియున్నాఁడు.

శ్లో. శ్రీమల్లేములవాడ పుణ్యసరసీ శ్రీపార్వతీసంతతా
 శ్లేషానందరసానుభూతి నిరతం సర్వార్థసంధాయినమ్
 రాజశ్రీరితిరాజపూజిత ఇతిస్తోత్రైకపాత్రం ప్రభుం
 రారాజద్గుణ శాలినం సురగురుం రాజేశ్వరం భావయే

వసుచరిత్రకర్తయగు భట్టుమూర్తిని, వసుచరిత్రను నీ క్రింది రెండు పద్యములలో స్తుతించియున్నాఁడు.

ఉ. కారణజన్ముఁడై కవినికాయము మెచ్చఁగఁ గావ్యకర్తయై
 భూరికళాకలాపుఁడయి పొల్పు వహించెడు భట్టుమూర్తిచేఁ
 గ్రరితమై ఘనార్థ పదహీనపదాస్పదమైన యావసు
 ప్మాగమణ ప్రవృత్తము సుసాధ్యముగాదు తలంచిచూడఁగన్.

శా. నానాసూనరసాళి నేగుతలమై నానార్థసౌరభ్య వ
 న్నానాప్లానపదప్రసూనములనున్నా కేశ్వరా వాసస్సు
 నానాశాస్త్రరహస్యరత్నములకున్ రత్నాద్రియై యొప్పనీ
 నానాలంకృతిపేటి టీకకయి పూనకా శక్యమే యేరికిన్.

వసుచరిత్రమందలి "నానాసూనవితాన" ఇత్యాది పద్యమునందుఁ దనకుఁ గల విశేషగౌరవమును సూచింపఁ దలంచి కవి యీ పద్యమును వ్రాసియుండును. ఈకవి వసుచరిత్ర వ్యాఖ్యానమే కాక, మరుత్సందేశము, ధ్రువచరిత్రము, ముద్రాలాభము, చతుర్భ

జాభిషేకము, యౌవనచరిత్రము, గంగాగౌరీసంవాదము నను గ్రంథములను రచించిన ట్లీ వ్యాఖ్యానగ్రంథమున రచించిన యీ క్రింది పద్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

ఉ. సాంబశివాంఘ్రి పద్మములు సన్మతి మ్రొక్కి చతుర్భుజాభిషే
కంబను సత్ప్రబంధము జగద్విదితంబుగఁ జెప్పితిన్ మురా
రిం బసఁ గొల్చి యా ధ్రువచరిత్రి రచించితి నీ ప్రబంధముల్
సాంబమురారి హృద్య బహుళార్థచమత్కృతి శబ్ద చిత్రముల్.

క. పేశల గంభీరపదా
వేశమనోహరముగాఁగ వెలసె మరుత్సం
దేశము ముదాప్రిలాభం
బీశార్పణ బుద్ధిచే మదీరితమగుచున్.

ఉ. గంగయు గౌరి యిద్దరనఘక్రమమొప్పఁగ సేయువాదముల్
రంగులుమీఱఁ జెప్పితి నిలాతలవాసి కలాకలాపు లె
ల్లంగడు మెచ్చ నీశ్వరవరంబున నన్నుభజించునట్టి వి
ద్యాంగన హావభావము లుదారగతిం గనుపట్టుచుండఁగన్.

శా. ఈరీతిం గవితావితానవృతగౌరీశాన మాళిస్థలో
దారోద్దేశుఁడ నైన నాకు వెసవిద్యావంతులెల్లన్మనో
హారిప్రక్రియమూర్తిచేత రచితం బై విశ్రుతంబౌ వసు
ధ్మారాట్చ్ఛిత్రి చరిత్రిటీకకయి యుత్సాహంబు పుట్టించిరన్.

ఉ. శ్రీమెఱయన్ సమస్త ముని సేవితమై విలసిల్లుచున్న యా
లేములవాడలో వివిధలీలలుచూపి జగంబుఁ బ్రోచు నా
సామికి రాజలింగమను చక్కనినామము గల్గువానికిన్
గామితదాయికర్పితముగా నొనరించెద నీ నిబంధమున్.

ఈకవికాలము క్రీ.శ. ౧౭౫౦ ప్రాంతమని బ్రౌనుపండితుఁడు వ్రాసియున్నాఁడు. ౧౬౫౦ ప్రాంతమువాఁ డని గోలకొండసంచిక యందు వ్రాయఁబడియున్నది. కవి నిజామురాష్ట్రవాసుఁడు. ఏది

మైన బలవత్తరమైన నిదర్శనము లభించిననే తప్ప నీతనిని 1650 ప్రాంతము వానినిగా నిర్ణయింపక తప్పదు.

ఈతని గ్రంథములలో వసుచరిత్ర వ్యాఖ్యలొప్ప తక్కినవి ముద్రితములు కాలేదు. వ్రాతప్రతులైనను లభింపనందున నీతని చారిత్రమింతకంటె నధికముగఁ దెలిసినది కాదు.



## 285. మట్లి కుమారానంత భూపాలుఁడు

ఈకవి సూర్యవంశపు క్షత్రియుఁడు. ఆంధ్రమునఁ గకుత్స్థ విజయమను నుత్తమ ప్రబంధమును రచియించి తన తండ్రియైన యెల్ల భూపాలున కంకితముచేసి నమట్ల యనంతభూపాలున కీకవి పౌత్రుఁడు. ఇతని తండ్రి తిరువెంగళనాథుఁడు. ఈ కుమారానంతభూపాలుఁడు క్రీ. శ. 1600 మొదలు 1650 నడుమ నుండినవాఁడు. ఇతని తాత యైన యనంతభూపాలుని చారిత్రమునిదివఱకు వ్రాసియున్నాఁడను*. కకుత్స్థవిజయ కృత్యాదియందీ కుమారానంతుఁడు నూతసని క్రింది పద్యమునందుదాహృతుఁడైనాఁడు.

సీ. కరుణాకరిష్ణులు కమలాక్షుఁ డనియును
వీరాగ్రగణ్యులు విజయుఁ డనియు
దాతలందఱుఁ గల్పధరణిజమనియును
సత్యశీలుఁడు హరిశ్చంద్రుఁ డనియు
భోగసంపన్నులు పురుహూతుఁ డనియును
వైణికాగ్రేసరుల్వాణి యనియు
బుధులెల్లరును శేషభోగీంద్రుఁ డనియును
హరిభక్తులెల్లఁ బ్రహ్లాదుఁ డనియు

* ఆం. క. త సం 11. పు. 67.

నొనరఁగొని యాడఁగాఁ పురంబుండునే మొ
దయయుశౌర్యంబు నీఁగి సత్యవ్రతంబు
విభవసంగీతపాండిత్య విష్ణుభక్తు
లనఁగఁ దనరుఁ గుమారుఁ డనంత విభుఁడు.

ఈతని తాతయైన యనంతభూపాలుని కాలమునుబట్టి చూచి నచో నీతఁడు క్రీ. శ. 1600 మొదలు 1650 నడుమనున్నవాఁ డని తెలుచున్నది. ఈకవి కుముద్వతీపరిణయమను ప్రబంధమును రచి యించెను. ఇది ముద్రితము కాలేదు. మదరాసునగరమునందున్న అడయారు లైబ్రరీలో నొక వ్రాతప్రతి యున్నది. అది చూచు టకు నాకు లభ్యముకాలేదు. శిథిలావస్థయం దుండుటయే యందు లకు కారణము. నామిత్రులగు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తామా గ్రంథమును జూచితిమనియు నందుండి కొన్ని పద్యములను వ్రాసికొనివచ్చితిమనియుఁ జెప్పుచు దామా పద్యములను నాకొసం గిరి. అందుండి కవితాశైలి తెలియుటకై నాలుగు పద్యముల నీ క్రింద నుదాహరించుచున్నాడను. కుముద్వతి కాశిరాజకుమార్తె యఁట! నాయకుఁడు శ్రీరామచంద్రుని కుమారుఁడగు కుశుఁడఁట!

సీ. నిద్దంపు మొనవాడి నిడువాలుచూపులు
వాలుమేలిమిలకోరీలటంచు
విహృతివేలాపతద్వేణి కాలతికపై
దారిగాబడు బగదారియనుచు
కలహేమ మేఘవికాధ్యర్న (?) సాన్నాహ్య
కరిఘంటికా ఘణం ఘణ లటంచు
చికిలియందపుఁ గోట జీరలు చురుకుచు
రుక్కనుగాయంపు టెక్కలనుచుఁ
బెరసెనని యని రతియందె బెబ్బరించు
నతివనాటికి నేడయ్యోసతనుయుద్ధ

మిందుఁ జూతమునీ నేర్పు లెల్లయనుచు
మట్టిలికుమారనంత నీమహిత్వమైరి.

చ. మెలుపుగ మోవియానుతరి మెచ్చ విరాళియటంచు గుబ్బలన్
వలపునఁ బత్రివల్లికలువ్రాయుతరిన్ భజియించు మెచ్చుని
శ్చల తరతుల్ ఘటించుతరి బాగురె! నిర్జరనాథయంచు నే
ర్పుల విభుపల్కు-రాణిరసరూషమఁ జేయుమదీయ కావ్యమున్.

ఉ. ఉల్లిరిబెట్టలేము మముఁ బ్రోవుమిఁకన్ దయనంచునమ్రమౌళి
పల్లవులున్ రమాయతి ధనంబులు మానమటంచు వాణిజుల్
మెల్లనెవిన్నవింతురు భళీరకుమార యనంతసీకు ద
ర్పోల్లలితద్విషజ్జయ శుభోన్నతికేగిన దాడివెళ్ళినన్.

క. మల్లీనవవల్లీ మ
తల్లీ సుమవేల్లితాచతర సౌగంధ్యో
ద్వల్లీ వాధికసౌరభ
హల్లీసకముల్ కుమారనంతుని కవితల్.

ఉదాహృతపద్యములను బట్టి యీతనికవిత్వము మృదుమధుర పదసంయుతమై పండిత జనహృదయంగమముగనున్నది. ఈగ్రంథ మింతవఱకును ముద్రితముకాకపోవుట యాంధ్రపాఠకులదురదృష్టము.

కవి బళ్ళారి మండలములోని సిద్ధవటగ్రామనివాసుఁడు. శత్రువులను జయించి తండ్రితాతలవలెనే కీర్తిగాంచిన మహామహుఁడు. ఈతని వంశమునుగూర్చి యనంతభూపాలుని చారిత్రమున వ్రాసిన విషయములను గ్రహింపనగును. ఇఁక నేమియు వ్రాయఁజాలను.



## 286. కాకునూరి అప్పకవి

ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; ఇతని నివాసము కామెపల్లె యను గ్రామము. ఈ కవిశేఖరుఁడు గొప్పపండితుఁడును, బహుగ్రంథపరిశోధకుఁడును, నుభయభాషలయందునుగవిత్వముఁ జెప్పసమర్థుఁడును నైయుండెను. ఇతఁడు రచించిన గ్రంథములలో నెల్లఁ బేరుగాంచినది అప్పకవీయము. నన్నయభట్ట విరచితమని చెప్పఁబడియెడు నాంధ్రశబ్దచింతామణి కీ యప్పకవీయము వివరణ గ్రంథము. ఆంధ్రశబ్దచింతామణిలోని సూత్రముల యర్థమును, భావమును దెలుఁగున బద్యగద్యరూపమున వివరించి యాలక్షణములకు లక్ష్యములుగా నుత్తమకవులచే రచింపఁబడిన యెనుబది ప్రబంధములనుండి లక్ష్యములనుజూపుచు నీగ్రంథము నీ కవి రచించినాఁడు. అప్పకవీయ మెనిమిది యాశ్వాసముల గ్రంథమని కృత్యాదియందు కవిచెప్పిన "నభిరామంబులగు నాశ్వాసంబు లెనిమిదిగా నెలకూచి బాలసరస్వతి సకలభాషాకవి మహోపాధ్యాయ ప్రణీతాంధ్రవ్యాఖ్యాన గ్రంథం బాధారంబుగా రచియింపంబూని" యను వాక్యమువలనఁ దెలియుచున్నది. కాని మనకు ముద్రితమై లభించుచున్న ప్రతులలో నైదాశ్వాసములు మాత్రమే కలవు. ఈ యైదాశ్వాసములలో భాషావర్ణ,వళిప్రాస, పద్య, సంధిపరిచ్ఛేదములు మాత్రమేయున్నవి. ఇంకను తత్సమ, దేశ్య, క్రియాపరిచ్ఛేదము లుండవలయును. అవి తక్కిన మూఁడాశ్వాసములలోనుండియుండును. కడమ మూఁడాశ్వాసములును కవి రచించియుండలేదని కొందఱును, లభ్యములుకాక నశించియుండునని కొందఱు ననుచున్నారు. అహోబలపండితుఁ డీ యప్పకవీయమునుగూర్చి వ్రాయుచు.

శ్లో. మతంగశైలవిప్రేంద్రా దన్యద్వ్యాకృతి పుస్తకమ్
కాకునూర్యప్పకవి నా గృహీతం తత్ర షడ్గతాః.

మతంగపర్వత బ్రాహ్మణునివలన నింకొక వ్యాకరణ పుస్తకము కాకునూరి అప్పకవి వలన సంగ్రహింపఁబడినది. అందాఱుశ్లోకములు పోయినవి.

శ్లో. పాఠభేదాస్తు బహవో దృశ్యంతే పుస్తకద్వయే
మయా ప్రియస్సరస్వత్యాః పుస్తకం పరిగృహ్యతే.

ఈ పుస్తకములు రెంటియందును పాఠభేదము లనేకములు గనఁబడు చున్నవి. నేను తఱచుగా బాలసరస్వతి పుస్తకమునే గ్రహించు చున్నాఁడను.

శ్లో. అప్పార్యపుస్తకారూఢపాఠభేదా ద్యదస్థితం
మయా సంగృహ్యతే రూపం తదప్యాథర్వణోక్తితః.

అప్పకవియొక్క పుస్తకమందలి పాఠభేదమువలన నేరూపముసిద్ధించునో యదియును, నథర్వణ వాక్యమువలన సిద్ధించినట్లుగా నావలన గ్రహింపఁ బడుచున్నది.

శ్లో. టీకా బాలసరస్వతీకవికృతా శుద్ధాంధ్రవాగ్గుంభితా
సూత్రప్రోత పదార్థమాత్ర కథనప్ర క్షీణశక్తి స్తతః.
కస్తుష్యే ద్బుధపండితః కవివరః కించాత్రపద్యామితో
గ్రంథో హ్యప్పకవే ర్మదం దిశతినో విద్వత్కవీనాం ఘనాం.

కేవలము తెలుగుమాటలతో, సూత్రమునందలిపదార్థమునుమాత్రము చెప్పుటచే శక్తిహీనమైన బాలసరస్వతియొక్కటీకవలన నేపండితుఁడు, కవివరుఁడు తృప్తిఁ బొందును? మఱియుఁ బద్యములకేమఁదని యప్పకవి గ్రంథముగూడ, ఘనులైన విద్వత్కవులకుఁ సంతోషము నీయదు.

నన్నయభట్టు సూత్రములకు బాలసరస్వతిటీకయు, నప్పకవి వివరణగ్రంథమునుండగాఁ దాను మఱల సంస్కృతవ్యాఖ్యాన మేల వ్రాయవలయునని యెవ్వరైన శంకితురేమో! యని తలంచి యహోబలపండితుఁడు పైశ్లోకములలో సమాధాన మిచ్చియున్నాఁడు. దీనిని

బట్టి యప్పకవి రచించిన సంపూర్ణగ్రంథము నీతఁడు చూచియుండు నని తోఁచుచున్నది. లేకున్నచో నప్పకవిగ్రంథ మసంపూర్ణమని కూఁడ నాతఁడు పైశ్లోకములలో వ్రాసియుండును. అందుచే నప్ప కవి యెనిమి దాశ్వాసములును రచియించి యున్నాడనియే యెంచ వలసియున్నది. అందయిదాశ్వాసములు మాత్రమే యుండి తక్కిన మూఁడాశ్వాసములును పోవుట యాశ్చర్యముగనే యున్నది. ఈ యప్పకవీయమునుగూర్చి నన్నయభట్టు చారిత్రమునఁ గొంతవ్రాసి యున్నాఁడను.

ఇతఁడు మఱికొన్ని సంస్కృతాంధ్రగ్రంథములను రచియించి యున్నాఁడు. వాని నామము లప్పకవీయములోని యీక్రిందిపద్యము వలనఁ దెలియుచున్నవి.

సీ. జగతి నాపస్తంబశాఖోక్త షట్కర్మ
పద్ధతి ఖండనిబంధనంబు
కాలబాలార్కవాఖ్య జ్యోతిషగ్రంథ
సంహితాసుశ్లోక సంగ్రహంబు
శ్రీమదనంత ప్రసిద్ధమహో
కల్పకథాంధ్రోక్తి కావ్యరచన
శ్రీనగాధీశసుశ్లేష నిందాస్తుతి
భావగర్భిత సీసపద్యశతము

తే. లలిత కవికల్పకాఖ్యాన లక్షణంబు
మహిత సాధ్వీజనౌఘధర్మద్విపదము
నంబికావాదనామక యక్షగాన
కృతియుఁ జేసితి కాకునూరికులయప్ప.

ఇతఁడు రచించిన గ్రంథములలో నప్పకవీయముదప్ప తక్కిన గ్రంథము లిప్పుడు లభించుటలేదు. అప్పకవీయమందు గురుస్తుతి

[illegible]సిన యీక్రింది సీసపద్యమువలన నీతఁ డనేక విద్యలయందుఁ బ్రవీణుఁడైనదియుఁ దెలియుచున్నది.

సీ. ఆదిని రెండవవేదంబు చెప్పిన
 మూర్తిసర్వజ్ఞఁ గ్రిమస్వామిఁ
 దరువాత శబ్దశాస్త్రముఁ జదివించిన
 కాండూరిగిరి దేశికప్రకాండు
 నామీఁదసకలసిద్ధాంతము ల్దెలిపిన
 సూరవర్యుఁ బ్రధానిసూరభట్టు
 వెస నన్ను లక్షణవేత్తఁ గావించిన
 ఘను మంచికంటి యోబనకవీంద్రు

తే. స్మార్తకర్మంబు తెలిఁగించి సభలఁ బూజ్యుఁ
 జేయు నలకొలచలమల్ల సింగనార్యు
 నాగమము లుపదేశించినట్టి రాజ
 యోగివర్యుని దలఁతు విద్యాగురులను

ఈకవికాలమును దానే చెప్పుటచేత కాలనిర్ణయమునకై శ్రమ పడనక్కఱ లేకపోయినది. అప్పకవీయ రచనాకాలము శా. శ. ౧౫౭౮ అని యాగ్రంథమునఁ జెప్పినపద్యమును నన్నయభట్టుచరిత్రమున నుదాహరించియున్నాఁడను. ఇతని రచనములన్నియు నంతకుఁ బూర్వమే యగుట నీతనికప్పటికిఁ బది సంవత్సరములవయ సుండు నని చెప్పవచ్చును.

ఈకవి తాతకుఁ దాతయైన సోమయ గొప్పపండితుఁడై మధురలో వేదశాస్త్రపురాణాది వాదములయందుఁ బ్రతిపక్షులను జీకాకు పర్చినకారణమున నీవంశమునకుఁ గాకునూరి వారను నింటిపేరు గలిగెననియు, నీసోమపండితుఁడే కాకునూరను నగ్రహారమును సంపాదించెననియు, నీక్రింది పద్యములలో వ్రాసియున్నాఁడు.

తే. అమ్మహామానినీగోత్రాబ్ధి నవతరించి,
తమ్ములును దాను నన్యోన్యతను దనర్చి
తమ్ములను బోరునని సోముఁ ద్రిస్తరించు
నౌర సోమాహ్వయుఁడు కాకునూరిఘనుఁడు.

తే. అతఁడు మధురను బుధసమూహములఁ దొడరి
వేదశాస్త్రపురాణాది వాదములను
గాకునూ రింటిఁ జేసినకారణమునఁ
గాకునూరింటివాఁ డనఘునతఁ గాంచె.

సీ. బాలుఁడై కాశికాపట్టణంబున కేఁగి
బ్రహ్మేంద్రునొద్ద శాస్త్రములు చదివె
బ్రహ్మరాక్షసిచేతఁ గ్రమముచెప్పంబడి
కట్టినగండభాగంబు నొందె
చరికొండసీమలో సంతరించెను గాకు
నూ రనసర్వాగ్రహార మొకటి
నిడుదవెల్లిని బొద్దినేపల్లిని వరళ
పురిని మాన్యక్షేత్రములు గడించె.

తే. నవని సర్వజ్ఞుఁడగుట గంగాంబికాభి
రాముఁ డగుటను నిక్కంబు సోముఁడనఁగ
మనియె నిలఁ గాకునూరితిమ్మన సుతుండు
సోముఁ డభినవమూాత సద్గ్రామమునను.

చ. అతఁడు భవత్పితామహున కయ్యెఁ బితామహుఁ డాఘనుండు భా
రతిని దపంబునం గని వరంబడిగెం దనయింట విద్య ప్ర
స్తుత యగుచుండ నందులకు సుమ్మ జగంబునఁ గాకునూరి సం
తతియగువారు శోభనదినంబుల మున్నుగ వాణిఁ గొల్చుటల్.

కాకునూరివారియింట నే శుభకార్యములువచ్చినను ముందుగ సరస్వతీపూజఁ గావించుచుందురఁట. పై పద్యములలోఁ జెప్పఁబడిన

"అభినవచూత"మను గ్రామము గుంటూరుమండలములోని బాపట్ల తాలూకాయందలి మామిళ్లపల్లెయో కృష్ణామండలములోని నూజివీడుతాలూకాయందలి మామిళ్లపల్లి అగ్రహారమో, యయియుండు నని, ఆంధ్రవిజ్ఞానసర్వస్వమున బ్ర. శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు వ్రాసియున్నారు. కాని అభినవచూత మీరెండు గ్రామములుకూడఁ గావనియు, నిజామురాష్ట్రమందలి "లేమామిళ్ల" యను గ్రామమని బ్ర.శ్రీ బూరుగుల రామకృష్ణారావుపంతులుగారు (ప్రస్తుతము కేరళ రాష్ట్ర గవర్నరు గారు) గోలకొండ పత్రికలో వ్రాసియున్నారు. అదియే నిజము. చరికొండసీమని నిజామురాష్ట్రములోనిది. కాకునూరు చరికొండసీమలోనిదని పై పద్యములో నున్నది. కావున సోమపండితునకు సింగనమంత్రి, సంపాదించిన యగ్రహారమును నిజామురాష్ట్రములోనిదని చెప్పుటకు సందేహింపఁ బనిలేదు. ఈసోమునకు గంగాంబయందు, అనుగయ్య, కొండలయ్య, రంగప్ప, లక్ష్మయ్య యను నల్గురు పుత్రులు ఉద్భవించిరి. ఇందులో రంగప్ప, కన్నమ్మయందు, తిరుమలభట్టు, గంగయ్య, పెదసోమయ్య, చినసోమయ్య యను నల్వురు కుమారులను గాంచెను. ఇందులోఁ బెదసోమయ్య అప్పకవికిఁ దాత. ఇతఁడు నానాధర్మకార్యములను జేసిన ట్లీ క్రింది పద్యములో నున్నది.

సీ. కొట్టించె నెవ్వఁడు గుగునాపిన ప్రస
క్షీణభాగమున నొంపచర్లలోనఁ ?
గట్టించె నెవ్వఁడు ఘనశిలాసాలంబు
రంగుగా శంకరలింగమునకుఁ
బెట్టించె నెవ్వఁడు పృథుతరారామంబు
గుడిపాటికడ వినుకొండకోవఁ
బుట్టించె నెవ్వఁ డప్పురియామ్యదిశ గుంట
ద్రవ్వించి పశువులు ద్రావజలము

తే. క్షితిఁ దలంపఁగ సర్వజ్ఞశేఖరుండు
సత్పథవిహారి ద్విజరాజచారులక్ష
ణాన్వితుం డెవ్వఁ డతఁడు సోమాభిధుండు
కాకునూరికులాఖ్యసాగర భవుండు

ఈ పెద్దసోమయ్య వట్టెంపెద్దిభట్టునకు సోదరియైన కృష్ణమ్మనుఁ బరిణ యమాఁడి కుమారులనుఁ గుమార్తెలనుఁ గాంచెనని యీక్రిందిపద్య ములోఁ గవి తెలిపియున్నాఁడు.

ఉ. వట్టెము పోతనార్యసుతవర్యుఁ డనందగు పెద్దిభట్టు తోఁ
బుట్టినకృష్ణఁ గైకొని సుపుత్త్రిల వెంగన గన్నభట్టు బ
ల్దిట్టను గంగ యన్సుతులఁ దిమ్మనురంగను లింగగోనమన్
రట్టడిఁ గాకునూరి పెదరంగయ సోముఁడు గాంచె వేడుకన్.

ఈకుమారులలో వెంగన, కవికిఁ దండ్రి. ఈ వెంగనకు పెద్దిభట్టు మేనమామ. ఇతఁడు సాయప వెంకటపతి భూపాలునివలన కామిపల్లె నగ్రహారముగా బడసినట్లు షష్ఠ్యంతములలోని యీక్రింది రెండు పద్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

క. సాయప వెంకటపతి భూ
నాయక దత్తాగ్రహారనగర ప్రాగ్దే
శాయత దేవాలయమునఁ
బాయకవసియించు గోపభామాపతికిన్.

క. శ్రుతశాస్త్రాగమ జతగీ
ష్పతి వట్టెము పెద్దనార్య సంపాదితపు
ణ్యతరాగ్రహార పూర్వ
క్షితిజశమీయామ్యమున వసించినహరికిన్.

ఈకవి పూర్వులు మొట్టమొదట నిజాంరాష్ట్రమందలి లేమావిళ్ల వాస్తవ్యులైనను పెదసోమయ్యకు వివాహమైనపిమ్మట, నాతఁ డీ కామి పల్లెకు వచ్చి యచ్చట నివాస మేర్పరచు కొనియెనని మన

మూహింపఁ దగియున్నది. కామెపల్లెలు నాలుఁగు గలవు. నెల్లూరు మండలములో రెండును, ఇంకొకటి గుంటూరుమండలములో గుంటూరు జాలతాలూకాయందును, వేరొకటి గుంటూరుమండలములో నర్సా రావుపేట తాలూకాయందు నున్నవి. ఇందుఁ గవిపూర్వుల నివా సము గుంటూరుజాలతాలూకాలోని కామెపల్లె యయియుండునని తోఁచు చున్నది. కవి తండ్రియైన వెంగన పల్లెనాటను నూటతొంబదినాల్గు గ్రామములలోను వేదపఠనమునం దద్వితీయుఁ డనియు, నపరబ్రహ్మ యనియు, పేర్గాంచినట్లు అప్పకవి యీక్రింది పద్యములోఁ దెల్పి యున్నాఁడు.

తే. పల్లెనాటను నూటతొంబదియు నాల్గు
గ్రామముల సీడుగానక కామనూరి
వెంగనార్యుఁడు వేదవేదాంగములను
బ్రస్తుతికి నెక్కె మాఱుటబ్రహ్మ యనఁగ.

ఈపల్లెనాటినే యిప్పుఁడు పల్నాడని పిలుచుచున్నారు. ఇది గుంటూరు జాలతాలూకాలోనిది. వెంగన లేమావిళ్ల నివాసుఁడైనను మఱి యొక కామిపల్లె నివాసుఁడైనను పల్నాటియందు వేదవేదాంగము లలోఁ బేరుగాంచియుండుట పొసఁగదు. అప్పకవి తల్లిపేరు శేషమ్మ. ఇతనికి సోదరులుగూఁడ నున్నట్లీక్రింది పద్యమువలనఁ దెలియు చున్నది.

ఆ. కామనూరి వెంగఘనుఁడు సేసమయందుఁ
గాంచెమొదల నప్పకవిని నిన్ను
వెనుక సోమనార్య వేంకటపతిఁ గృష్ణ
భట్టు లక్ష్మణాఖ్య బాలుఁగాంచె.

అప్పకవీయమును కామిపల్లె గోపాలస్వామికి కృతియిచ్చుట చేతను నాకామిపల్లెయున్న ప్రదేశమును చుట్టుప్రక్కల గ్రామములచే ననేక పద్యములలో నిర్ధారణముచేసియుండుటచేతను, నీతఁడు లేమావిళ్ల నివాసుఁడు కాఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

అప్పకవీయము రచియింప ప్రారంభించిన కాలమునాగ్రంథ మునందే చెప్పుకొనియున్నాఁడు. ఆపద్యమును నన్నయభట్టుచారి త్రమున నుదాహరించియుంటిని. కాని పాఠకుల సౌకర్యార్థము దానిని మఱల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

సీ. ధాత రెండవపరార్థమున నాదిది
　　　　నంబు పగటి వరాహకల్పంబునందు
　మహిత వైవస్వతమనువేళ దేశం
　　　　బులద్ధించ నైన మహాయుగమునఁ
　గలిసమయంబునఁ దొలిచరణంబు
　　　　నమానితంబగు చాంద్రమానమునను
　శాలివాహననామశకమున గజ
　　　　శైలశరసుధాకిరణులసంఖ్య (1578) నడవ
తే. నంగజాబ్దంబునకు దక్షిణాయనమున, జలధరర్తువు మొదలి
　　　　మాసంబునందు
　బహుళమున దేవకికిఁ జక్రపాణివుట్టి, నట్టియష్టమినను దేర నధిక
　　　　భక్తి

ఈపద్యమునం దుదాహృతమైన శా.శ. 1578 మన్మథనామసంవత్సర శ్రావణ బ॥ 8 తిథి, క్రీ శ. 1656 సంవత్సరము ఆగష్టు 3 వ తేదీ యయినది. ఈతని రచనములలోని దియే కడపటిది కావున నీ కవి 1600 ప్రాంతమున జన్మించి, 1660 వరకు జీవించి యుండునని మన మూహింపవచ్చును.

అప్పకవి చెప్పిన "కామెపల్లి" యిప్పుడు లేదని కొందఱను చున్నారు. అది యింకను పరిశోధింపవలసియున్నది.



## 287. ఎలకూచి పినయాదిత్యుఁడు

ఇతనికి పిన్నయ ప్రభాకరుఁ డని నామాంతరము కలదు. మహోమహోపాధ్యాయ బిరుదాంకితుఁడై రాఘవపాండవయాద వీయాది బహు గ్రంథరచనాధురీణుఁ డగు ఎలకూచి బాలసరస్వతి కీకవి సహోదరుఁడు. ఇతఁ డాదిత్యపురాణమను నెనిమిదాశ్వాసముల పద్యకావ్యమును రచియించి హంపూరి గురవమంత్రిందున కంకితము చేసెను. బాలసరస్వతికిఁ దమ్ముఁడు. కావున నీతఁడు పదునేడవ శతాబ్దిని ప్రథమపాదమున నున్నవాఁ డని నిస్సంశయముగాఁ జెప్ప వచ్చును. ఈ ఆదిత్యపురాణము ముద్రితముకాలేదు. ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయమునం దత్యంత శిథిలావస్థలోనున్న యొకవ్రాతప్రతి కలదని గోలకొండకవుల సంచికవ్రాయుచున్నది. ఆగ్రంథమును జూచు భాగ్యము నాకుఁ గలుగలేదు. అందుచే నీతని గవిత్వశైలినిజూపు మచ్చుపద్యముల నీయలేకపోయితిని. శతకకవుల చరిత్రలో నీక్రిందివాక్యము లీతనినిగూర్చి వ్రాసియున్నారు.

"ఆదిత్యపురాణ మెనిమిది యాశ్వాసముల గ్రంథము. ఇతఁడు చతుర్విధకవిత్వ రచనాధౌరేయుఁడు. ఆదిత్యపురాణమును దాత యగు హంపూరి గురవమంత్రిందునకుఁ గృతియిచ్చెను. ఈతని తాతయగు భైరవుడు రామరాజాస్థాన కవియఁట."



## 288. విజయరాఘవ భూపాలుఁడు



ఈతనిని "అచ్యుతవిజయ రాఘవ భూపాలుఁడని కూడానం దురు. ఇతఁడు చతుర్థకులజుఁడు తంజావూరు రాజ్యమును బరిపాలిం చిన నాయకప్రభువులలో నీతఁడు కడపటివాఁడు ఇతఁడు క్రీ.శ. ౧౩౩౩ వ సంవత్సరము మొదలు ౧౩౭౩ సంవత్సరమువఱకును తంజావూరు రాజ్యమును బరిపాలించి యుండెను. ఈతనితండ్రి రఘు నాథనాయకుఁడు; తాత అచ్యుత రాయనాయకుఁడు; ముత్తాతచిన చెవ్వనాయకుఁడు;

విజయరాఘవుని జనకుఁడగు రఘునాథనాయక ప్రభువు సంస్కృతాంధ్ర భాషాకవిత్వ విశారదుఁడు. సంగీతవిద్యానిధి. ఉభయభాషా కోవిదుఁడు. ఈతనిచారిత్రము నీసంపుటమున మొదట వ్రాసి యున్నాఁడను.

విజయరాఘవుఁడు గూడ గొప్పపండితుఁడును గవియు నై యున్నాఁడు. ఈతని యాస్థానమునఁగవులు, కవయిత్రులు చాలఁ గాఁగలరు. ఉషాపరిణయాది కావ్యములను రచించిన పసుపులేటి రంగాజమ్మ యీతని యాస్థానకవయిత్రి. చెంగల్వల కాళయ, కామరుసు వెంకటపతిసోమయాజి మొదలగువార లీతని యాస్థాన కవులు.

ఈతఁడు రచించిన గ్రంథనామము లీక్రింది సీసమాలికలో నీతని ప్రహ్లాదనాటకమునఁ జేర్పఁబడినవి.

సీ. శ్రీలోంద <u>రాజగోపాల విలాసనా</u>
        <u>టకము</u> సందర్శించు సుకవివంద్య
మధురోక్తులను <u>చెంగమలవల్లి పరిణయం</u>
        బానతిచ్చిన ప్రతిభానిధాన

కోవిదుల్ గొనియాడ గోవర్ధనోద్ధర
ణము రచించిన కల్పనా ధురీణ
రతిమన్మథవిలాస కృతిరాజమొనరించి
పరగు ప్రాబంధిక పట్టభద్రి
విభుని రాసక్రీడ నవనీత-చోరంబు
హావణించి వెలయు మహానుభావ
చాతురిచే పారిజాతాపహరణంబు
రచనచేసిన మృదువచనధుర్య
ఘనమైన రుక్మిణీకల్యాణమును కృతి
నిర్వహించిన బుధసార్వభౌమ
వసుసరాధామాధవవివాహమ్ముధానాభి
రామంబొనర్చు సర్వజ్ఞతిలక
పాండిత్యమున సత్యభామావివాహవ
ర్ణనమొనర్చిన కవిరాజరాజ!
ప్రాజ్ఞులానననుపాపరిణయనాటకం
బమరఁ జేసిన శారదావతార
దక్షిణద్వారకౌస్థల వర్ణనాభాగ
ముద్ధరించిన సుప్రసిద్ధచరిత
మహిమచేఁ గాళియమర్దనం బొనరించు
సరిలేని రాజులచక్రవర్తి
ధర రఘునాథాభ్యుదయము నాటకముగా
ద్విపదగా రచియించు ధీరవర్య
అలమోహినీవిలాసాఖ్య ద్విపదకృతి
నాటకంబొనరించు వలసమాన
అతిపవిత్రంబు ప్రహ్లాదచరిత్రంబు
సవరించు ఘనమనీషాధురీణ

హరువునపూతనా హరణంబనెడు నాట
కం బొనరించు శృంగారలోల
తగు మంజరీద్విపద ప్రబంధము నాట
కంబుగా హవణించుగానచతుర
విప్రనారాయణ విద్వత్కథాసంవి
ధానంబొనర్చినధీనిధాన
బుధులు మెచ్చసముద్ర మథన నాటకరాజ
మొనరించు భువన మోహనచరిత్ర
లలితమౌ కృష్ణవిలాస నాటకమణి
సల్పిన యష్టభాషాధురీణ
ఘనతరంబగు పాదుకాసహస్రంబెల్ల
ద్విపదఁ జేయు కళావతీ తనూజ
రసికులు ప్రణుతింపఁ బ్రణయకలహమను
కృతియొనర్చిన చమత్కృతి ధురీణ
అతులిత ప్రౌఢిచే నలకంసవిజయంబు
ఘటియించు భువనవిఖ్యాతశీల
ఘనమైన జానకీకల్యాణ నాటకం
బమరించువావదూకాగ్రగణ్య
నవపుణ్యకవ్రత నాటకవైఖరి
సేకరించిన వాగ్విశేషశేష
కేళిమై గోపికాగీతలు భ్రమరగీతలు
తెనింగించు నద్యతనభాజ
సరిలేనిఫాల్గుణోత్సవ మెల్లరగడచౌ
పదములొనర్చిన భవ్యచరిత
ధర రాజగోపాలదండక సందర్భ
వైదర్భిగన్న విద్వత్కవీంద్ర!

సారమౌ వీరశృంగారసాంగత్యంబు
మెఱయించు రసికుల మేలుబంతి
సంపంగిమన్నారు సాంగత్యము నమర్చి
జగతిమెచ్చిన నెరజాణరాయ
గోపాలునకు వీడుకోలు విన్నపములు
దరువులొనర్చు నౌదార్యధుర్య
యేలలువిడి పదాల్ హెచ్చుసంకీర్తన
లధ్యాత్మములొనరించు నతులచర్య
వాల్మీకిగుజ్జరి విశ్వేశుదండు లా
స్యముకంతుకక్రీడ యల్లికయును
కొరవంజి శుభలీల గుజరాతిదేశిచా
పదము జక్కిణి దురుపదము మదన
పదదూత్యమును జోగిపదచాళి శారదా
సామ్రాజ్యమును చిందు సవతి మచ్చ
రంబులు నాట్యకందంబు మొదలైన
నాట్యముల్ హావణించునవసుజ్ఞ

తే. మహితగాంభీర్య చోళసామ్రాజ్యధుర్య
కోటిమన్మథరూప సద్గుణకలాప
విక్రమకుమార రఘునాథవిభుకుమార
ధ్రువముగామను విజయరాఘవనృపాల!

ఇందుఁ జెప్పబడిన గ్రంథములలో చాలభాగము యక్షగానములు, కొన్నిద్విపదలు, కొన్నిగేయములు, కొన్నిపదములునై యున్నవి, ప్రబంధములసంఖ్య యతిస్వల్పము. ఈగ్రంథములలో నేదియును ముద్రితము కాలేదు. తంజావూరు సరస్వతీమహాలు భాండాగారమునందు, రఘునాథాభ్యుదయ ద్విపదకావ్యము, కాళియమర్దననాటకము, ప్రహ్లాదనాటకము, పూతనాహరణనాటకము, రఘు

నాథాభ్యుదయనాటకము, విప్రనారాయణచరిత్రనాటకము నను గ్రంథముల యముద్రిత ప్రతులు మాత్రమున్నవి. వేలకొలఁది గ్రంథములున్న యీపుస్తకభాండాగారమున నీతని గ్రంథములు లేకుండుటకుఁ గారణము తెలియరాకున్నది. ఈతఁడు కృతినందిన గ్రంథములును బెక్కులుకలవు. రంగరాజమ్మ రచించిన మన్నారుదాసవిలాసము, ఉషాపరిణయము, చెంగల్వాలకాళయ రచించిన రాజగోపాలవిలాసము, వెంకటపతి సోమయాజి రచించిన విజయరాఘవచంద్రికావిలాసము, కోనేటి దీక్షితచంద్రుఁడు రచించిన విజయరాఘవకల్యాణము, పురుషోత్తమదీక్షితుఁడు రచించిన తంజాపురాన్నదానమహానాటకము, మొదలగు ననేకగ్రంథముల కీతఁడు కృతిపతి. మొత్తముమీఁద తంజావూరునందు, నాయకప్రభువులకాలములోను, మహారాష్ట్రప్రభువుల కాలములోనుగూడ. నాటకరచనమునకును, నాటకప్రదర్శనమునకును బ్రోత్సాహ మెక్కువగా నుండెడిదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. అప్పటినాటకములిప్పటి నాటకములవలె గాక యక్షగానములై వీథినాటకములుగా నుండెడివి. విజయరాఘవభూపాలుఁడు పండితుఁడు, కవి, కవిపండితపోషకుఁడు. దానధర్మములయం దాసక్తికలవాఁడు. ఈతనికాలమున తంజాపురాన్నదానసత్రమున ననుదినము లక్ష బ్రాహ్మణులకు భోజనము పెట్టఁబడుచుండెడిదఁట ఆంధ్రదేశమందిప్పటికిని విశేషజనులకు భోజనము పెట్టినట్లు చెప్పుటకు "అన్నప్రదానము తంజావూరు సత్రము" నందు వలెనున్నదని సామెతగాఁ జెప్పుచుందురు. ఈతఁడు పట్టాభిషేకము నందిన సంవత్సరముననే యీతఁడు బ్రాహ్మణులకు షోడశ మహాదానములను గావించినట్లు రఘునాథాభ్యుదయకావ్యములోఁ గవి యిట్లు చెప్పియున్నాఁడు.

"పట్టాభిషేకవైభవము గైకొన్న
యట్టిసంవత్సరమందొకనాట

సవలీలగాఁ బదియాఱు దానములు
సవరించి ద్విజుల కొసంగితివీవు''

ఈదానములు గావించిన దినమును గాళయకవి, రాజగోపాల విలాసప్రబంధమున నీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు

సీ. శాలివాహనశకసంవత్సరము వేయి
యేనూరు నేఁబది యేను నగుచు
చనఁగ శ్రీముఖనామ సంవత్సరంబున
శ్రావణశుద్ధపక్షమున ద్వాద
శిని సౌమ్యవాసరంబున దక్షిణ ద్వార
కను కృష్ణతీర్థమందు నియమమున
స్నానంబు గావించి సంకల్పపూర్వము
గాను షోడశమహాదానములను

తే. ఘనతమీఱఁ గళావతీగర్భ శుక్తి
మౌక్తికఫలంబు రఘునాథమహీపసుతుఁడు
విజయరాఘవమేదినీవిభుఁడొసంగె
వేదవేదాంతవిదులైన విప్రులకును

ఈవిజయరాఘవభూపాలుఁడు మన్నారు గుడియందలి రాజ గోపాలస్వామి యాలయగోపురమును బునరుద్ధరించుట మొదలుగా ననేక ధర్మకార్యములను జేసెను. ఇతఁడు మొదట సర్వమతసహిష్ణుఁడై యుండును కాని క్రమక్రమముగ వైష్ణవమతమునందెక్కుడు యభి మానముగలవాఁడై యితరమతములను నిరసించి ద్వేషించుచుండెను. ఈకారణముననే పరాక్రమవంతుఁడు శూరుఁడునైన కోటి రఘునాథ భూపాలుఁడీతని కొలువునువదలి వెళ్ళిపోయెనని యాతని మునిమను మని చారిత్రమున వ్రాసియుంటిని. ఈతని పరమతద్వేష మీతని రాజ్యపతనమునకుఁ గారణమైనది. ఈక్రింది పద్యములవలన మతవిష యమున నీతనికీఁగల యభిమానముఁ దెలియవచ్చుచున్నది.

సీ. శ్రీరాజగోపాల శౌరి కంకితముగా
మంజరీముఖ కృతుల్ మహినొనర్చె
రాయలు సాహిత్యరాయ పెండేరంబు
శారదాధ్వజము నొసంగ నెగడె
నపరిమితంబుగా నగ్రహారంబులు
చేసి శ్రీవైష్ణవులకు నొసఁగె
ద్వారకాపురికన్న దక్షిణ ద్వారక
మిగులవైభవముల నెగడఁజేసె

ధరణిసురులకు ననివారితముగ నన్న
దాన మొనరించు వ్రతము నిత్యముగఁబూనె
యితరమతముల నిరసించియిలను వెలయ
వైష్ణవమతంబు నిలిపె శాశ్వతముగాఁగ

— మన్నారుదాసవిలాసము

సీ. శ్రీ రాజగోపాల సేవామహిమచేత
నేరాజుధరయెల్ల నేలుచుండు
పరమతంబులనెల్ల నిరసించియేమేటి
వైష్ణవమతమె శాశ్వతముచేసె
బాల్యంబునందు నేపగతులవిజయించి
యేనేతకీర్తుల నెసగఁగాంచె
పదియాఱుదానముల్ ప్రణుతింప నేదాత
యవనీ సురులకిచ్చెనాదరించి

యాతఁడచ్యుత భూప వంశాబ్ధిచంద్రుఁ
డధిక గాంభీర్యశౌర్య ధైర్యాతిసాంద్రుఁ
డవని తంజాపురాధీశుఁడనఁగఁ బరఁగు
విజయరాఘవ మేదినీవిభువరుండు. — ఉషాపరిణయము

ఈవిజయరాఘవునకు చతుర్వేదిశతక్రతు కుమారతాతాచార్యుఁడు వైష్ణవమతగురువు. ఈతని ప్రోత్సాహముచే విజయరాఘవుని యాస్థానమున తక్కిన మతములవారికిఁ బ్రవేశము కలుగలేదు. పరిపాలమునఁగూడ మతాభిమానము చూపఁబడుచుండెను. ఈతఁడు తండ్రియైన రఘునాథనాయకునివలె సర్వమతములను సమానముగఁ జూచెనేని తంజావూరున నాయకప్రభుత్వమింకను గొంత కాలముండెడిదేమో!

చరిత్రకారులే విజయరాఘవభూపాలునిపైఁ గొన్ని నిందలను మోపుచున్నారు. వానినిగూర్చి యిచ్చటతెలుపకుండుట సమంజసముకాదు. గ్రంథరచనముతోఁగాని కవి పండితపోషణముతోఁగాని, భాషావిషయముతోఁగాని యీయపవాదములకు సంబంధములేదు. అవి రాజకీయసంబంధమైనవియు, నాతని ప్రవర్తనముతో సంబంధించినవియునై యున్నవి. అట్టి యారోపణలలో మొదటిది :— తండ్రియైన రఘునాథరాయలు జీవించియుండగా కుట్రపన్ని యాతనిని రాజ్యభ్రష్టునిచేసి తాను సింహాసన మధిష్ఠించెనట. రెండవది :— విజయరాఘవున కిరువురగ్రసోదరులుండెడివారనియు, వారి నేత్రములూడబెరికించి వారిని జెఱలోనుంచి రాజ్యమును దానాక్రమించెననుట. మూఁడవది:— తనకుమారుఁడైన మన్నారుదేవుని కారాగారమునందుంచెననుట. నాల్గవది:— తండ్రివలె పరాక్రమవంతుఁడుగాక భీరుఁడై రాజ్యరక్షణము సందసమర్థుఁడై శత్రువులకు లంచమిచ్చి రాజ్యమును నిలుపుకొన యత్నించి యందుకొఱకు ప్రజలను పీడించి ద్రవ్యమును గొనెననుట. ఐదవది:— భోగ్యకలాలసుఁడై సర్వదా స్త్రీగోష్ఠియందే కాలముగడపి రాజ్యపాలనమునందుపేక్షాభావమువహించెననుట—

ఈయైదును నీలాపనిందలు గాక నిజములే యైనయెడల, నీతఁడెన్ని గ్రంథములను రచించినను, నెంతవైష్ణవ భక్తుఁడైనను

కుంతవ్యుఁడు గాఁజాలడు మనమప్పుడీతనిని విజయరాఘవరాక్షసుఁడే యని పిలువవలసియుండును.

తంజాపురాంధ్రనాయక చరిత్రమును రచించిన శ్రీ కురుగంటి సీతారామయ్య M. A. గారు, అదివఱకున్న చారిత్రములను మిష నరీలయుత్తరములను, మఱికొన్ని ముద్రితాముద్రిత గ్రంథములను బరిశీలించి విజయరాఘవుని పై నిట్టియపవాదములున్నవని తమగ్రంథ మున వ్రాసియున్నారు. ఆంధ్రాంగ్లేయగీర్వాణాది భాషలయందు నిరుపమాన పాండిత్యమును సంపాదించి న్యాయశాస్త్ర పారంగతులై తంజావూరు సరస్వతీమహాలు పుస్తకభాండాగారమున నుపద్రష్టలుగ బనిచేసినవారు. తంజావూరునందు గొంతకాలమునివసించి యిచ్చటి పరిస్థితులను బ్రత్యక్షముగఁజూచియు నచ్చటి వదంతులను వినియు బహుగ్రంథపరిశోధన గావించి విజయరాఘవుఁడట్టి నేరములను గావించెనని నిశ్చయించినప్పుడదికాదనఁ జాలను. కాని విజయరాఘ వునిపై మోపఁబడిన నేరములనాతఁడు గావించెనని నిశ్చయించుటకుఁ దగినంత సాక్ష్యము లేదని తోఁచుటచే సీతారామయ్యగారి యందధిక గౌరవముంచుచునే నావిషయములను పాఠకలోకము నెదుటనుంచుచున్నాఁడను. విజయరాఘవుఁడట్టి నేరములను గావిం చెనో లేదో నిర్ణయించుభారము పాఠకమహాశయులది.

రఘునాథరాయలు జీవించియుండగనే విజయరాఘవుఁడు రాజ్యమునకు వచ్చెననుమాట నిర్వివాదాంశము. ఆతఁడెట్లు సింహాస నమునకు వచ్చెనను విషయమే వివాదాంశము.

"తరచి యాలోచించిన విజయరాఘవుఁడు రాజగుటలో సరియైన మార్గమునఁ బ్రవర్తింపనట్లూహ వొడమును. ఏదియో దుర్మార్గముకావించి రాజ్యమునందలి సరదారులను దన పక్షమునకుఁ ద్రిప్పుకొని వెంకటమఖి మొదలగువారి సాయమువలన సింహాసనమధి ష్ఠించినట్లు కనఁబడును. నిజముగా తండ్రితరువాత కుమారుఁడు

రాజ్యమునకు వచ్చుటయందితనులచే "ప్రతిష్ఠాపితుఁడేల కావలసి వచ్చెను? ఆవాక్యముల నేయేదో యొక విపరీతార్థమిమిడియున్నట్లు స్ఫురించును. ఈ వేంకటేశ్వరమఖికూడ నెక్కువకాలముమంత్రిత్వము చేసినట్లు కానరాదు. మొదటి సంవత్సరములనుతప్ప నీయన పేరును నేయాస్థానమున కానము. ఈయనదియే యననేల? రఘునాథుని యాస్థానమునందలి పేరులలో నొక్కకుమారతాతాచార్యుఁడు తప్ప విజయరాఘవుని యాస్థానమునందు మరియెవ్వరు నున్నట్లు తోఁచదు. తుదకు మధురవాణీరామభద్రాంబలకుఁగూడ తావులేకపోయెను."

తంజాపురాంధ్రనాయక చరిత్రమునందీవిధముగా వ్రాయఁబడినది. వీరరాఘవునకు రాజ్యసంప్రాప్తి విషయమున నిట్లుసంశయించుట కాధారములేవియో తెలియలేదు. తండ్రి సంతోషపూర్వకముగా తనయునకు రాజ్యమిచ్చెనని యేల తలంపరాదు? ఈవిషయమున రఘునాథరాయలు తన తాతతండ్రుల మార్గమునను సరించెనని యేల తలంపరాదు?

రఘునాథనాయకుని తాతయైన చెవ్వభూపాలుఁడు తాను జీవించియుండగనే తనకుమారుఁడైన అచ్యుతనాయకునకు రాజ్యము నిచ్చివేసెను. అట్లే యచ్యుతనాయకుఁడును దనజీవితకాలమునందే రఘునాథరాయలకు రాజ్యమొసంగియున్నాఁడు.

"అనగా క్రీ.శ. ౧౫౬౧ సంవత్సం ప్రాంతమున చెవ్వప్ప తనకుమారుఁడగు నచ్యుతనాయకునిపై రాజ్యభారముంచి తాను 'సుఖసత్కథావినోదంతో' కాలముగడుపుచుండి యుండును. అచ్యుతుఁడును తాను పెద్దవాఁడైన వెనుక రాజ్యభారము తనకుమారుఁడగు రఘునాథునిపైనుంచి తానుశ్రీరంగమున భగవత్కైంకర్యముచేయుచు కాలముగడిపినట్లు తెలియును"

తంజాపుర ఆంధ్రనాయకులచరిత్ర ౧౧౧ పేజీ

"సర్వం స్థైర్యవిధూతమేరువిభవే సర్వంసహాయం భరం
ప్రౌఢేఽస్మిన్ రఘునాథనామ్ని దధత్పుత్రేఽచ్యుతక్ష్మాపతిః

శ్రీరంగస్థలసంగతో బుధకులం శీతాంశురుర్వీమివ
ప్రాప్తస్సైవ పుపోష శేషశయనేభక్తః పరేధామని—''

— సాహిత్యరత్నాకరము

విజయరాఘవభూపాలుని రాజ్యారంభకాలమైన క్రీ. శ. ౧౬౩౩వ సంవత్సరమునాటికి రఘునాథభూపాలున కరువది యేండ్లకు మించిన వయసుకలదు. ఆవయసునందు రఘునాథభూపాలుఁడు ప్రాజ్ఞుఁడైన విజయరాఘవభూపాలునకు స్వయముగా రాజ్యమిచ్చె ననుటలో విపరీతమేమియును లేదు. అట్లే తండ్రియైన రఘునాథఁ భూపాలుఁడు తనకు రాజ్యపట్టము గట్టెనని, విజయరాఘవుఁడు తాను రచించిన రఘునాథాభ్యుదయ నాటకములోఁ జెప్పుకొని యున్నాఁడు. అయితే "ఈరఘునాథాభ్యుదయ నాటకము చరిత్ర మున కుపయుక్తమైనను మదిభాగమసత్యముగ నున్నది'' అనివ్రాయు చు, సీతారామపండితులు రఘునాథుఁడే నాటకరచనకు మెచ్చి విజయ రాఘవునకు రాజ్యమిచ్చెనని యీనాటకాంతమున వ్రాయఁబడి యున్నదనియు, వాస్తవముఁ బరిశీలించినచో, విజయరాఘవుఁడు రాజ్యభారమువహించిన కొంతకాలమునకుఁ బిమ్మటనీనాటకము రచి యింపబడియెననియు, నందుచే రఘునాథరాయలు మెచ్చి రాజ్య మిచ్చెననుట యసత్యమనియు నొకకారణమును జూపుచున్నారు. రఘునాథాభ్యుదయనాటకము, విజయరాఘవుడు రాజ్యమునకు వచ్చినపిమ్మటనే వ్రాయఁబడినదనుమాట సత్యము. కాని నాటకము వ్రాసినందులకు మెచ్చి రాజ్యమొసంగెనని విజయరాఘవుఁడు నాట కాంతమున వ్రాయులేదని నాయభిప్రాయము. నాటకాంతమున వ్రాసిన వాక్యములివి.

''వ. అనియుపచరించిన రమణీమణికేలుగీలించి రఘునాథ భూపాలుండు కేలిభవనంబుఁ బ్రవేశించి, పంచశరకళా ప్రపంచం బెఱింగించి యమ్మెఱుంగు బోఁడినికరంగించి యచ్చటముచ్చట దీర

నమ్మొచ్చి కంటెని పచ్చవింటి దొరతనంబునకు గుణిచేసి యేలుచు విజలీలావిలాస శృంగాటకంబుగా నాటకంబు హవణించిన తనముద్దు పట్టియగు విజయరాఘవపట్టభద్రునకు సామ్రాజ్యపట్టంబు గట్టి యతండు గావించు వివిధోపచారంబులకు హర్షింపుచు నమరులు పుష్పవర్షంబు వర్షింప శుభోదర్కంబుగానటించెనంట యొఱువ లెను. మన్నారు దేవికి మంగళం.

ఈనాటకము రఘునాథునకు నాతఁడు గోరిన యువతికిని సమాగమముఁజూపుటకై రచియింపఁబడినది. నాటకాంతమున భరత వాక్యముగా పై వచనము వ్రాయఁబడినది. అది రఘునాథుఁడు తన రాజ్యమును తనముద్దులపట్టియైన విజయరాఘవునకిచ్చి తాను సుఖముగా నుండెనని తెలుపుట కుద్దేశింపఁబడిన భరతవాక్యము కాని, యీనాటక రచనకు మెచ్చి రఘునాథుఁడు విజయరాఘవునకు రాజ్యమిచ్చినట్లందు వ్రాయఁబడలేదనినాయూహ! "మెచ్చి" యనుమాట యీవాక్యములలో లేదు. "విజలీలావిలాస శృంగాటకంబుగా నాటకంబు హవణించిన" యను వాక్యము విజయరాఘవునకు విశేషణముగా నుపయోగింపఁబడినదిగాఁ దలంపవలసియున్నది.

వాదమునకొఱకు విజయరాఘవుని యీవాక్యములయందు నాటకరచనకు మెచ్చి పట్టాభిషేకమొనర్చెనను నర్థమున్నదని యే యంగీకరింతము. ఆతఁడెందులకట్లు వ్రాసియుండును? అపసవ్యమార్గమున రాజ్యమును, దానుసంపాదించి సవ్యమార్గముననే రాజ్యమును సంపాదించితినని యీనాటకమూలమున లోకమును భ్రమింపఁజేయుటకై యట్లువ్రాసి క్షీరమార్జాల న్యాయమును బ్రదర్శించి యుండవలయును. అట్లేచేసి యుండునని తలంతుమేని యీయసత్య కల్పనము నాటకమునందంతటను జేయక దొంగతనము బయల్పడునట్లుచేయునా? అట్లెన్నఁడును జేయఁడు. కావున నావాక్యములు భరత వాక్యములుగనే భావింపవలసియున్నది.

ఈనాటక రచనమునకు మెచ్చి రఘునాధరాయలు విజయ రాఘవునకు రాజ్యమొసంగలేదని తెల్పుటకై బ్ర. శ్రీ సీతారామ పండితులు మఱియొక కారణము నిట్లుగఁ జెప్పియున్నారు. "ఏలన స్వభావవిరుద్ధమగు సందర్భము కలుగఁజేసి చిలుక రాయభారము చేయించి రఘునాథునకును నాయనను ప్రేమించిన యొకనాయికకును సంయోగము కూర్చినాఁడు. ఇయ్యదిచదివిన రఘునాథుఁడు తనను గూర్చి యిట్లువ్రాసిన నూరకుండునాయని యనిపించును. ఇదియొక వైరుద్ధ్యము."

విజయరాఘవుఁడు నాటకరచనమునకుఁ బూర్వమే రాజ్య భారమును వహించెననినచో నీవైరుధ్యమునకవకాశమే యుండదు. రఘునాథుఁడే నాటకరచనమునకు మెచ్చి రాజ్యమీయలేదనియు, కుమారునియందుఁగల సహజానురాగముచేతను బూర్వాచారము ననుసరించియును రాజ్యమిచ్చెననియుఁదలఁచినప్పుడుకూఁడ నీవైరుద్ధ్య ముండదు. నాటకరచనమునకు మెచ్చి రాజ్యమునిచ్చినాఁడన్నప్పుడే యీవైరుద్ధ్యము తటస్థించును. అప్పుడుకూడ నీవైరుద్ధ్యమునకుఁ దావుండదని నామనవి. రఘునాథభూపాలుఁడు దక్షిణ నాయకుఁడు. ఐదుగురు భార్యలుకలవాఁడు. తనకు భార్యకాని రామభద్రాంబ తనకుఁగృతియొసంగిన కావ్యములో భార్యనని వ్రాసికొనుట కంగీక రించినవాఁడు. కేవల భోగైకలాలసుఁడు కాకపోయినను విలాసపురు షుఁడు. శృంగార సావిత్రివంటిగ్రంథమాతనివలననో, యాతఁడుంచు కొనిన వనితవలననో రచియింపఁబడినట్లు చెప్పఁబడుచున్నది. అట్టి వాఁడీగ్రంథమునుజూచి సంతోషించెననిన విపరీతమేమియుండును?

రఘునాథుఁడు నాటకశాలలను గట్టించి నాటకములనుబ్రోత్స హించినవాఁడని విజయవిలాసమునందలి యీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

ఉ. మాటలనేర్పులా సరసమార్గములా కొలువుండురీతులా
పాటలగంధులా కళలభాగ్యములా బహుదానలీలలా
నాటకశాలలా యొకటనన్ వలదెన్నిటఁజూడనన్నిటన్
మేటియుఁగీర్తిలోలుఁడుసుమీ! రఘునాథనృపాలుఁడిమ్మహిన్

విజయరాఘవుఁడు తననాటకమున రాయబారమున కుపయోగించుకొనిన చిలుకకూడ రఘునాథుని యంతఃపురములోనిదే.

తే. రసికమాత్రుండె యంతఃపురప్రడీన
సారసారస్వతాధార శాలికాశు
క వనకృతముఖ శుక కళాకలన హృష్ట
బుధజనాస్థాని రఘునాథభూమిజాని.

రఘునాథుఁడు నాట్యవిద్యావిశారదుఁడు
"యాలంబునఁగిరీటి యంతవాఁడౌనె కా
యమితనాట్యప్రౌఢి నంతవాఁడె"

ఇంకను రఘునాథుఁడెట్టి హృదయము కలవాఁడో విజయవిలాసమువందలి యీక్రింది పద్యములవలనఁ దెలియనగును.

క. యాచనకవినుత వనితా
సేచనక మనోహరాంగ శృంగారకళా
సూచన క్రమ కవితా
లోచన కందళితహర్షలోలుపహృదయా!

ఉ. ఎందును విద్యలేదెఱుఁగ రెవ్వరెఱింగినఁ గొంతమాత్రమే
యందును సాహితీరసమహత్త్వ మెఱుంగరెఱింగి రేని యా
యంద మెఱుంగలేరెఱిఁగినప్పటికిన్ విని మెచ్చి యీయరె
న్నందగు నచ్యుతేంద్రరఘునాథవిభుండె ప్రవీణుఁడన్నిటన్

ఇట్టి రఘునాథభూపాలుఁడు తనన ప్రేమించినవనితను నాయికనుగాఁజేసి తనముద్దులపట్టినాటకముప్రాసెనవిన సంతసించెననుటలోఁ

దప్పేమియుండును? ఈనాటకము నిఁక నొకపండితుడో, కవియో, కవయిత్రియో రచించిన రఘునాథభూపాలుఁడు సంతసించునందురా? ఆగ్రహించునందురా? కవులు పండితులు తనను నాయకునిగాఁ జేసి శృంగార గ్రంథములను రచించినప్పుడు సంతసించిన సంతసింప వచ్చునుగాని కుమారుఁ డట్టి కావ్యమును జేసినప్పుడు సంతసింపఁ డని యందురేమో! ఈకాలమున నట్టి రచనమును గుమారుఁడు చేయను జేయఁడు. తండ్రి సంతసింపను సంతసింపఁడు. కాని యీ నాటకమును రచియించినది విజయరాఘవుఁడు. ఆతండ్రి సంతసిం చిన సంతసించియుండును. ఆకాలమునాఁటి పరిస్థితులవి. ఈనాఁటి పరిస్థితులను, నీనాఁటియూహలనుబట్టి యానాఁటి కార్యములను విమ ర్శించుటలోఁ బ్రమాదము కలుగవచ్చును. సత్యభామను, రాధను నాయికలనుగాఁజేసి శ్రీకృష్ణుని నాయకునిగానొనర్చి యనేక శృంగార కావ్యములను మిగులఁ బచ్చిగాఁ గావ్యములను నాటకములను రచిం చినకాలమది. భగవంతుని నాయకునిగాఁ జేసి శ్రీమహాలక్ష్మిని నాయికనుగా నొనర్చి శృంగారకథలను గల్పించిన కాలమది. తండ్రి భగవంతుఁ డనియు, దల్లి శ్రీమహాలక్ష్మి యనియు నెంచి పవిత్రో ద్దేశముతో నాదిమదంపతుల లీలలవలె తలిదండ్రుల వివాహావిలా సాదిలీలలను గావ్యరూపమున లిఖించి యానందింపవలయునను కాల మది. సీత, సావిత్రి, దమయంత్యాదులను గులటలనుగాఁ జిత్రించి యానందించుకాలమది. శ్రీనాథుఁడు గావించిన దమయంతీవర్ణన మునుజూచి యసహ్యమును జెందుకాలమిది. కార్యములను విమ ర్శించుటలో దేశకాలవ్యత్యాసమును గమనించుట విమర్శకుల ధర్మము.

ఈనాటకరచనమునకు మెచ్చి రాజ్యమీయలేదని నిర్ధారణ మైనచో, దానినిబట్టి విజయరాఘవుఁడు కృత్రిమమార్గమున రాజ్య మును సంపాదించెనని తలంచుట కవకాశముండునని బ్రి.శ్రీ సీతారా

మయ్యగారి యుద్దేశమై యుండును. విజయరాఘవుఁ డపసవ్యమార్గ మున రాజ్యమును సంపాదించెనని చెప్పుటకీ నాటకము సాక్ష్య ము గాఁజాలదనియు. బలవత్తరమైన మఱియొక సాక్ష్యముగనపడుట లేదనియు, విజయరాఘవునిపై నేరస్థాపనమునకుఁ దగినంత యను మానరహితమైన సాక్ష్యము లభింపలేదు కావున నాతని నీ నేరము నుండి విముక్తునిజేయుట న్యాయమనియు నాయభిప్రాయము.

విజయరాఘవభూపాలుఁడు తండ్రియొక్క చారిత్రమును, ద్విపదగాను, నాటకముగాను రెండు గ్రంథములు రచియించెనని బ్ర.శ్రీ. జయంతి రామయ్యపంతులుగారు వ్రాసియున్నారు. కాని బ్ర.శ్రీ. సీతారామయ్య పండితులు, అవి రెండును వేఱువేఱుగ్రంథ ములు కావనియు, నొక్కటే గ్రంథమనియు, నది ద్విపదనాటక మనియుఁ దమతంజాపురాంధ్రనాయకచారిత్రమునఁ జెప్పియున్నారు. విమర్శించిచూడఁగా నవి రెండును వేఱువేఱు గ్రంథములనియే తోఁచుచున్నది. విజయరాఘవభూపాలుఁడు తన ప్రహ్లాదనాటక మునఁ దాను రచించిన గ్రంథనామములను జెప్పకొనుటలో "ధర రఘునాథాభ్యుదయమునాటకముగా ద్విపదగారచియించు ధీరవర్య" అని చెప్పియున్నాఁడు. దీనినిబట్టి యివివేఱువేఱు గ్రంథములని స్పష్టమగుచున్నది.

తంజావూరునందలి పుస్తకభాండాగారముననున్న గ్రంథముల పట్టికను, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు క్రీ.శ. ౧౯౩౩ వ సంవత్స రములోఁ బ్రకటించి యున్నారు. ఆపట్టికలో నీగ్రంథములు రెం డును వేఱువేఱుగా వివరింపఁబడియున్నవి. మొదటిది రఘునాథనా యకాభ్యుదయము. పట్టికలోనిది నె ౩౩౮ గు గా నున్నది. ఇది ద్విపదకావ్యము. రెండాశ్వాసములు సంపూర్ణముగానున్నవి. మూఁ డవ యాశ్వాసమునఁ గొంతవఱకు మాత్రమేకలదు. ఇందుఁ బద్య ములుగాని, దరువులుగాని వచనముగాని లేదు. ఆశ్వాసనియమ మున్నది. ఇందలి గద్య యిట్లున్నది.

శ్రీరాజగోపాల సేవానిరూఢ
సారసారస్వత సౌభాగ్యశాలి
చినచెవ్వయాచ్యుతక్షితిపాలవంశ
ఘనవాహనారామ కల్పభూరుహము
వర్ధిష్ణు రఘునాథవసుమతీనాథ
మూర్ధన్య వసుధాంబుధీ సుధాకరుఁడు
శ్రీమత్కళావతీ శ్రీమంతవతికి
నోములపంటయై నుతికెక్కు మేటి
తిరుమలశ్రీ తాతదేశికాదేశ
పరమోపదేశ తత్పరమానసుండు

* * *

అష్టభాషావిశేషాభిజ్ఞసుకవి
పుష్టిదాన నిదానభోజభూజాని
కమనీయ రుక్మిణీకల్యాణముఖ్య
సమధికనాటక సంవిధాయకుఁడు
మహనీయపద పద్యమంజరీముఖ్య
బహుళ ప్రబంధనిబంధనశాలి
తడయక పదియూఱుదానంబులొక్క
గడియలోఁ జేసిన ఘనదానపరుఁడు
అవనిచంపక వల్లికాభిధానమున
వివిధాగ్రహారముల్ వెలయించు మేటి
నవరసికులకెల్ల నాయకుండైన
కవిరాజు విజయరాఘవమహీవిభుఁడు
పలుజవ్వనులమోవి పంచదారలను
తిలకించి తియ్యని తేటమాటలను
కమనీయనవరసగర్భ సందర్భ

విమల వైఖరిమించ విరచించినట్టి
నవ్యమహా రఘునాథనాయకాభ్యుదయ
కావ్యరాజ్యమునందు ... వర్ణింప
సారశృంగార రసపరిసంగమున

తంజావూరు పుస్తకభాండాగారమున ౫౪౯—౫౫౦ సంఖ్యలుగా రఘునాథాభ్యుదయమను పేరనున్నది నాటకము. ఇందు పద్యములు, దరువులు. వచనములు కలవు. ద్విపదకావ్యములోని కృత్యాది నిందునాట్యారంభసంభాషణగాఁ జేర్చుటచే నిదికూడ ద్విపదకావ్యమని భావించియుందురు. కాని యివి రెండును వేఱు వేఱుగ్రంథములు. ఈ నాటకమందలి ప్రథమ పద్యమిది.

సీ. భోజకన్యాముఖాంభోజరాజ మరాళ
సత్యాఘన స్తన స్తబక భృంగ
జాంబవతీ విలోచనచకోర శశాంక
మిత్రవిందాతటిన్మేఘరూప
భద్రవశా ... ... ... ... ...
సుదంతావరమనోమృగేంద్రి
లక్షణారూప కలాపినపర్జన్య
భానుసుతాలతాపారిజాత

తే. షోడశస్త్రీసహస్రచక్షుః ప్రసార
హారసారమసార మోహనశరీర
విజయరాఘవ భ.........ల
కేలుమోడ్చెద రాజగోపాలనీకు...

దీనినిబట్టి విజయరాఘవుఁడు రఘునాథనాయకాభ్యుదయ మను పేర ద్విపద కావ్యమును రఘునాథాకాభ్యుదయ మను పేర నాటకమును వ్రాసినట్లును, నివి రెండును వేఱువేఱుగ్రంథములనియు స్పష్టమగుచున్నది.

ఈగ్రంథముల నిటీవల తంజావూరు గ్రంథాలయమువారు ముద్రింపించినారు. వీనికి పీఠికలను వ్రాసిన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు "ఈసంపుటమునందలి రఘునాథనాయకాభ్యుదయ; రఘునాథాభ్యుదయములను రెండు గ్రంథములకును . . ."

"పూర్వోక్తములైన రెండుగ్రంథములకును గర్తయొక్కఁడే, విజయరాఘవనృపాలుఁడు" అని వ్రాసియున్నారు.

దీనితో సంశయము తీరిపోయినది. ఇవి రెండును వేర్వేరు గ్రంథములని నిశ్చయమైనది. రఘునాథనాయకాభ్యుదయము ముద్రణమున 88 పుటలు — రఘునాథాభ్యుదయము 56 పేజీలు.

విజయరాఘవునిపై మోపఁబడిన రెండవనేర మాతనిసోదరులిరువురికండ్లనూడఁ బెరికించి వారిని కారాగారమందుంచుట — ఈ నేరస్థాపన కాధారమిరువురుమిషనరీలు తమలోఁ దాము వ్రాసికొనిన యుత్తరములు. క్రీ.శ ౧౬౫౯ వ సంవత్సరములోఁ మహమ్మదీయులు తంజావూరుపై దండెత్తినప్పుడు విజయరాఘవుఁడు పారిపోఁగా వారా కోటనుస్వాధీనముచేసికొని పిమ్మటవల్లంకోటపైకిదండెత్తి మహమ్మదీయసైనికు లాకోటను దోచుకొనినప్పుడు, అందుండు ఖయిదీలను విడిచిపెట్టిరనియు నందులో నంధులైయున్న నిరువురు రాజసోదరులుండిరనియు వారు విజయరాఘవుని సోదరులనియు నా మిషనరీల యుత్తరములలోని సారాంశము. ఇట్టియుత్తరములు రెండు రఘునాథనాయకుని యువరాజ్యపట్టాభిషేక సందర్భమునను వ్రాయఁబడినవి. అచ్యుతరాయనాయకుఁడు తన పెద్దకుమారుని చెఱయందుంచి రెండవకుమారుఁడైన రఘునాథనాయకునకు యువరాజపట్టముగట్టెనని వ్రాయఁబడినది. బ్ర.శ్రీ. సీతారామయ్య M.A గారాసందర్భమున నామిషనరీల యుత్తరము లాధారములేని వ్రాఁతలని త్రోసివేసినారు. కాని విజయరాఘవుని విషయమునమాత్ర మట్టియుత్తరమును నమ్మి విజయరాఘవునిపై నేరస్థాపన మొనర్పఁబ్రయత్నించి

నారు. అట్లు నమ్ముటకుఁ గారణ మాయుత్తరము లాకాలముననే వ్రాయఁబడినవట. రఘునాథరాయల యువరాజ్యపట్టాభిషేకము క్రీ.శ. ౧౫౯౦ ప్రాంతము. మిషనరీల యుత్తరములు ౧౬౦౦ సం వత్సరప్రాంతము. ఇంతదైనను విశేషకాలభేదములేదు. అందుచే వానిని నమ్మి వీనిని నమ్మకపోవుటకుఁ గాలభేదము కారణము గాఁజాలదు.

విజయరాఘవున కిరువు రగ్రజులున్నట్లు రఘునాథాభ్యుదయ మునను న్నది. రఘునాథరాయలకు, రామభద్రనాయకుఁడు, విజయ రాఘవనాయకుఁడు నను నిరువురు తనయులు మాత్రమేయున్నట్లు కొన్ని గ్రంథస్థనిదర్శనములున్నవి. పసుపులేటి రంగాజమ్మ రచిం చిన మన్నారుదాసవిలాస నాటకమునందును, ఉషాపరిణయమునం దును రఘునాథరాయనాయకునకు విజయరాఘవభూపాలుఁ డొక్కఁడే కుమారుఁ డని వ్రాసియున్నది. ఆగ్రంథములు రెండును విజయ రాఘవుని పట్టాభిషేకానంతరమున వ్రాఁయబడినవి. అప్పటికి రఘు నాథనాయకుని పెద్దకుమారులిరువురును గతించియుందురు. అందుచే విజయరాఘవుఁ డొక్కఁడే కుమారుఁడని యామె వ్రాసియుండును. అయిన నామెవ్రాసిన వ్రాతలయందు, దురుద్దేశమున్నదని సూచన గన్పడు విధముగా సీతారామయ్యగారు కొన్ని వాక్యములను వ్రాసి యున్నారు. వారి యభిప్రాయానుసారముగా నప్పటికి, రామ భద్రరాయలు చెఱసాలలో నుండియుండవలయును. ఆ వృత్తాంత మును గప్పిపుచ్చుటకై రఘునాథరాయల కొక్కఁడే కుమారుఁ డని యామె వ్రాసినదని యావాక్యములయందలి ధ్వని. ఇట్టివ్రాఁతలను వ్రాసియు వ్రాయించియు, లోకమును భ్రమింపఁ జేయవలయునను ప్రయత్నములో విజయరాఘవుఁడు కూడఁ జేరియుండవలయును కదా!

విజయరాఘవుని యాస్థానకవియైన చెంగల్వల కాళయకవి రచించిన విజయరాఘవ వంశావళిలో నిట్లు చెప్పఁబడియున్నది.

చ. లలిత పతివ్రతావ్రత కళావతియైన కళావతీసతీ
కులమణియుఁ మహీరమణకుంజరుఁడౌ రఘునాథమేదినీ
తలబలభేదియుంగనిరుదారుని యచ్యుతరామభద్రదో
ర్బల జయభద్రుని న్విజయరాఘవశౌరిని భాగ్యవైఖరిఁ.

క. వారలలో నగ్రజుఁడని
ధారాధారాధరాంబు ధారలచేతన్
వారించు వైరిభూవర
వారిజదుర్వార గర్వవారము నెపుడున్.

చ. ఆతనిసోదరుండు భువనావన తామరసోదరుండు సం
తత నిజకీర్తిధామసుమదామసువాసిత దిక్సువాసినీ
వితతశిరోజచూర్ణరుచి విభ్రమవిభ్రమ కృత్ప్రతాపుఁ డ
ప్రతిమజయాఢ్యుఁడౌ విజయరాఘవుఁ డిమ్మహి నేలుమేలనఁ.

ఈ కాళయకవియే రాజగోపాలవిలాసమునం దిట్లు రామభద్రనాయకుని నుతించియున్నాఁడు.

మ. విలువెల్లన్ గరుణారసంబు పలుకుల్ నీతిప్రచారోన్నతుల్
తలఁపుల్ ధర్మపుబుట్టినిండ్లు నడకల్ దాక్షిణ్యసంకేతముల్
కలరే యచ్యుతరామభద్రధరణీకందర్పునిం బోలగా
నిలలో భూతభవిష్యదద్యతనభూమీశుల్ విచారించినన్.

విజయరాఘవుఁ డీ రెండుగ్రంథములను గృతినందియున్నాఁడు. లోకమును భ్రమింపఁ జేయవలయునన్న యుద్దేశమాతనికుండు నెడల నీగ్రంథములలో నామార్పు చేయించలేఁడా? తన రఘునాథాభ్యుదయనాటకమునం దీమార్పు చేయక తన కిరువు రగ్రజులున్నట్లేల వ్రాసియుండును! రంగాజమ్మకుకూడ నీవిషయమున దురుద్దేశము లేదనియే నాయభిప్రాయము.

రఘునాథరాయల విషయమున వ్రాసిన యుత్తరములను బరిత్యజించినట్లే యీ యుత్తరములనుగూడఁ బరిత్యజించుటయుక్తము.

విజయరాఘవుని కిరువురగ్రజులున్నప్పుడు వారేల రాజ్యము నకురాలేదు? అను ప్రశ్నకుత్తరమాలోచింప వలసియున్నది. అందు రామభద్రరాయలు తోపూరి యుద్ధములో తండ్రితోఁ గూడ నున్నాఁడు. ఆవిషయము గ్రంథ స్థమైయున్నది. అటుపిమ్మట నాతనినిగూర్చి తెలిపెడి లిఖితాధారములేమియుఁ గాన్పింపవు. తోపూరుయుద్ధము క్రీ.శ. ౧౭౧౬వ సంవత్సరము జూన్ నెల ౨౭ వ తేదీనాఁడు జరిగినది. అటుపిమ్మట ౧౭ సంవత్సరములు రఘునాథ రాయలు రాజుగా నున్నాఁడు.

ఈకాలములో రామభద్రరాయలు స్వాభావికమరణము నొందెనని యేలతలంపరాదు? రఘునాథునికాలములో నత్యంత ప్రాముఖ్యమును వహించిన తోపూరు యుద్ధమున కాతని కుమారుఁ డొక్కడుమాత్రమే వెళ్లియున్నట్లు కనబడుచున్నది. అందుచే నాతని రెండవకుమారుఁ డంతకు పూర్వమే స్వాభావికమరణము నందియుండెననిగాని, పోర్చుగీసువారితో రఘునాథరాయలొనర్చిన మహాయుద్ధములోఁ జనిపోయియుండె నని తలంచుట కవకాశ మున్నది. ౧౬౩౩వ సంవత్సరములో, విజయరాఘవభూపాలుఁడు తండ్రిని పదభ్రష్టునిచేసి యగ్రజుని చెఱయందుంచి ఔరంగజీబు వలె సింహాసనమెక్కెనని యేల తలంపవలయును? అట్లు తలంచుట కాధారములేమియున్నవి?

మిషనరీలు వ్రాసిన యుత్తరములో నీక్రిందొకయసంబద్ధవిషయ మున్నది. "ఈయనకుఁ దగునాత రాజ్యమునకు రాకుండుటకై గ్రుడ్లు పీకించెనని యందున్నది."

"In the confusion of this pillage, the prisons were thrown open and a multitude of state prisoners were set free, the sole crime of most of whom being their fortune or social position Among the latter were two brothers of the Nayaka, whom he had shut up in these prisions, after pulling out their eyes to remove all their desires on their side of succeeding him (The nayak.)

La mission Dn. Madura III pages 53—54.

గ్రుడ్డిపీకింపఁబడినవాఁడు రామభద్రరాయలైనచో, నాతఁడు విజయరాఘవునకు ముందు రాజ్యమునకు రాదగినవాఁడు కాని తరువాతరాదగినవాఁడు కాఁడు. రామభద్రరాయలకు సంతానమున్నట్లాధారమేదియులేదు. విజయరాఘవునకుఁ దరువాత రాజ్యమునకు రావలసినవాఁ డాతనికుమారుఁడు. ఆతఁడే మన్నారుదేవుఁడు. ఆతని కన్నులు పీకింపఁబడలేదు. ఆతఁడు తండ్రితోఁగూడ ౧౬౭౩వ సంవత్సరములో మధుర చొక్కనాథునితోఁ జరిగిన యుద్ధములో పాల్గొని వీరస్వర్గమందియున్నాఁడు. కావున నీయుత్తరము సందర్భరహితముగా నున్నదనియు, నిజమునుదెలుపుటలేదనియు నిశ్చయించి పరిత్యజింపవలసియున్నది. ఈయుత్తరమునుబట్టి విజయరాఘవునిపై నంతటి ఘోరనేరస్థాపనమొనర్చుట కవకాశములేదు. విజయరాఘవ భూపాలుఁడు తన తండ్రియైన రఘునాథనాయకుని జెఱయందుంచెనని కాని, మఱియొకరీతిగా నాతనిని నిర్బంధమున నుంచెననిగాని యెవ్వరును జెప్పుటలేదు. ఆతనిని రాజ్యభ్రష్టునిజేసి ౧౬౩౩ వ సంవత్సరమున సింహాసన మెక్కెననియే చెప్పుచున్నారు. ఆసమయముననే రామభద్రరాయలు గ్రుడ్డి పీకించి యుండవలయును. రఘునాథనాయకుఁడు జీవించియుండఁగా నట్టిపనిజరుగునా? రఘునాథుఁడాకార్యమును జూచుచునూరకుండి యుండునా? రఘునాథునివంటి శూరునియొక్క ప్రతిష్ఠాపరునియొక్క పలుకుబడియంతయు నంతలోనే యంతరించిపోయెనా? ఈవిషయములనన్నిటి నాలోచించిచూడఁగా విజయరాఘవుడట్టి నీచకార్యమును గావింపలేదనియే నిశ్చయింపవలసియున్నది.

ఇఁక నీయనపై మోపఁబడిన మూఁడవనేరము కుమారుని కారాగారమునందుంచుట — దీనికి సరియైన కారణము తెలియుట లేదు. ఇందునుగూర్చి తంజాపురాంధ్రనాయక రాజచరిత్రమునందిట్లు వ్రాయఁబడియున్నవి. "ఈయనకు మన్నారుదేవుఁ డనునేక

పుత్రుఁ డుండెను. ఆయన బహుసత్ప్రవర్తనుఁ డని తరువాత కను గొనగలము. ఏదో కారణాంతరమున కుమారు నీయనకారాగార బద్ధునిగావించెను.

విజయరాఘవభూపాలుఁడు తన యేకపుత్రు నేకారణమున కారాగారబద్ధునిగాఁ జేసెనో తెలియరాలేదు. అందెంతవఱకు సత్య మున్నదియు నిర్ధారణచేయుటకుదగిన యాధారములులేవు. కావున నావిషయమున నేమియుఁ జెప్పజాలము.

ఈతఁడు రాజ్యరక్షణ మందసమర్థుఁడై సర్వదా భోగలాల సుఁడై సంచరించెననెడి నేరములుయందు సత్యమున్నదని చరిత్రయే చెప్పుచున్నది. ఈతనికాలముననే రాజ్యము నాయకప్రభుత్వము నుండి తొలగిపోయినది. భోగలాలసుఁ డని యీతని గ్రంథమును కృతిపొందిన గ్రంథములును సాక్ష్యమిచ్చుచున్నవి. ఆవిషయమున నీతని సమర్థింపలేము.

---

## 289. పసుపులేటి రంగాజమ్మ



ఈ కవయిత్రి మన్నారుదాసవిలాసము, భారతభాగవత రామాయణ సంగ్రహములు, ఉషాపరిణయము, మన్నారుదాసవిలాస నాటకము ననుగ్రంథములను రచియించి తంజావూరు నాయకప్రభు వగు విజయరాఘవభూపాలున కంకితముచేసెను. ఈభూపాలుఁడు గూడ కవియే. ఈతని చారిత్రము నీగ్రంథమున మఱియొకచోట వ్రాసియున్నాఁడను. ఈమె రచించిన గ్రంథములలో మన్నారు దాసవిలాస ఉషాపరిణయములు ప్రబంధములు మన్నారుదాసవిలాస నాటకముయక్షగానము. భారతభాగవతరామాయణ సంగ్రహములు, పద్యకావ్యములని తోఁచుచున్నది.

ఈమె పసుపులేటి వెంకటాద్రి, మంగమాంబల కుమార్తె. ఈమె విజయరాఘవభూపాలుని భార్యననియే మన్నారుదాసవిలాస నాటకమందలి యీక్రింది ప్రస్తావనలోను, భరతవాక్యములోను జెప్పుకొనియున్నది కాని నిజముగా నాతని భార్యకాదు. విజయరాఘవుని యుంపుడుకత్తెయైయున్నది.

"వా. అని తనవిశిష్టాభీష్టదేవతలను సేవించి, పరతత్త్వనిరతులైన పరమభాగవతుల సంభావించి, సత్కవుల నభినందించి, దుష్టవులవినిదించి, యుషాపరిణయ మన్నారుదాసవిలాస ప్రముఖప్రబంధనిబంధనచాతుర్యధుర్యయై పెచ్చుగా నచ్యుతవిజయరాఘవ సార్వభౌమ ధర్మపత్నియై రంగుమీఱురంగాజమ్మ శృంగారకరుణహాస్య శాంతాదిరసంబులు పొదల మృదులమధురోచితవచనరచనల నందంబుగా సందర్భింప వన్నెమీరు మన్నారుదాసనామనాటకరాజంబునకుఁ గథాసంవిధానం బెటువలెను."

భరతవాక్యము :—

"అని యివ్విధంబున రాజగోపాలకరుణాకటాక్షవీక్షణానుక్షణ ప్రవర్ధమాన సారసారస్వతధురీణయు, విచిత్రతరపత్రికాశతలిఖిత వాచికార్థానగాహనప్రవీణయు, తత్ర్పతిప్రతికాశతస్వహస్తలేఖనప్రశస్తకీర్తియు శృంగారరసతరంగితపదకవిత్వమహనీయమతి స్ఫూర్తియు, నతులితాష్ట భాషాకవితా సర్వంకషమనీషా విశేష శారదయు రాజనీతి విద్యావిశారదయును, విజయరాఘవమహీపాల విరచిత కనకాభిషేకయు, విద్వత్కవి జనస్తవనీయయు, మన్నారుదాసవిలాసోషాపరిణయ మహాప్రబంధనిబంధనకృతలక్షణయు, మహనీయరామాయణభాగవతభారతకథాసంగ్రహణ విచక్షణయు, పసుపులేటి వేంకటాద్రిబహుజన్మతపః ఫలంబును, మంగమాంబాగర్భశుక్తి ముక్తాఫలంబును రంగద్గుణకదంబయు, నగురంగాజమ్మ రచించిన మన్నారుదాసవిలాసంబను మహానాటకరాజంబునకుఁ గథానాయకుండును దన ప్రాణనాయకుండునైన యచ్యుత విజయరాఘవనాయకు హేమాబ్జ

నాయికా రాజగోపాల......... సమృద్ధియు నైశ్వర్యాభివృద్ధియు సర్వశాత్రవ నివృత్తియు సకలసామ్రాజ్యప్రాప్తియుఁ గలుగలాలించి పాలింపు"

ఈ కవయిత్రి రచించిన గ్రంథములలో మన్నారుదాసవిలాస నాటకము మాత్రము ముద్రితమై ప్రచారములోనున్నది. ఉషాపరిణయము తంజావూరునందలి లిఖితపుస్తకభాండాగారములోనున్నది. తక్కిన గ్రంథములు గానవచ్చుటలేదు. పై భరతవాక్యమునఁ జెప్పఁబడినపత్రికాప్రతిపత్రికాశతములు నాయికానాయకులన్యోన్యము వ్రాసికొనిన యుత్తరములైయుండనోపు. ఇవి బహుశః విజయరాఘవ రంగాజమ్మల నడుమనడచిన శృంగారలేఖలయినఁ గావచ్చును. ఈమె రచించిన శృంగారపదములును గానవచ్చుటలేదు. ఈమె రచించిన రామాయణ భారతభాగవత సంగ్రహములును నామమాత్రావశేషములయినవి.

ఈమెవిజయరాఘవుని యుంపుడుకత్తెయైనను, తనరూపవిలాస విభ్రమాదులచేతను, పాండిత్యకవిత్వ మహిమాతిశయములచేతను, కాముకుఁడును, అత్యంతవిలాసపురుషుఁడు నగుప్రభువును వైవసము చేసికొని సూర్యజహానువలె సర్వాధికారిణియై ప్రవర్తించినదనియందురు. పై భరతవాక్యములోని "రాజనీతివిశారదయు"నను వాక్య మీయంశమును ధ్రువపఱుచుచున్నది.

ఒకనాఁడు విజయరాఘవునిపట్టమహిషి, (ఈమెనామము రాజగోపాలకాంబికయని, ఈమెకుమారుఁడైన మన్నారుదేవుఁడు రచించిన హేమాబ్జనాయికా స్వయంవరనాటకమునఁ బేర్కొని యున్నాఁడు.) యుద్యానవనమునుండి యంతఃపురమునకుఁ బోవుచు మార్గమధ్యమున రంగాజమ్మను జూచి "మా య ల మా రి" యని నిందించెనఁట. అందులకుఁ బ్రత్యుత్తరముగా రంగాజమ్మ యీ క్రింది పద్యమునువ్రాసి పట్టమహిషికిఁ బంపెనఁట.

ఉ. ఏవనితల్ మముందలఁప నేమిపనో? తమరాడువారు గా
రో! వలపించు నేర్పెఱుఁగరో? తమకౌఁగిలిలోన నుండఁగా
రావదియేమిరా! విజయరాఘవ! యంచును బల్మిఁబట్టినే
తీవరకత్తెనై పెనఁగి తీసుకవచ్చితినా తలోదరీ!

తంజావూరునాయకప్రభువులును, మహారాష్ట్రప్రభువులును గూడ పదునేడవ పదునెనిమిదవ శతాబ్దులలో, మన్నారుదాసవిలాస నాటకమువంటి యక్షగానములను దాము రచించియుఁ దమ యాస్థాన కవులచేతనుగవయిత్రులచేతను రచియింపఁ జేయుటయునేకాక, యిట్టి నాటక ప్రదర్శనమునకుఁ జాలపోత్సాహ మొసంగెడివారు. అంతః పురములయందిట్టి నాటకములను బ్రదర్శింపఁజేయుచుఁ గొన్ని వేళలఁ దామందు నాయకపాత్రములఁ గైకొని నటించుచుండెడివారఁట! విజయరాఘవభూపతియుఁ గృతికర్త్రియైన రంగాజమ్మయు నాయక నాయికాపాత్రముల ధరించి రాజభవనాంతరములలో నాటకములను బ్రదర్శించుచుండిరని లోకమునఁ బ్రతీతికలదు.

కృతిపతియైన విజయరాఘవునకు మన్నారుదాసనునామాంత రముకలదు. తంజావూరునందలి మన్నారు కోవెలలోని స్వామికి రాజగోపాలస్వామియనియు మన్నారు స్వామియనియుఁ బేళ్లు. ఆ స్వామియనుగ్రహమున జన్మించినవాఁడగుటచే విజయరాఘవున కీ పేరుగల్గినది. మన్నారుదాసవిలాస నాటకమునందలి కథానాయ కుఁడు విజయరాఘవుఁడే. ఈవిజయరాఘవునకును గళావతికిని జరిగిన వివాహకథయే నాటకముగా రంగాజమ్మ వ్రాసియున్నది.

శ్రీ మహావిష్ణువు కృష్ణావతారమున, సూర్యతనయయగుఁ గాళిందిని బరిణయమాడిన పిదప, చంద్రుఁడు తనకుమార్తెనుగూడ వివాహమాడి రెండునేత్రములను సరిగాఁ జూడుమని శ్రీకృష్ణుని ప్రార్థించినట్లును, "నీకుమార్తె మాకిప్పుడు మేనగోడలయినది కావున, రఘునాథభూలునకు మేము విజయరాఘవనామముతో జన్మింతుము.

నీవు రాజచంద్రుఁడవై జన్మింపుము. నీకుమార్తె నప్పుడు వివాహ మాడెద"మని శ్రీకృష్ణు డానతిచ్చినట్లిం దుత్ప్రేక్షింపఁ బడినది. ఈ నాటకము "ప్రహ్లాదనాటకము, గరుడవిలాసము" మొదలగు వీధి నాటకములను బోలినది.

ఈ రంగాజమ్మ కవిత్వము సరసమై మనోహరముగానుండును. విజయరాఘవభూపాలుఁడు, ఉషాపరిణయమును రచియింపుమని యీమెను బ్రోత్సహించినపద్యమిది :—

సీ. వేంకటేంద్రునిపుత్రి వినుతసద్గుణధాత్రి
ఘనయశోరాశిరంగాజి వినుము
మాధుర్యమునమించు మన్నారుదాసవి
లాస ప్రబంధంబులలితఫణితి
గావించి మిగులశృంగారంబుగన్పట్టఁ
బదములు మృదురసాస్పదములగుచు
రాణింపరచియించి రామాయణంబును
భాగవతంబును భారతంబు

తే. సంగ్రహమ్ముగ్గనరచియించి సరసరీతి
మమ్ము మెప్పించితివి చాల నెమ్మిఁ దనరఁ
బరఁగహరివంశమున నుషాపరిణయకథ
తెనుఁగుగావింపు మిఁక నీవు తేఁటగాఁగ.

తంజావూరురాజ్యమును విజయభూపాలుఁడు క్రీ. శ. ౧౬౩౩ మొదలు ౧౬౭౮ వఱకును బరిపాలించినవాఁడు కావున నీమెయు నా కాలమున తంజావూరు నందుండి యున్నట్లు నిశ్చయముగాఁ జెప్ప వచ్చును. మన్నారుదాసనాటకమునందుఁ జాలభాగము దరువులు, ద్విపదలు, వచనములునైయున్నవి. అందందు పద్యములు శ్లోకములు కలవు. వీథినాటకములయందువలెనే యిందును హాస్యరసముఁజూపఁ

బడినది. ఈనాటకమునుండి రెండు పద్యముల నుదాహరించు చున్నాఁడను.

మ. రతిదేవిన్మకరాంకునిన్సుమ ధనుర్బాణంబు లన్మందమా
రుతమున్శీతకరున్వసంతుశుకము న్గోలంబకాదంబ సం
తతులంగోకిలశారికాప్రతతులం దత్తద్విలాసంబులన్
జతగూడన్ లిఖయించినిల్పియచటం జాతుర్యమొప్పారఁగన్.

సీ. వక్షస్థ్సలంబున వన్నెకెక్కినమచ్చ
లాలితంబగు వనమాలికయును
సరిలేనికరముల శంఖచక్రంబులు
నవరత్నమయమైన నవ్యనేత్రి
మనుపమంబైమించు కనకాంబరంబును
రమణమైమీఱు వజ్రములవంకి
ముంజేతులనుమించు ముత్తెలకడియముల్
చరణపద్మమునందు బిరుదుపెండె
మమతెనిద్దటియందును నందముగ నె
యెంతభేదించినను భేదమెఱుఁగరాదు
కావునను రాజగోపాలదేవుఁ డిపుడు
దనరరూపద్వయంబును దాల్చెనేమొ.

ఈమె రచించిన యుషాపరిణయము నాల్గాశ్వాసముల ప్రబంధము. ఇది విజయరాఘవభూపాలున కంకితమీయఁబడినది. శైలికై నాలుగు పద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను. ఇది ముద్రితము కాలేదు. ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమున నొకవ్రాఁత ప్రతికలదు.

చ. కలగని మేలుకాంచి తనకంఠమునంటిన గోటిజీరలుం
బలుచని మోవిపై మిగులబాగుగనుంచిన యట్టికెంపులున్

గులుకు మెఱుంగు గుబ్బవలిగుబ్బలనుంచిన గంధసారముల్
బలుమరుఁ జూచి చోద్యపడి భావములోనఁ గలంకఁ జెందఁగన్. ౧ఆ

ఉ. పున్నమనాఁటి చందురునిబోలిననాథుని నెమ్మొగంబు హా
ర్షోన్నతిఁ జూచికాని సరసోక్తులు బల్కుచు వానికౌఁగిటన్
జెన్నువహించికాని బహుచిత్రగతిం గుసుమాస్త్రకేళికిన్
మన్ననగాంచికాని యిఁకమానిని ప్రాణము నిల్పనేర్తునే. ౨ఆ

ఉ. నిద్దురలేచియున్నిగులనేర్పున రమ్మని వీఁడుదానవున్
గొద్దికచేరదీయకయె యూరకయుండుటకేమి హేతువో
తద్దయుద్వారకాపురము తామరసాక్షులఁ జూచువీనికా
నిద్దఁపురూపులున్నిగుల నేర్పులు లేవె తెఱంగొనాయెడన్. ౩ఆ

చ. అనవుఁడు రేవతీరమణుఁ డాయదునందనుతోడ దైత్యభం
జన! యటులైనశోణపురిచాయకె వచ్చితివారి యిప్పుడీ
యనలముశాంతిఁ జెందఁగ నుపాయము నొక్కటిచూడుమన్న తా
ర్క్ష్యనకు మురారియెంతయును సొంపుజనింపఁగఁ బల్కెనీక్రియన్. ౪ఆ

---

## 290. కామరుసు వెంకటపతిసోమయాజి



ఇతఁడు విజయరాఘవచంద్రికావిహార మను నొకయక్షగానమును రచియించెను. ఇందలి నాయకుఁడు క్రీ.శ. ౧౬౩౩ మొదలు ౧౬౭౩వ సంవత్సరము వఱకును తంజావూరు రాజ్యమును బరిపాలించిన నాయకప్రభువగు విజయరాఘవభూపతి ఇతని తండ్రి రఘునాథనాయకుఁడు. వీరిరువురును గూడఁ గవులు. వీరి చారిత్రములను వేఱువేఱుగా నీగ్రంథమున రచియించియున్నాఁడు.

కోయదొరలనియు, మన్నెదొరలనియు, పిలువబడు నటవీ నాయకులు, తమతమ పల్లెలలోనుండి, వీధినాటకము లాడెడి నాట్య కత్తెలను దెచ్చి రాజులకు సమర్పించుచుండెడివారు. ఆ ప్రభువులు వారి విద్యలను జూచి మెచ్చి వారి నాదరించుచు, వారు ప్రదర్శిం చెడినాట్యములను నాటకములనుజూచి యానందించుచుండెడివారు. మొట్టమొదట వీదినాట్యములు నాటకములు ననాగరికముగనున్నను, గ్రమక్రమముగ నాగరికులచే నివి సంస్కరింపఁ బడినవి. పండితు లైన కవులు యక్షగానములను పేర ప్రదర్శనయోగ్యము లగునాటక ములను వ్రాయుచువచ్చిరి. ఈనాటకములును నాటకప్రదర్శనములును తంజావూరు మధుర ప్రాంతములలో పదునాఱవ, పదునేడవ, పదు నెనిమిదవ శతాబ్దులలో నత్యుచ్ఛదశ యందుండెడివి.

సోమయాజికవిరచియించిన యీయక్షగానమునందీవిషయమీ దిగువవాక్యములలోఁ జెప్పఁబడినది.

"మనవుల కై గడినన్నె రాజులు కొనివచ్చియిచ్చిన కొమ్మలచే దినదినము విద్యలువిని మెచ్చివారికి చనవులు బాలించుసరసునకు తుండేరదేశంపుదొరకూతురు పాండినిపట్టి యైనపద్మలోచన కొండొక ప్రాయంపుఁ బెండ్లికూఁతురై సేవసేయ నిండువేడుకనుండు నెర జాణకు."

ఒక్కొకప్పుఁడీ ప్రభువులుకూడ వేషములు ధరించి తమ యంతఃపురములలో నాటకము లాడుచుండెడివారని యీ క్రింద వ్రాసిన వాక్యములవలనఁ గన్పట్టుచున్నది.

"వ. ఆసమయంబున లీలావతీ విజయరాఘవులు మంగళంబు పాడుచు నటించిరట యెటువలెను."

ఈ క్రింది భరతవాక్యమువలన కవిపేరు మాత్రమే తెలియు చున్నది.

"ఇవ్విధంబున విజయరాఘవ పట్టభద్రుని పట్టంపుకవియైన కామరసు వేంకటపతిసోమయాజి హవణించినవిజయరాఘవచంద్రికా విలాస నాటకచాటుకావ్యంబునకు కథానాయకుండైన విజయరాఘవస్వామికి, నతని యిష్టదేవతయైన రాజగోపాలస్వామి, యాచంద్రార్కంబుగా విశ్వవిశ్వంభరాధిపత్యనిత్యాయురారోగ్యంబులు పాలించిరక్షించుగాత."

ఈకవి నివాసము తంజావూరనియే యూహింపవలసియున్నది. ఈతఁడు బ్రాహ్మణుఁ డనుట నిశ్చయము. కాని యీతని గోత్రసూత్రాదు లేమియుఁ దెలియలేదు. క్రీ.శ. ౧౬౩౩–౧౬౭౩మధ్య విజయరాఘవుఁ డున్నందున నీకవికాలముకూడ నదియే యగుట స్పష్టము.

ఈగ్రంథమునకొక తాళపత్రప్రతి తంజావూరు పుస్తకభాండాగారమునఁ గలదు. ఇది ముద్రితముకాలేదు.

ఈగ్రంథాదివచనమిట్లుకలదు. దీనివలన కృతిపతివర్ణనమును గ్రంథవివరణమును, కవి నామాదికమును దెలియును.

"శ్రీరాజగోపాల కరుణాకటాక్షవీక్షాలబ్ధవిగ్వవిశ్వంభరాశాశ్వతైశ్వర్యధుర్య నేపాళభూపాలస్థాపనాచార్య * * చినచెవ్వనృపాలాన్వయ కలశజలనిధిసంపూర్ణపూర్ణిమాసుధాకరపాండ్యతుండీరాదిసమద విరోధియోధయూధభీకర సరసకలావిలాస నిస్తంద్రసత్యభామాహరిశ్చంద్రకళావత్యంబికా గర్భశుక్తికామరూక్తికాకార * * భువనైకవీరాధివీర రఘునాథభూపాలకుమార రత్నాకరగభీర రత్నసానుధీర రమణీరమణీయాకార విమలకల్యాణగుణశీల విద్వజ్జన విలోలవిదళిత రిపుజాలవిజయరాఘవభూపాలపరాకు * * బహువిధప్రబంధనిబంధలీలాధురంధరుండవైన నీకుప్రబంధంబొసంగి మెప్పించెదనని యెంచినవాండ్ల గాన నీకువిన్నపించియున్నరలోకపాకశాసనకృపాపరిపాకసామరస్యంబు వడసిన కామరుసు వెంకటపతిసోమయాజి విజయరాఘవ చంద్రుని

చంద్రికావిహారశృంగార లీలావిలాసంబు వక్కాణించు విజయరాఘవచంద్రికావిహారంబను పేరు హావణించి కవి జిహ్వారంగశృంగాటకంబులధాటిసల్పు భారతిఘోటకంబుగా శృంగారరసవర్షావిర్భావంబునకు గర్భోటకంబుగా నొకనాటకంబు నిర్వహింపఁబూని తనయిష్టదేవతయైన రాఘవస్వామియే విజయరాఘవస్వామి కనుక యితనిం బ్రార్థించి నాందీశుభాచారంబాచరించెనట యెటువలెను.''

---

## 291. కోనేటి దీక్షితచంద్రుఁడు



ఇతఁడు శ్రీవైష్ణవుఁడు; రామానుజాచార్యపుత్త్రుఁడు; విజయరాఘవభూపాలుని యాస్థానమునం దున్నవాఁడు.

ఈకవి విజయరాఘవకల్యాణ మనునొక యక్షగానమును రచియించెను. ఇందు విజయరాఘవనాయకమదనమంజరుల వివాహగాథ వర్ణితమైనది. క్రీ.శ. ౧౬౩౩ మొదలు ౧౬౭౩వఱకును తంజావూరు రాజ్యమును బరిపాలించిన నాయకప్రభువగు విజయరాఘవభూపతియే యిందలి నాయకుఁడు.

ఈకవి శతక్రతు శ్రీనివాసదేశిక శిష్యుఁడును, నాతనిచే నుపాధ్యాయవృత్తియందుఁ బ్రతిష్ఠింపఁ బడినవాఁడును, విజయరాఘవభూపాలునిచే నగ్రహారాదికమును బహుమానముగా నందినవాఁడునైన ట్లీక్రిందినాటకమందలి యీక్రింది భరతవాక్యము వలనఁ దెలియుచున్నది.

''అని యివ్విధంబున శ్రీమద్రామాయణోపదేశసంతుష్టాంతరంగ విజయరాఘవభూపాలకృపాపాంగ వీక్షణానుక్షణప్రాప్తసారాగ్రహారతారహారచిరత్నరత్న కంకణోదారతారానురూప ముక్తా

కలాప హృద్యతరబిరుదవాద్య నానావాహనాది సన్మానమానసీయ శాశ్వతైశ్వర్య ధుర్యుండును, బహుశార రచిత యాగభాగ సంతర్పితాఖిల దేవతావర్యుండును. సంగీతసాహిత్య విద్యాధురీణ వరేణ్యుండును, రామానుజాచార్య తనయాగ్రగణ్యుండును, భారత భాగవతాది శిక్షా వైచక్షణ్యావిజిత విబుధాచార్యుండును, గురురాజ శతక్రతు శ్రీనివాస దేశిక ప్రతిష్ఠాపితోపాధ్యాయ వైభవధుర్యుండును, ప్రతిపక్షశిక్షణ విచక్షణుండును, సకలసద్గుణ సాంద్రుండును, నగుకోనేటి దీక్షిత చంద్రుడు, కందళదగ్రసగర్భ సందర్భంబుల హావణించిన విజయరాఘవకల్యాణంబను మహానాటకంబునకు కథానాయకుండును నిజనాయకుండునైన యచ్యుత విజయరాఘవ నాయకునకు హేమాబ్జనాయికా రాజగోపాలులు, ఆయురారోగ్య సమృద్ధియు, నైశ్వర్యాభివృద్ధియు సర్వశాత్రవనివృత్తియు సకల సామ్రాజ్యప్రాప్తియునుంగలుగఁ బాలించి లాలింపుదురుగాత! అను ఆశీర్వాదము వేద తుల్యముగా వెలయుఁగావుత.

ఈకవి పాండిత్య మీభరతవాక్యమువలనఁ దెలియుచున్నది. ఇట్టిపండితులు కేవలయక్షగాన మాత్రకవులగుటకుఁ గారణమురాజాదరణ మాయక్షగానముల యందుండుటవల్లనసేయై యుండనోపును. కాదేని సరసపద్య ప్రబంధ కవితాసామర్థ్యము వారికడఁ గొఱవడి యుండవచ్చును సంస్కృతమున గొప్పపండితులయినంత మాత్రమున వారందఱు సరసకవితాధురీణులై యుందురనవలనుపడదు.

ఈభరతవాక్యమువలన విజయరాఘవుని వైష్ణవభక్తియు శృంగారరసాసక్తియు వెల్లడియగుచున్నది. ఈకవి పైజెప్పినకాలమునఁ దంజావూరునందే యుండియుండుననుటకు సంశయములేదు.

ఈకవి రచించిన విజయరాఘవ కల్యాణముముద్రితము— తంజావూరుపుస్తక భాండాగారమున వ్రాత ప్రతియొకటి యున్నది.

——

## 292. పురుషోత్తమదీక్షితుఁడు

ఈతని వృత్తాంతమేమియుఁ దెలియదు. ఇతఁడు తంజావూరు నాయకభూపాలుఁ డగు విజయరాఘవుని కాలమువాఁడు. విజయ రాఘవుఁడు క్రీ.శ. ౧౬౩౩ మొదలు ౧౬౭౩ వఱకును రాజ్యముచేసి నవాఁడు. కావున నీకవియు నాకాలమువాఁడు. ఈభూపాలుఁడు తంజాపురమున సత్రముంచి నిరంతరమును బ్రాహ్మణుల కన్నదానము సేయుచుండువాఁడు. ఈకవి యాకార్యము నభినందించుచు, "తంజా పురాన్నదానమహానాటకము"ను రచించియుండెను.

ఈక్రిందనుదాహరించిన వాక్యమువలన నాటకమందలి విష యము తెలియును.

కైవారం:— శ్రీరాజగోపాల కరుణాకటాక్షవీక్షాలబ్ధశాశ్వ తైశ్వర్య, ఘోరాహవపరాభూత వీరవర్య, పాండ్యతుండీరమండలా ఖండలఖండ నోద్దండదోర్దండ, చండతరప్రతాపమార్తాండ, వీరాధి వీర, వితరణకర్ణావతార, విజయరాఘవధీర, పరాకుస్వామి పరాకు.

నాంది:— విలాసినీజన మోహనరూపధేయుండవై వెలయు నీవును అనవరతశతలక్షవిప్రాభీష్ట మృష్టాన్న ప్రదాతలు గావున, సకలజనశ్లాఘాపాత్రంబగు నీదుమహాసత్రంబున భుజియింప వేంచేసిన ... ... తదీయారాధనంబు నతిహర్షంబున పురుషోత్తమ దీక్షి తుండు విశిష్టదేశికాభీష్ట దేవతారూపుండైన శ్రీనివాసస్వామిని నిజ మానస నివాసునింజేసి, శృంగార హాస్యాద్భుత రసప్రధానంబుగా హావణించిన తంజాపురాన్నదాననామక మహానాటకంబునకు కథా సంవిధానంబెటువలెను.

ఈకవి శఠకోపు శ్రీనివాసతాతాచార్యుల శిష్యుఁడయినట్లు పైవాక్యములలో సూచింపఁ బడియున్నది. ఇతఁడు తంజాపుర నివా సుఁడో తత్ప్రాంతమువాఁడో యయియుండును. ఇంతకంటె నీతనిని గూర్చి యేమియుఁ దెలియలేదు..

## 293. చెంగల్వ కాళయకవి



ఇతఁడు పాకనాటార్వేల నియోగి బ్రాహ్మణుఁడు; శ్రీవత్స గోత్రుఁడు; వెంకటయ్యకృష్ణమాంబలకుఁ బుత్త్రుఁడు; శ్రీకంఠ మంత్రికిఁ బౌత్త్రుఁడు; కాళయమంత్రి గంగమాంబలకుఁ బ్రపౌత్త్రుఁడు; రావినూతల తిరుమలయ్యకు దౌహిత్రుఁడు.

ఈకవి రాజగోపాలవిలాస మనునైదాశ్వాసముల పద్యకావ్యము రచియించి తంజావూరు మండలమందలి మన్నారుగుడియందున్న రాజగోపాలస్వామి కంకిత మొనర్చెను. ఈకావ్యమున దక్షిణ ద్వారకాస్థలమాహాత్మ్యము వర్ణితమైనది. మన్నారుగుడికి దక్షిణ ద్వారకయని నామాంతరము కలదు. ఈతఁడు తన వృత్తాంతము నీక్రింది పద్యములోఁ జెప్పుకొని యున్నాఁడు.

సీ. శ్రీవత్సగోత్రుండు శ్రీకరపాకనా
టార్వేల బంధుజనాతిశాయి
కాళయమంత్రి పుంగవునకు గంగమాం
బకు నుదయించు తపఃఫలంబు
రణరంగగంధవారణ బిరుదాంకిత
స్వకులజశ్రీకంఠ సచివమౌళి
పార్వతీపరిణయప్రముఖ ప్రబంధని
బంధ ధురంధరప్రౌఢఫణితి.

తే. యైన చెంగల్వవేంకటయ్యయును రావి
నూతల తిరుమలయ్యతనూజ కృష్ణ
మాంబయును గన్నవిధి గాళహస్తిగిరిశ
కలిత నిపుణోక్తి భారవి కాళసుకవి.

ఈకవి తంజావూరు ప్రభువగు విజయరాఘవనృపాలునిచే రాజచిహ్నములను బడసిన ట్లీక్రింది గద్యలో నుడివియున్నాఁడు.

"గద్య:—ఇది శ్రీమత్కాళహస్తీశ్వరకరుణాకటాక్ష లబ్ధసిద్ధ సారస్వతనయ చెంగల్వ వెంకటయ్యతనయ, విజయరాఘవ భూప ప్రసాదాసాదిత వివిధరాజ చిహ్నచిహ్నిత భాగధేయ కాళయనామ ధేయ ప్రణీతంబైన రాజగోపాల విలాసంబను మహాప్రబంధంబు"

గ్రంథాదిని విజయరాఘవ భూపాలునివంశమునుగూడ వర్ణించి యున్నాఁడు. ఈవర్ణనసందర్భమున వ్రాసినపద్యములవలన విజయ రాఘవున కొకయగ్రజుఁడున్నట్లును, విజయరాఘవుఁడు దానశీలుడై నట్లును దెలియుచున్నది. ఆపద్యములలోఁ గొన్నిటినిటనుదాహరించు చున్నాడఁను. దీనినిబట్టి రఘునాథభూపాలున కొక్కఁడేకుమారుఁ డని యుషాకల్యాణమున రంగాజమ్మ వ్రాసినమాటలు సత్యములు కావని స్పష్టమగుచున్నది.

క. ఆయచ్యుత భూభుజునకు
నాయతశుభకీర్తి మూర్తిమాంబకు జితరా
ధేయుఁడు రఘునాథధరా
నాయకుఁ డుదయించె నృపతి నాయకమణియై

తే. అట్టిమహిమలఁ గునికిపట్టియినయట్టి
ఘనున కచ్యుత రఘునాథ మనుజపతికి
గరిమ మీఱఁ గళావతీకమలనయన
రాణఁ గనుపట్టె పట్టంపురాణి యగుచు.

చ. లలిత పతివ్రతావ్రత కళానతియైన కళావతీసతీ
కులమణియున్ మహీరమణకుంజరుఁడౌ రఘునాథమేదినీ
తలబలవైరియుం గని రుదారుని యచ్యుతరామభద్రు దో
ర్బల జయభద్రుఁ డౌ విజయరాఘవశౌరిని భాగ్యవైఖరిన్

క. వారలలో నగ్రగణ్యుఁ డని
ధారాధారా ధరాంబు ధారలచేతన్
వారించు వైరిభూవర
వారిజదుర్వార గర్వవారము నెపుడున్.

మ. నిలువెల్లన్ గరుణారసంబు పలుకుల్ నీతిప్రచారోన్నతుల్
తలఁపుల్ ధర్మపుపుట్టినిండ్లు నడకల్ దాక్షిణ్యసంకేతముల్
కలరే యచ్యుతరామభద్ర ధరణీకందర్పునిం బోలఁగా
నిలలో భూతభవిష్య దద్యతనభూమీశు ల్విచారించినన్

సీ. శాలివాహన శకసంవత్సరములు వే
నేనూట నేఁబదియేను వరుస
చనఁగ శ్రీముఖనామసంవత్సరంబున
శ్రావణశుద్ధపక్షమున ద్వాద
శిని సౌమ్యవాసరంబున దక్షిణద్వార
కను గృష్ణతీర్థమందు నియమమున
స్నానంబు గావించి సంకల్పపూర్వము
గాను షోడశమహాదానములను

తే. ఘనతమీఱఁ గళావతీగర్భశుక్తి
మౌక్తికఫలంబు రఘునాథ మహీపసుతుఁడు
విజయరాఘవ మేదినీవిభుఁ డొసంగె
వేదవేదాంతవిదులైన విప్రులకును.

శాలివాహనశకము ౧౫౫౫ అనగా హూణశకము ౧౬౩౩ సంవత్సరమున విజయరాఘవభూపాలుఁడు షోడశమహాదానములను గావించినాఁ డని చెప్పుటచేఁ దదాస్థానకవి యగు కాళయకవి యాకాలముననుండుటయు నించుమించుగ నాకాలములనే యేతద్గ్రంథ రచనము జరుగుటయు స్పష్టము. ఈ గ్రంథముయొక్క యముద్రిత

ప్రతి తంజావూరు పుస్తకభాండాగారమున నున్నది. అది నాకులభింపకపోవుటచే నందలి పద్యముల నుదాహరింపలేకపోయితిని.

ఈకవి కాళహస్తీశ్వర కరుణాకటాక్షలబ్ధ సారస్వతుఁడ నని చెప్పుకొనుటచే నీతఁడు కాళహస్తియందో తత్ప్రాంతములలోనో నివాసమును గలిగియుండి రాజాశ్రయ మపేక్షించి తంజావూరున కేఁగి యట నివాస మేర్పరచుకొనియుండును. ఈతనికవిత్వము ప్రౌఢమై నిర్దుష్టమై మనోహర మగు శైలిని గలిగియున్న ట్లుదాహృత పద్యములనుబట్టి తోఁచుచున్నది.

---

## 294. కాండ్రవేటి రామానుజాచార్యులు



ఈతని నివాసము నిజామురాష్ట్రమందలి కాంద్రవేడను గ్రామము. ఇతఁడు శృంగారకవిరాయ బిరుదాంకితుఁడు. ఆంధ్రమున తిరువాయిమొడి యను ద్విపదకావ్యమును రచియించెను. ఈకవి క్రీ.శ. ౧౬౦౦ ప్రాంతమువాఁడని తెలియుచున్నది. ఇంతకంటె నీకవినిగూర్చి యేమియుఁ దెలియరాలేదు. ఈగ్రంథము నాకు లభ్యము కాలేదు.

---

## 295. కవి సింగరన్న



కాకునూరి అప్పకవి తన యప్పకవీయమునందుఁ గవి సింగరన్న త్రిశంకవోపాఖ్యానములోనిదని యీక్రింది పద్యమును లక్ష్యముగా నుదాహరించియున్నాఁడు.

క. ఝషకేతు ద్విషునకుఁ గి
　ల్బిషపర్వత వృషున కమృతవిషనిధి జామా

త్రిషునకు ఋషిపూజితునకు
విషమాక్షునకు కింద్రముఖదివిజపక్షునకున్.

దీనినిబట్టి యీకవి క్రీ.శ. 1656 కుఁ బూర్వుఁడని మాత్రము తెలియుచున్నది. కాని యెప్పటివాఁడో తెలియదు. ఈతని గ్రంథమున హరిశ్చంద్రచారిత్రము వర్ణితమై యుండునని తోఁచుచున్నది. ఈగ్రంథమునుగూర్చి వివరములేవియు తెలియవు. శంకరకవి, సీగ శరభకవి, చంద్రమౌళియనువారలేగాక యీతఁడుకూడ హరిశ్చంద్ర చారిత్రమును రచియించియుండెనేమో!

---

## 296. పోడూరి కొండకవి



ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు. ఇతని తలిదండ్రుల నామములు తెలియవు. ఈతని నివాసము గోదావరిమండలమందలి పోడూరను గ్రామము. ఈకవి భార్గవాభ్యుదయమను ప్రబంధమును రచియించినట్లు పోడూరి పెద రామామాత్యుఁడు శివరామాభ్యుదయమున వ్రాసిన యీక్రింది సీస పద్యపాదమువలనఁ దెలియుచున్నది.

"నీవంశపూర్వాధీనిధి కొండకవిచెప్పె
భార్గవాభ్యుదయ ప్రబంధమెలమి."

పెదరామామాత్యుఁడు క్రీ. శ. ౧౭౨౦—౧౭౮౦ కాలము వాఁడు. అతఁడు తన తండ్రి తాతముత్తాతలను జెప్పుకొనియున్నాఁడు. అందీ కొండకవిలేఁడు. కావున నీతనిని క్రీ.శ. ౧౬౦౦కుఁ బూర్వుఁ డని చెప్పవచ్చును. ఈతని గ్రంథముకానరాలేదు. ఈ గ్రంథమందలి విషయమును దెలియదు. ఈకవినిగూర్చి యింకనేమియు నెఱుంగరాలేదు.

# 297. వత్సవాయ బలభద్రరాజకవి



ఈరాజకవిచంద్రుఁడు, పెద్దాపురసంస్థానమును, క్రీ.శ.౧౬౦౭ మొదలు ౧౬౪౯ వఱకును బరిపాలించిన వత్సవాయ రాయపమహీనాథుని కుమారుఁడు. క్రీ.శ. ౧౬౪౯ మొదలు ౧౬౮౮ వఱకు నా రాజ్యమునుబరిపాలించిన రెండవ తిమ్మభూపాలునిసోదరుఁడు. ఏనుగు లక్ష్మకవిచే ద్రౌపదీపరిణయ ప్రబంధమును గృతిగొనిన దీ తిమ్మ భూపాలుఁడే.

ఈబలభద్రరాజభూపాలుఁడు శ్రీరాముని పేర నొకశతకమును రచియించెననియు, నొకకవిచేఁ గిరాతార్జునీయమును గృతినందెననియు నేనుఁగు లక్ష్మణకవి రామవిలాసమందలి యీక్రిందిపద్యములలో వ్రాసియున్నాఁడు.

మ. అమితఖ్యాతికి మూలమైనకృతి దానందెన్ గిరాతార్జునీ
యము శ్రీరాములపేరఁ బద్యశతకం బారూఢినిర్మించె భో
జమహీజానిగతిన్ బ్రసిద్ధిఁగనియెన్ సాహిత్యసారజ్ఞుఁడై
రమణన్ శ్రీబలభద్రరాజు ప్రజలన్ రక్షించె ధర్మస్థితిన్.

ఈపద్యమునందుఁ జెప్పబడిన గ్రంథములు రెండును, నిప్పుడు కాన్పించుటలేదు. కిరాతార్జునీయమును రచించిన కవిపేరైనను దెలియలేదు.

ఈబలభద్రప్రభువును ఏనుఁగు లక్ష్మణకవి తనరామవిలాసము నందీ క్రిందిపద్యములలో వర్ణించియున్నాఁడు.

గీ. ఆదివిష్ణువు శ్రీకృష్ణుఁడైనవేళ
నన్నయైనట్టి బలభద్రుఁ డంతశౌరి
తిమ్మరాజేంద్రుఁ డగువేళఁ దమ్ముఁ డయ్యె
ననఁగ బలభద్రరాజు విఖ్యాతిఁ గాంచె.

సీ. పౌషవజిత పుష్పచాపంబురూపంబు
గవిమనోరథపూరికరముకరము
చంద్రబింబ ప్రభాసదనంబు వదనంబు
స్మృతవిష్ణు సత్కథా శ్రేణివాణి
శరణాగతత్రాణ సదయంబు హృదయంబు
గురునమస్కారతత్పరము శిరము
బహుబాంధవాగమాభరణంబు శరణంబు
సురనదీనిర్మలస్ఫూర్తికీర్తి
వత్సవయరాయపక్షమావల్లభునకు
సూరమాంబకు సుతుఁడైన సుందరునకు
గలితతేజః ప్రపూర్ణ దిక్కందరునకు
రమ్యబలభద్రరాజపురందరునకు

సీ. ధర్మతనూజుఁ డీధరణీపతికిజోడు
బవరంబులో బొంకుపలుకఁడేని
యలధనంజయుఁ డీ మహారాజునకుసాటి
శూలపాణికివెన్నుఁ జూపఁడేని
హరిణాంకుఁ డీ గుణాకరునకు జతవచ్చు
మేనఁ గళంకంబుఁ బూనఁడేని
కందర్పుఁ డీనృపాగ్రణికిఁ దుల్యుండగు
లలితనంగుఁడునాక చెలఁగెనేని
సత్యశౌర్య యశోరూపసంపదలను
గడమరాజులు సములని నుడువఁ దగునె
యనుచుబుధులెన్న వత్సవాయాన్వయమునఁ
బ్రభనువిలసిల్లె బలభద్రరాజశౌరి.

ఈతని యగ్రజునకు సంతానములేనందునఁ బెద్దాపురసంస్థానమునకుఁ దిమ్మభూపాలుని యనంతరమున నీబలభద్రరాజు తనయుఁ

డైన రాయపరా జగపతియయ్యెను. పెద్దాపురసంస్థాన ప్రభువుల వంశ వృక్ష మీాక్రింద నిచ్చుచున్నాఁడను.



ఈవంశవృక్షములో కనుఁబఱచిన యంకె లాయాప్రభువుల పరిపాలనకాలమును క్రీస్తుశకములో తెలియఁజేయును. బలభద్రరాజు కవితండ్రియైన రాయజగపతిరాజు ౧౭౮౮ సంవత్సరమునఁ జనిపోయి రనియు నప్పటి కాయనకు డెబ్బది యైదేండ్లు వయసు కలదనియుఁ జరిత్రకారులు చెప్పుచున్నారు. అట్లయినచో నాయనజననము ౧౭౧౩ ప్రాంతమయి యుండును. ఆయనకు ముప్పదియైదేండ్లు వయసున బలభద్రరాజుకవి జన్మించెననితలంచినచో నీయనజననము ౧౭౪౮ సంవత్సరమున నైయుండును. ఈయన ౧౭౮౮ వ సంవత్సరమునఁ బూర్వమే యనఁగా తనయగ్రజుఁ డైన సార్వభౌమతిమ్మ జగపతిమహారాజుగారి జీవితకాలములోనే చనిపోయినట్లు స్పష్టమగు చున్నది. ఈయనయుఁ దండ్రిగారివలెనే డెబ్బదియేండ్లకుఁ బైగా జీవించియుండురు.

ఈ పెద్దాపుర సంస్థానము గోదావరిమండలములోనిది. ఈసంస్థానప్రభువులు గొప్పపండితులును, కవిపండితపోషకులునై, యించు మించుగ మూఁడువందల సంవత్సరములు తమకీర్తికాంతులను బ్రపంచమునఁ బ్రకాశింపఁ జేసిరి. మొదట నీసంస్థానము కొలఁది గ్రామములనే కలిగియున్నను, క్రమక్రమముగ నైదువందలగ్రామములను గలిగి గోదావరిమండలములో విశేషభాగమున వ్యాపించియుండెడిది. ఈసంస్థాన ప్రభువులిచ్చిన యగ్రహారములింకను వారికీర్తిని వేనోళ్ల గానము సేయుచున్నవి. ఈసంస్థానప్రభువులశౌర్యౌదార్యాది గుణములను నే వ్రాయఁబోవు గోదావరీమండల చారిత్రమున దెలుపఁ దలఁచి యిటవిడచితిని.

విజయనగర సంస్థానప్రభువులగు పూసపాటివారు తమకు మూలపురుషుఁడు మాధవవర్మయని చెప్పుకొనినట్లే పెద్దాపురసంస్థానప్రభువులగు వత్సవాయివారు తమకు గుడిమెట్టనేలిన సాగిపోతరాజు మూలపురుషుఁ డనియు నాతని మనుమని మనుమఁడైన రామరాజు

'వత్సవాయ'యను నగరమును రాజధానిగాఁ జేసికొనుటచే నప్పటి నుండియు వీరు వత్సవాయవారైనట్లును జెప్పుకొనుచు వచ్చిరి. ఈ యుదంతమును ఏనుగు లక్ష్మణకవి రామవిలాసములో నీదిగువ పద్యములలో గ్రంథస్థము చేసియున్నాఁడు.

గీ॥ సహ్యజాతీరమునకు భూషణమనంగ
సిరులకిరవగు గుడిమెట్టపురము దనకు
రాజధానిగ సత్కళాభోజరాజు
సాగిపోతక్ష్మాభర్త జగతియేలె.

ఈ బలభద్రరాజు పెద్దాపుర సంస్థానప్రభువంశములో జన్మించినను, ఈతని కాసంస్థాన పరిపాలనాభారము వహించునవకాశము లేకపోయినది. మొదటి (ముసలి) తిమ్మరాజు గారియనంతర మా బలభద్రరాజ వంశములోని వారొక రాభారమును వహించి యుండిరి.

ఈకవి రచించిన శ్రీరామశతక మిప్పుడు లభించుట లేదు. అందుచే నీతని శైలి తెలియుటకై పద్యముల నుదాహరింపజాలనైతిని. ఈతఁడు పరాక్రమవంతుఁడై పెద్దాపుర సంస్థానప్రభువుల కండయై నిల్చెనని తెలుపుపద్యముల పైనుదాహరించి యుంటిని.



# 298. వెణుతురుపల్లి విశ్వనాథకవి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కాశ్యపగోత్రుఁడు; వేంకటామాత్యుని పుత్త్రుఁడు; రామమంత్రికి పౌత్త్రుఁడు; మల్లవరపు బాలసుకవికి దౌహిత్రుఁడు. ఈకవి తల్లిపేరు సర్వమాంబ. ఈతని తండ్రియైన వెంకటామాత్యునకు దిట్టకవి యను బిరుదము కలదు. అందుచేత నీకవిని దిట్టకవి విశ్వనాథకవియనికూడఁ బిలుచుచుండెదరు. ఈతనికిఁ దరువాతవారు దిట్టకవివారనియే పిలువఁబడుచున్నారు. ఈకవి నివాసము గోదావరిమండలములోని ద్రాక్షారామ. ఈగ్రామమున దిట్టకవివా రిప్పుడు నున్నారు. ఈకవిని గూర్చియు, నీతని తనయుఁడైన వేంకటామాత్యకవిని గూర్చియు వారి నడిగితిని. కాని వా రేమియుఁ జెప్పలేకపోయిరి.

ఈవిద్వత్కవి యాంధ్రమున శ్రీరామవిజయ మనుయక్షగానమును, గౌరీవివాహమను ద్విపదకావ్యమును, హరిశ్చంద్రచరిత్ర మనునిరోష్ఠ్యప్రబంధమును, సంస్కృతభాషయందు పారిజాతాపహరణ మను కావ్యమును, శేషధర్మము లనుమూఁడాశ్వాసముల యాంధ్రగ్రంథమును రచియించి కీర్తిగాంచియున్నవాఁడు. శేషధర్మములను పెద్దాపుర సంస్థాన సంపాదకుఁ డగు వత్సవాయ తిమ్మనృపాలున కంకితము చేసెను. ఈతిమ్మభూపతి ద్రాక్షారామవచ్చి, కవిని శేషధర్మములను దన కంకితము చేయుమని చెప్పినట్లు రచించిన యీక్రింది గద్యపద్యములవలనఁ గవి వంశాదికమును గవిరచించిన గ్రంథనామములను గవి సామర్థ్యమును దెలియఁగలవు.

వ॥ ..... వత్సవాయవంశపవిత్రుండును, పేరభూపాలనందనుండును, పుణ్యశీలుండు నైనతిమ్మభూపాలుండు, బ్రాహ్మణాశీర్వచనప్రభావసంవర్ధితసామ్రాజ్యమహావైభవంబుగాంచి, సమానుల లోపల

నుత్తమశ్లోకుండై తేజరిల్లుచు నొక్కనాఁడు శ్రీభీమేశ్వరస్వామిమహిమాభిరామం బైన దక్షారామంబునకు విజయంచేసి యేనుఁ గృతి సేయఁబూనుటఁదనయనుఁగుమంత్రియగు నేనుఁగు గురవప్రధానుండు విన్నవించినవినిసంతోషించి సకలశాస్త్రపరిశంసు లగువిద్వాంసులును, ఉభయభాషాకవిత్వనిర్మాణ సామర్థ్యసాంద్రు లగు కవీంద్రులును, చతురోపాయనిపుణతాపరిచిత పరమంత్రిభేదనప్రభావకవితావధాను లగు ప్రధానులును...... బరివేష్టింప సుఖాసీనుండై ధర్మాభిరామం బైనకొలువుకూటంబునఁ బేరోలగంబుండి, భగవద్భాగవత ధర్మనిర్మల కథాప్రసంగ కౌతూహలాయత్తచిత్తంబున:—

సీ. సురుచిరాపస్తంబసూత్రుఁ గాశ్యపగోత్రుఁ
బ్రాజ్ఞుఁడౌ వెలుతురుపల్లి రామ
మంత్రీశ్వరుని పౌత్రు మల్లవరపుబాల
సుకవి దౌహిత్రు దిట్టకవియసంగ
విఖ్యాతిఁగాంచిన వేంకటామాత్యున
కును సర్వమాంబకుఁ గూర్మిపుత్త్రు
విశ్వనాథాఖ్య విశ్వేశ్వరవరకృపా
లబ్ధసత్కవితావిలాసు నన్ను

తే.గీ. నాదరంబునఁ బిలిపించి యర్హపీఠ
కమునఁ గూర్చుండ నియమించి కరుణఁ జూచి
తనప్రసన్నముఖారవిందమున మంద
హాస మలరంగ నిట్లని యానతిచ్చె.

సీ. సృజియించినాఁడవు శ్రీరామవిజయంబు
యక్షగానంబు చిన్నపుడె రూఢిఁ
గల్పించినాఁడవు కవిజనశ్రవణ సౌ
ఖ్యమున గౌరీవివాహంబు ద్విపద

రచియించినాఁడవు ప్రచురచాతురి, నిరో
ష్ఠ్యప్రబంధము హరిశ్చంద్రచరితఁ
గావించినాఁడవు దేవభాషను పారి
జాతాపహరణంబు శాశ్వతముగ

తే.గీ. అన్నిటను నీవ నేర్పరి వార్యవర్య
వర్ణనీయకవిత్వతత్వంబునందు
నిందుకోటీరచరణారవిందవంద
నప్రభావనిధీ! విశ్వనాథసుకవి!

శా. ఏరీ నీకు సమాను లిప్పటితటి న్విద్వత్కవి గ్రామణుల్
పారావారపరీత సర్వవసుధాభాగంబునం దు న్నట
ద్గౌరీకాంత జటాచ్ఛటాంతరరటద్గంగాతరంగావళీ
భూరిశ్రీవ్యఘుళంఘుళధ్వనులఁ దెల్పు న్నీ వచోగుంభనల్.

గీ. ఎలమిఁ గవిరాజు లెంచంగ నిపుడు నీవు
చెప్పఁబూనినకావ్యంబు శేషధర్మ
మంకితము సేయు మాపేర ననఘచరిత
ధారుణీస్థలి నాచంద్రతారకముగ.

ఈకవి తండ్రి యైన వెంకటామాత్యకవిని "దిట్టకవిబిరుదాంచితుఁ"డని చెప్పెనేకాని యాతఁడు రచించినగ్రంథములేవియో తెలుపలేదు. ఆతని గ్రంథములమాట యిప్పు డెచ్చటను వినఁబడుటయునులేదు. విశ్వనాథకవి రచించిన పుస్తకములలో శేషధర్మములు తప్ప తక్కిన గ్రంథములన్నియుఁ గాలగర్భమునఁ బడి సమసిపోయినవి. శేషధర్మము లైనను బూర్తిగా ముద్రింపఁ బడలేదు. వత్సవాయవారి చారిత్రముండుటచే నవతారికమాత్రము ముద్రితమైనది. తక్కిన గ్రంథము ముద్రితముకాలేదు. ఈ విశ్వనాథకవి తండ్రి ప్రఖ్యాతిగల కవియైనట్లే యీతనికుమారుఁ డైన వెంకటామాత్యకవి కూడ పండితుఁడును గవియు నైయున్నాఁడు. తులామాహాత్మ్యాది ప్రబంధములను రచించి పెద్దాపుర సంస్థానాధిపతులను మెప్పించిన

యేనుగు లత్సకవి యీవిశ్వనాథకవికి మేనల్లుఁడు. ఇట్లీతని కుటుంబము పండితకవికుటుంబమై తరములకొలఁది ప్రఖ్యాతినొందినది.

శేషధర్మకృతిపతియైన తిమ్మభూపతికి "చతుర్భుజతిమ్మప్రభు"వని బిరుద మున్నట్లు శేషధర్మమునందలి యీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

గీ. గుణవిభూషణుఁ డేనుఁగు గుర్వమంత్రి
ధీరుఁ డగు పోలప్రెగ్గడ సూరమంత్రి
కడమ రెండు భుజంబులుగాఁగఁ బ్రబలె
మహిఁ జతుర్భుజుఁ డనఁగఁ దిమ్మప్రభుండు.

ఈతిమ్మరాజొనర్చిన ధర్మకార్యముల నీకవి యీక్రింది పద్యములోఁ బేర్కొనియున్నాఁడు.

సీ. కట్టించె గుడి జగత్కర్త జనార్దన
స్వామికి నవనిపై శాశ్వతముగఁ
బెట్టించె నన్నంబు పేర్మితో నేప్రొద్దు
ననివారితముగ నభ్యాగతులకు
నలరించెఁ బ్రచురతోయపుపూరిత తటా
కము సర్వజంతూపకారముగను
గావించె సకలవృక్షశ్రేణిశోభితం
బగుచు నెప్పుడునంద మైనతోట
గీ. చేసెను ప్రతిష్ఠ లక్ష్మీనృసింహపాద
భక్తినిం జేసి సిరులచేఁ బ్రబలుధన్యుఁ
డౌర! యెంచఁగ వత్సవాయాన్వయమునఁ
దిమ్మభూపాలమౌళి సత్కీర్తిశాలి.

ఈయనకుఁ బిమ్మట తిమ్మరాజనామధారులు పలువు రీవంశమునఁ బయలువెడలుటచే నీయనను "ముసలి తిమ్మరాజు" గారని తరువాతివారు వాడుచువచ్చిరి. ఈముసలితిమ్మరాజుగారు క్రీ. శ.

౧౫౫౫ సంవత్సరమునకు సరియైన యానందసంవత్సర భాద్రపద బహుళ సప్తమినాడు పెద్దాపుర సంస్థానమును సంపాదించి, ౧౬౦౭వ సంవత్సరమునకు సరియైన పరాభవ సంవత్సర మార్గశిర బహుళ ద్వితీయవఱకు నేఁబదిరెండు సంవత్సరముల రెండుమాసముల యిరువదియైదు దినములు రాజ్యముచేసి లోకాంతరగతులయిరి.'' అని శ్రీ వీరేశలింగముపంతులుగారు ఏనుగు లక్ష్మణకవిచారిత్రమున వ్రాసియున్నారు. విశ్వనాథకవి, శేషధర్మకృత్యాదియందు కృతిపతిని వర్ణించిన సందర్భములయం దెచ్చటను పెద్దాపురము మాటగాని, యాసంస్థానసంపాదనవిషయముగాని తెలుపలేదు. శేషధర్మరచనము సంస్థానసంపాదనకుఁ బూర్వమని యనుట కాతనివయసునుబట్టి వీలు లేదు. ఈవిశ్వనాథకవి మేనల్లుఁడైన యేనుగు లక్ష్మకవి పెద్దాపుర సంస్థానమును క్రీ.శ. ౧౬౪౯ మొదలు ౧౬౮౮ వఱకును బరిపాలించిన సార్వభౌమతిమ్మజగపతి మహారాజులుంగారి కాలములోనుండి యాయన బంధువులకుఁ గృతులనొసంగి యుండెను. సామాన్యముగా మేనమామకును మేనల్లునకును ౩౦–౪౦ సంవత్సరములకంటె నెక్కువ యంతరముండదు. విశ్వనాథకవి ౧౫౫౫సంవత్సరమునకుఁ బూర్వమే కృతినొసంగె నందుమేని, మేనల్లునకును మేనమామకును ౧౦౦ సంవత్సరముల యంతర మేర్పడును. ఇది యసంభవము. కావున నీ కవిచంద్రుఁడు క్రీ. శ. ౧౫౭౦ సంవత్సరప్రాంతమున జన్మించి, ముప్పదియైదేండ్లవయసున తిమ్మభూపతికి శేషధర్మము నంకితము చేసెననియు, నేనుగులక్ష్మకవి, ౧౬౧౦వసంవత్సరప్రాంతమున జన్మించి నలుపదియేండ్లవయసు మొద లేఁబదియేండ్ల లోపున సార్వభౌమతిమ్మ జగపతికిని తద్బంధువులకును గృతు లొసంగెననియుఁ దలంచితిమేని, యాయంతరమును సమన్వయము చేసినవారమగుదుము. తిమ్మభూపతియొద్ద ఏనుఁగు గుర్వమంత్రి, మంత్రిగానుండెననియు, తిమ్మభూపతికిఁ గలచతుర్భుజములలో నీగుర్వమంత్రి యొక్కఁడుగానుండె

ననియుఁ బైని వ్రాసియున్నాఁడను. ఈగుర్వమంత్రియు, లక్ష్మకవి తండ్రియైన గురురాజును నొక్కరుకారు. వీరిరువురు నన్నదమ్ములు. గరికరాజు కుమారులు. విశ్వనాథకవిసోదరి యైన పేరమాంబను గురురాజమంత్రి పెండ్లియాడెను. గుర్వమంత్రి విశ్వనాథకవికి బావ మఱఁది(సోదరీభర్త)కాఁడు బావమఱఁది కన్నగానరాఁలోచుచున్నది.

లక్ష్మకవి తండ్రియైన గురురాజమంత్రికూడ తిమ్మభూపతికడ మంత్రియైనట్లు సుభాషితరత్నావళిలోని యీక్రింది పద్యమువలన దెలియుచున్నది.

ఉ. ఆయతభోగ వాగ్జితబలారిగుసున్ గురురాజు దానరా
  ధేయు నజేయు వత్సవయ తిమ్మమహీశ్వర రాజ్యభారధౌ
  రేయు నుతింపఁగా, దగు వరిష్టగజాశ్వ సుఖాసనాది ల
  క్ష్మీయుతు దేవవాస సరసీవననిర్మల ధర్మకర్మఠున్.

ఈదులపల్లి భవానీశకవి రచించిన ధర్మఖండమునకుఁ బీఠిక వ్రాసిన విమర్శాదర్శక నడకుదుటి వీరరాజుపంతులుగా రా పీఠికలో "మఱియు నాతని (విశ్వనాథకవి) సోదరి పేరమాంబ యప్పటి పెద్దాపురసంస్థాన మంత్రియైన యేనుఁగుగుర్వరాజు (ఏనుఁగు లక్ష్మణకవికిఁ బ్రపితామహుఁడు) భార్య... మఱియుఁ బైతిమ్మరాజప్రభువు దక్షా రామభీమేశ్వరస్వామిని సందర్శింప వచ్చినప్పు డాతనిమంత్రియగు గురవప్రధాని తనబావమఱఁదియైన విశ్వనాథకవి ప్రజ్ఞావిశేషాదులను గూర్చి తనప్రభువునకు విన్నవింపఁగా, రాజాతనిని బిలిపించినట్లు శేష ధర్మకావ్యమునఁ గలదు" అనివ్రాసియున్నారు. గురురాజ, గురువ రాజుల నిరువుర నొకేవ్యక్తిగా భావించుటచే, వీరరాజుపంతులుగారు విశ్వనాథకవి సోదరి గుర్వమంత్రిభార్యయని పొరబాటు వ్రాసిరి. చతుర్భుజ తిమ్మజగపతిమహారాజుకడ ఏనుగు గరికరాజుకుమారులైన గురువమంత్రి, గురురాజులు మంత్రులుగానున్న విషయమింకను పరి శోధనీయము. ఈగురురాజుగారును, గుర్వమంత్రిగారును సోదరులని

సుభాషితరత్నావళి పీఠియందే వ్రాయబడియున్నదని శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు 'పెద్దాపురసంస్థాన చరిత్ర విమర్శనము'న వ్రాసియున్నారు.

ఈకవి, తానుమల్లవరపు బాలసుకవి దౌహిత్రుఁడనని చెప్పుకొనియున్నాఁడు. ఈ బాలసుకవి యేమేని కావ్యములను రచించెనేమో తెలియదు.

మల్లవరపు వాలేశ్వరుఁడను నొకకవియున్నాఁడు. అతఁడుభల్లాణ చారిత్రమను గ్రంథమును రచియించియుండెను. అతని చారిత్రము నీగ్రంథమునం దిదివరలో వ్రాసియున్నాఁడను. (ఆ. క. త 11 సం. 128 పుట.) ఆతఁ డీతఁడేమో యని సంశయముకలదు. నిశ్చయింపలేము. కాలమాటంకము కలుగఁజేయదు.



## 299. ఏనుఁగు లత్సకవి



ఇతఁ డాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; వాధూలసగోత్రుఁడు; గురుమంత్రికిని పేరమాంబకును బుత్త్రుఁడు; గరికమంత్రికిఁ బౌత్త్రుఁడు. ఇతనిని లక్ష్మణకవియని కూడఁ బిలుచుచుందురు. ఇతని పౌత్త్రుఁడుకూడ లక్ష్మణకవియే. ఇరువురకును భేదము తెలియుటకై యీతనిని లత్సకవియనియు, నితని మనుమని లక్ష్మణకవియనియు నిందు వ్రాయుచున్నాఁడను. లత్సకవియని పేరు నేనుంచినదికాదు. గ్రంథములలోఁ గొన్నితావులలో లత్సకవియనియే యున్నది. ఇతని వాస్తవనామము లత్సయ్యయై యుండును.

ఈమహాకవి, రాజశేఖరచరిత్రము, ధ్రువచరిత్రము, తుల్యామహాత్మ్యము, ద్రౌపదీపరిణయము, భీమసేనవిజయము, భల్లాణరాయ చరిత్రము నింకను మఱికొన్ని గ్రంథములను రచించినట్లు తెలియు

చున్నది. అదియేమి దురదృష్టమోకాని, యీతని కృతులొక్క-టియు నిప్పుడు లభించుటలేదు. తుల్యామహాత్మ్యమునఁ గొంత భాగము చిత్రాడయందలి యముద్రితాంధ్రగ్రంథసర్వస్వము వారికి లభించినదని తెలియుచున్నది. కాని వారాభాగమునైనను ప్రకటించినవారుకారు. ఆభాగమునుజూచుభాగ్యమైనను నాకుఁ గలుగలేదు. ఈతనిచారిత్రము వ్రాయుట కితరుల గ్రంథము లాధారములైనవి. అందు ముఖ్యమైనవి యీతని మనుమఁడైన లక్ష్మణకవి రచితములు.

ఈకవిపూర్వులు పైడిపాటివారనియు, నావంశీయుఁ డగు జలపాలామాత్యునకు గజపతి, ఏనుగును బహుమానమిచ్చి యగ్రహారము నిచ్చుటచే నప్పటినుండియు వీరేనుఁగు వారని పిలువఁబడుచుండి రనియు, లక్ష్మణకవి తనసుభాషిత రత్నావళిలో నీక్రింది పద్యము లలోఁ జెప్పియున్నాఁడు.

సీ. పరమేష్ఠి తుల్యప్రభావుండు వాధూలుఁ
    డను ఋషిచంద్రుండొప్పు ననఘమూర్తి
యమ్మునినాథు వంశమ్మున క్షీరాంబు
    నిధి సుధాకరుఁడు జన్మించినట్లు
ప్రభవించి శ్రీపైఁడిపాటి సింగనమంత్రి
    వంశాగ్రగణ్యుఁడైవఱలునతని
మహిమ సంతానక్రమమునను జలపాల
    సచివుఁ డొప్పె బలారిసచివసముఁడు
గజపతి క్షితిభర్తచే గజముతోడ
నగ్రహారములతఁడు పరిగ్రహించె
నెలమి నేనుఁగు వారన్నయింటిపేరు
గలిగెనతనికి గజలాభగరిమవలన.

గీ. ఈద్యగజపతి దత్త సోమేశ్వరాగ్ర
హారశాసనుఁడై మహోదారభాగ్య

మహిమగలిగిన జలపాలమంత్రిమణికి
గరికరాజు జనించె విఖ్యాత యశుఁడు.

బ్ర. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు ఆంధ్రకవుల చారిత్రములో, ఏనుఁగు లక్ష్మణకవి చారిత్రమున "ఈకవిపూర్వుల యింటిపేరు పైఁడిపాటి వారయినను, సింగన్నవంశజులలో నొకఁడగు జలపాలామాత్యుఁడు పెద్దాపురసంస్థానాధీశ్వరుఁ డగు గజపతి రాజుచే నేనుఁగును బహుమానమందుటచే నప్పటినుండియు నేనుఁగు వారని మాఱినది. ఈయంశమే సుభాషితరత్నావళ్యవతారికలో నిట్లు చెప్పఁబడినది"అని వ్రాసి పైపద్యము నుదాహరించియున్నారు. తరువాతి చరిత్రకారులు కొందఱును, గ్రంథపీఠికాకారులు నిట్లే యభిప్రాయపడియున్నారు. కాని యీయభిప్రాయములు పొరపాటనియు జలపాలామాత్యున కగ్రహారమును గజమును బహుమాన మిచ్చినది కళింగదేశపురాజగు గజపతిగాని పెద్దాపుర సంస్థానాధిపతి కాఁడనియు నాయుద్దేశము. పెద్దాపురసంస్థానాధిపతులు జగపతులు గాని గజపతులుగారు. పెద్దాపురసంస్థానాధిపతులలో గజపతినామధారు లెవ్వరును లేరు. జలపాలామాత్యుని నాటికి పెద్దాపురసంస్థానమే లేదు. పెద్దాపురమునుగట్టినది గజపతుల సేనానియగు పెద్దాపాత్రుఁడు. ఆ పెద్దాపాత్రుని పేరనే యీపట్టణము నిర్మాణమైనది.

పెద్దాపురసంస్థానమును మొట్టమొదట సంపాదించినది వత్సవాయ (ముసలి) తిమ్మరాజుగారు. ఆయన క్రీ. శ. ౧౫౫౫ మొదలు ౧౬౦౭ సంవత్సరమువఱకు పెద్దాపురసంస్థానమును బాలించెను. ఆయనయొద్ద నీలత్సకవితండ్రియగు గురువరాజు మంత్రిగానున్నట్లు వెలుతురుపల్లి విశ్వనాథకవి చారిత్రమున వ్రాసియున్నాఁడను. ఆ గురవరాజు పితామహుఁడైన జలపాలామాత్యుఁడు గజమును గజపతి యొద్ద బహుమతిగాఁ బడసియుండెను. దీనినిబట్టి జలపాలామాత్యుఁడు క్రీ. శ. ౧౫౦౦ సంవత్సర ప్రాంతమువాఁడని స్పష్టమగుచున్నది.

ఆకాలమునాఁటి కీప్రాంతము కళింగదేశపురాజుల పాలనములో నున్నది. పురుషోత్తమగజపతియో, ప్రతాపరుద్రగజపతియో జలపాలామాత్యుని యేనుఁగుచే బహూకరించియుండును. క్రీ శ. ౧౫౨౦ సంవత్సరప్రాంతమునగదా శ్రీకృష్ణదేవరాయలు, గోదావరిమండలమునంతను, ప్రతాపరుద్రగజపతిని జయించి తీసికొని పొట్నూరు వద్ద జయస్తంభము నాటించినది! అప్పటికి పెద్దాపురసంస్థానమేది? ఒకవేళ వత్సవాయవా రాకాలముననున్నను గజపతులవద్ద సేనానులుగనో సరదారుగనో యుండియుందురు. కాని సంస్థానాధిపతులుగా లేరు. కావున నీబహుమానము కళింగదేశపురాజులగు గజపతులిచ్చినది గాని పెద్దాపురమువా రిచ్చినది కాదు. ఈ సోమేశ్వరము గోదావరిమండలములందలి రామచంద్రపురముతాలూకాలోనున్నది. ఆగ్రామమిప్పు డగ్రహారముగాలేదు. గవర్నమెంటు గ్రామముగా నున్నది. అం దిప్పుడు ఏనుఁగువా రున్నారు. జలపాలామాత్యుఁడు సోమేశ్వరాగ్రహార శాసనుఁ డని పైపద్యములోఁ జెప్పియుండుటచే నాతఁ డాయూరికిఁ గరణమై యుండునని తలంపవలసియున్నది. ఆ గ్రామమున కిప్పుడు నేనుఁగువారే కరణములుగా నున్నారు. సోమేశ్వరగ్రామమునం దిప్పటికిని నొకభాగమున నించుమించు ముప్పది నలుబది పుట్లభూమి యొకే ఖండముగ నేనుఁగువారిక్రింద నున్నది. జలపాలామాత్యునకుఁ బిమ్మట నాతని తనయుఁడో మనమఁడో పెద్దాడగ్రామకరణీకమును సంపాదించియచ్చటికిఁ బోయియుండును. ఈ లక్ష్మణకవి పెద్దాడ గ్రామమునకుఁ గరణమే. పెద్దాడ కిప్పుడు నేనుఁగువారే కరణములు.

ఈ లక్ష్మణకవి రచించిన గ్రంథముల నీతని మనుమఁడైన లక్ష్మణకవి జాహ్నవీమాహాత్మ్యమునం దీక్రింది సీసపద్యములోఁ జేర్కొని యున్నాఁడు.

సీ. రాజశేఖరచరిత్రము రసోచితముగా
నిర్మించె నేప్రోడ నేర్పుమెఱయ
మహిమఁ దుల్యానదీ మాహాత్మ్యమే పెద్ద
రచియించె నర్థగౌరవముగులుక
పటుచమత్కారగుంభన మొప్ప ద్రౌపదీ
పరిణయంబే జాణప్రౌఢిఁ గూర్చె
ధ్రువచరిత్రము మహాకవిపుంగవులు మెచ్చఁ
గల్పించె నేకవి కౌశలమున
గీ. నతని నతులితకవితాకృతాభిషేకు
మత్పితామహు గురుపితామహసమాన
మాననీయ వచశ్శాలి మహితశీలి
లక్ష్మణామాత్యవరాళిఁ దలంతుమదిని.

భీమసేనవిజయము, భల్లాణచరిత్రము ననుకృతుల నీపద్యమునఁ బ్రశంసించియుండలేదు. లక్ష్మణకవి కాలమునాటికే యా కావ్యము లుత్పన్నములై పోయెనేమో తెలియదు. రాజశేఖర చరిత్రమునకు భల్లాణచరిత్రము నామాంతరమై యుండును. లక్ష్మణకవి చెప్పిన యీక్రిందిపద్యములవలన నీలత్సకవియొక్క ప్రతిభకొంత వఱకు వ్యక్తము కాఁగలదు.

మ. సరసప్రౌఢవచోవిలాస విబుధాచార్యుఁ సువర్ణక్షమా
ధరధీరున్వివిధ ప్రబంధరచనా దక్షున్నివధ్యానత
త్పరచిత్తుం బ్రణమత్సమస్తధరణీపాలున్సు భద్రామనో
హరునింగొల్చెద మత్పితామహుని లత్సామాత్య చూడామణిన్

—రామేశ్వరమాహాత్మ్యము.

ఉ. సారదయారసద్రుహిణ సాంద్రధికిఁ గురురాజమంత్రికిన్
బేరమయందు నందనుఁడు పేర్మిజనించె విలాససంపదన్
మారుఁడు విక్రమంబునఁ గుమారుఁడు లక్ష్మణశౌరిభూరిశో
భారవి సాహితీవిజితభారవి ధీరవిచారవిశ్రుతిఁ.

ఉ. దండిమనోజ్ఞశబ్ద కవితార్ఝురిచే నుపమాసమృద్ధిచే
రెండవకాళిదాసు రసరీతితరంగితసూక్తిఁ గుండలీం
ద్రుండని ధీరులెంచఁగఁ గృతుల్ రచియించిన ధన్యునిన్ మహా
పండితమాన్యు నెన్నఁదగు భాజితసూర్యుని లక్ష్మణార్యునిన్.

గీ. కృతులొసఁగి వత్సవయ తిమ్మనృపతిచేతఁ
దురగమణిభూషణాంబ రాందోళికాది
పూజఁ గైకొని పెద్దాడపురవరాను
శాసనుండయి లక్ష్మణశౌరితనరె ..

—సుభాషితరత్నావళి

ఉ. శ్రీతనుజాతసుందరు నశేషమనీషిమనీషితార్థ సం
ధాతను శ్రీనికేతను విధాతనుఁ బోలినమేటిసూరి సం
ఘాతనుత ప్రబంధచయకర్తను గీతరహస్యవేది మా
తాతను లక్ష్మణార్యుని ముదంబుననెంతు విభాత్రియీాతనున్.

—రామవిలాసము.

ఈ లక్ష్మణకవి కవిత్వమును రుచి చూపుటకు నాకా గ్రంథములు లభింపలేదు. తుల్యామాహాత్మ్యములోనివని పెద్దాపురసంస్థానచరిత్రి విమర్శనకర్త లుదాహరించిన పద్యముల నీక్రిందఁ బొందుపఱచు చున్నాఁడను.

సీ. ఎఱజెర్ల నాకలో నేకవీరుండన
గుజ్జంపురౌతుల గ్రొవ్వడంచె
ప్రాగ్దేశమున మన్నె రాజులందఱు మెచ్చ
శత్రురాజులనెల్ల సమయఁజేసె
బిరుదాంకపురమునఁ బెద్దాపురంబున
తురకసైన్యంబుల నుఱుముచేసెఁ
దినుపతియొద్ద నెదిర్చినట్టి నరేంద్ర
తనయుని గర్వంబుఁ దలఁగఁజేసె

సకల దిగ్దేశభూపాల సభలయందుఁ
గీర్తి రాణింప మిక్కిలి వార్తకెక్కె
వత్సవయ పేరధారుణీశ్వరుని సుతుఁడు
ప్రకటగుణపాళి తిమ్మభూపాలమౌళి.

గీ. అందఱికిఁ దనచేయిమీఁద నినబిరుదు
డిక్క తిమ్మక్షితిపతి పైఁడిమొరవాలు
పేరుమహామదుఖానుని చేతనందు
నపుడు తనచేయి మీఁదుగా నందుకొనియె.

చ. సిరియును బౌరుషంబును బ్రసిద్ధియుఁ బ్రజ్ఞయు లావుచేవయున్
దొరతనమున్ రణప్రకటదోర్బలశక్తియు దానధర్మముల్
మురిపెము సొమ్ములెమ్మెలును భూరిసుఖాననముఖ్యసౌఖ్యముల్
దొరకెను తిమ్మభూవిభుని దొడ్డతనంబున రాచవారికిన్.

సీ. సుల్తనబ్దుల్ హసన్ క్షోణీశ్వరుని చేత
మాటిమాటికి బహుమాన మొందె
మఱియును బింగళిమాదన్న భానుజీ
మంత్రిజ్ఞవలన సమ్మాన మొందె
అక్కన్న మొదలైన యట్టిపెద్దలచేత
మేలుభూషణములు మెప్పులందె
పరులమ్కరులకు దుష్కరము లౌగడిదుర్గ
ములఁగొట్టి వారిచేఁ బూజలందె
పీఠికాపురికిమ్మరు బిక్కవోలు
తునియుఁ గొత్తాము మొల్లేరు ఘనత నేలె
వత్సవయ తిమ్మభూపాలవరుని సుతుఁడు
రాజమాత్రుఁడె రాయపరాజశౌరి.

సీ. అరిమురి తురకసైన్యము నుగ్గుచేయించి
గట్టిగా నమ్మయ్య గట్టుదరిని

వంతుకు వచ్చుభూవరుల పేరడఁగించె
శివిచేలంపక లోవయొద్ద
రాఘవరాజు గర్వముమాపి పోట్రాజు
రాజును జేసెఁ దద్రాజ్యమునకు
కూడెమంతయును గగ్గోలుగా శరభభూ
పతిఁగొట్టి వీరన్నఁ బ్రభునిజేసె
రాజమాత్రుండె పరమన్నెరాయవిభుఁడు
చండమన్నియరాజుల గుండెదిగులు
వెక్కసపు మన్నెరాజుల వెన్నుతరటి
తిమ్మభూపాలరాయధాత్రీవిభుండు.

ఈలక్ష్మణకవి రచించినగ్రంథములలో ద్రౌపదీపరిణయమును సార్వభౌమ తిమ్మజగపతి మహారాజు కృతినొందినట్లు లక్ష్మణకవి కృత రామవిలాసములోని యీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

చ. "హరిహర పద్మజాంశభవుఁడై తగునేనుఁగు లక్ష్మణార్యుచే
సురుచిరశబ్దభావరస శుంభదలంకృతి మాధురీమనో
హరమగు ద్రౌపదీపరిణయంబను నుత్తమకావ్యమందె సు
స్థిరమగుకీర్తిసొంపెసఁగఁ దిమ్మనృపాలుఁడు ధర్మపద్ధతిన్.

ధ్రువచరిత్రమును, రాజబంధువుఁడగు వెంకటరాజ పుత్త్రుఁడైన జగ్గరాజునకుఁ గృతియొసంగినట్లు రామవిలాసమందలి యీక్రింది పద్యమునఁ జెప్పఁబడినది.

చ. కవికులసార్వభౌముఁ డనఁగాఁ దగు నేనుఁగులక్ష్మణార్యుచే
ధ్రువచరితప్రబంధము బుధుల్వినుతింపఁగనంది యాగభు
గ్భవనమహాసుఖానుభవకారణమైన యశంబుగాంచె వా
సవవిభవుండు వత్సవయ జగ్గనృపాలుఁడు సద్గుణోన్నతిన్.

తుల్యామాహాత్మ్యమును, వత్సవాయకస్తూరిరంగరాజుకుమారుఁడైన జగన్నాథరాజున కంకితమొనర్చి నట్లీక్రింది పద్యమునుబట్టి తెలిసికొనవచ్చును.

ఉ. హేమనగేంద్రధీరుఁడగు నేనుఁగులక్ష్మణ సత్కవీంద్రుఁ డు
ద్దామసుధామయోక్తి వితతంబగునట్లు రచించినట్టి తు
ల్యామహిమ ప్రబంధము గుణాఢ్యులు మెచ్చఁ బరిగ్రహించెఁ బ్ర
జ్ఞామహితుండు జగ్గనృపచంద్రుఁడు శాశ్వతకీర్తి సంధిలన్.

ఈకవి రచించిన భీమసేనవిజయ యనుద్రిశతిని మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునఁ జూచితిని. కవిత్వము చాల మనోహరముగాఁ గన్పట్టినది. ఇందుఁ గొన్నిపద్యములు తిక్కన సోమయాజి భారతపద్యముల ననుకరించుచున్నవి. ద్రౌపది కీచకునిచే పరాభవింపఁ బడినప్పు డారాత్రి భీమసేనునితో మాటలాడుసందర్భమున ధర్మరాజువలన నిట్టి కష్టములన్నియు సమకూడుచుండెనని భీమసేనుఁ డనఁగా ద్రౌపది ధర్మరాజునందట్టి నిరసనభావము భీమసేనునకుఁ గలుగకుండుటకై ద్రౌపది.

"ఎవ్వానివాకిట నిభమదపంకంబు
రాజభూషణ రజోరాజినణఁగు"

అనుసీసపద్యమును తిక్కనరచియించియుండెను. లక్ష్మకవి యీపద్యము ననుకరించుచు నొకసీసపద్యము నాకథా సందర్భమునందే రచియించి యున్నాఁడు. ఆపద్యమును నేను వ్రాసికొనివచ్చితిని. కాని యది యెచ్చటనో పడిపోయి కన్పడకుండుటచే నిట వ్రాయ లేకపోయితిని. లక్ష్మకవి యీపద్యమువలను నితివృత్తమున మార్పుచేసి, ద్రౌపది నూరార్చి ధర్మరాజుచే నిట్టియాపదలు వచ్చుచున్నవని ద్రౌపది యనఁగా నీపద్యమును భీమసేనునిచేఁ జెప్పించినాఁడు. ఈమార్పు యొక్క యుచితానుచితములనుగూర్చి చర్చించుట కిట తావు చాలదు.

# 300. చల్ల గురవయ్యామంత్రి

ఇతఁడు యాజ్ఞవల్క్యవిజయ మనునాఱుకాండలు గలద్విపద కావ్యమును కొచ్చర్లకోట వెంకటమంత్రి ప్రేరణముచే రచియించి శ్రీరామచంద్రున కర్పితము చేసెను. యాజ్ఞవల్క్యమహర్షి యొక్క చారిత్ర మాఱుకాండలు. జన్మకాండము, వేదకాండము, మైత్రేయ కాండము, పరబ్రహ్మకాండము, యజ్ఞకాండము, విశ్వజిత్కాండము అని యాకాండములకుఁ బేర్లు. కవియును, ప్రేరేపకుఁడునుగూడ. యాజ్ఞవల్క్యయులే. ఇరువురును ప్రథమశాఖా నియోగిబ్రాహ్మణులు. కవి కౌండిన్యగోత్రుఁడు; బాలసరస్వతి బిరుదాంకితుఁడు పేరమంత్రికి నెల్లమాంబకుఁ బుత్రుఁడు; తిప్పయమంత్రికిని వీరమాంబకును బౌత్రుఁడు; అనంతయకును యజ్ఞమకును బ్రపౌత్రుఁడు. కవి నివాసము కొండపల్లి. ఈవిషయము లీ క్రిందిద్విపదలలో జెప్పఁబడి యున్నవి.

ద్వి:- మంజులవాక్కుల మదవంశసరణి
గరిమతో వర్ణింతు క్రమమున నిపుడు
సిరులు రంజిల్లెడు శ్రీ కొండపల్లి
పురముననుండెడు భూసురవరుఁడు
చల్లయనంతయ సాధ్వియజ్ఞమ్మ
సలలితంబుగ గాను సత్పుత్రుఁ గనియె
తిప్పయమంత్రి వర్ధితయశోధనుని
నొప్పుగ నతఁడు దా నొగిఁ బెండ్లియయ్యె
వీరమాంబను విమలాంగి యనంగ
నారూఢి నిద్దఱకత్యంత ప్రేమఁ
దనయులు పేరప్రధాని మల్లాఖ్యుఁ
డొనరఁ గూనయమంత్రియును గల్గిరపుడు

నా పేరమంత్రికి నర్థాంగలక్ష్మి
ఎల్లమాంబ యనంగ నింపు వహించె
నిరువురకును గల్గి రనయంగ సుతులు
గురవయాఖ్యుండును గురువాహ్వయుండు
సొగసైన మల్లికార్జునుఁ డనఁబరఁగె
మగఁటిమితో రాజమాన్యు లైనట్టి
యనఘులు గలిగిరి యందగ్రజుఁడును
వల్లనైన శ్రీయాజ్ఞవల్క్య వంశజుఁడుఁ
గొలఁదిగఁ గౌండిన్యగోత్ర చరితుఁడను

కృతిప్రేరకుఁ డైన వేంకటమంత్రి కొండవీటికి స్థలకరణమయిన ట్లీ క్రింది ద్విపదలవలనఁ దెలియుచున్నది. ఆతని వంశావళిని గవి యీక్రింది ద్విపదలలో వర్ణించియున్నాఁడు.

“విలసితం బగు కొండవీటికిఁ గలుగు
స్థలకరణంబును సజ్జనగుణుఁడు
వెలయుకృష్ణాపాత్రు వెంకటమంత్రి
తిలకునివంశంబు తెఱఁగు వర్ణింతు
గురుతర మైనట్టి కొచ్చెర్లకోట
వరమంత్రి యమరాఖ్య వనితలక్ష్మమ్మ
కును నుదయించెను గోత్రవర్ధనుఁడు
ఘనుఁడు మాధవమంత్రి గంభీరఘనుఁడు
అతనికి సతి తిర్మలమ్మ యనంగ
వితత విఖ్యాతిచే విలసిల్లి రెలమి
నావధూవరులకు నాత్మజుఁ డైన
కేవలపుణ్యుండు కేసప్రధాని
కతనికి భార్య తిప్పమ్మయనంగ

శ్రీపతి పదపద్మ సేవాధురీణు
తనరంగ నాచంద్రతారార్కముగను
ఘనముగఁ బెండ్లిసుంకములు మాన్పించి
వినుతికెక్కినకీర్తివిజయుం డనంగ
నెఱ్ఱమహాపాత్రు డెలమి జన్మించె

* * *

అతనికి గోపమ్మయనుసాధ్వి చెలఁగె
ఆదంపతులకును నధికవిక్రముఁడు

* * *

సర్వజ్ఞగుణుఁడు కృష్ణామహాపాత్రు
జనియించె సంపూర్ణచంద్రునిమాడ్కి
నొనరంగ నతనికి నుత్తమాంగనయు
ననుపమగుణశీల యమ్మమాంబనఁగ
నిరువుర కుదయించిరీప్సితమతిని
బరగంగ నెఱ్ఱయపాత్రుఁ డనంగఁ
బ్రేమంబు మీఱంగఁ బాపమంత్రియును
నమితసుందరుఁ డెల్లనార్యుండు దనరె
సరసమూర్తి విలాసచతురుఁ డైనట్టి
వరయశోధనుఁడు గుర్వయమంత్రిఘనుఁడు
నలుగురుగలిగిరి సవగుణోజ్జ్వలులు
ధీగౌరవంబు వర్తిల్లినయట్టి
యాగుర్వమంత్రికి నతిపుణ్యశీల
కొండమాంబ యనంగఁ గోమసువహించె
యాయిద్దఱకుఁ గూర్మియైన నందనుఁడు
ధీయుతగుణుఁడు మంత్రియుగంధరుండు

* * *

ఆరూఢిరాయ సింహాసనంబైన
విలసితం బగుకొండవీటికి గలుగు
స్థలకరణంబును సజ్జనగుణుఁడు
శ్రీవెంకటేశ్వరాంచిత వరలబ్ధ
పావనశీలుఁడు పరగ జన్మించి
వేంకటమంత్రి ప్రావీణ్యంబు మెఱసి

కొండవీఁడు గజపతిరాజుల పరిపాలనములో నున్నప్పు డీ వంశము వారికి పాత్రిఁ డనుబిరుదుశబ్దము నామాంతమునఁ జేర్చుచువచ్చి నట్లు కన్పట్టుచున్నది. కొండవీటి దుర్గము కృష్ణదేవరాయల స్వాధీన మైనపిమ్మట యీగ్రంథరచనము చేయఁబడినట్లు "ఆరూఢిరాయ సింహాసనంబైన" యను ద్విపద వలనఁ దెలియుచున్నది.

కవి నివాసము బెజవాడవద్దనున్న కొండపల్లి. అచ్చటనుండి వచ్చి కొండవీడుననున్న కృతిప్రేరకునియొద్దఁ గవి గౌరవముగ నివసించిన ట్లూహింపఁదగియున్నది. కవికాలము పదునాఱవశతాబ్ది యం దుత్తరార్థమై యుండునని తోఁచుచున్నది.

ఈకవి కవిత్వము మృదుపదసంయుతమై మంచిధార కలిగి సుబోధకముగ నున్నది.



# 301. దిట్టకవి వెంకటామాత్యకవి

ఇతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కాశ్యపగోత్రుఁడు; ఈతని యింటిపేరు మొట్టమొదట వెణుతురుపల్లి వారైయున్నను, నీతని పితామహుఁ డగు వెంకటామాత్యకవి కవిత్వమునదిట్టయై, దిట్టకవియనిబిరుదునందియుండుటచే నప్పటినుండియు దిట్టకవియను గృహనామ మేర్పడినది. ఈకవితండ్రి యైనవిశ్వనాథకవి పెద్దాపురసంస్థానస్థాపకుఁ డైన వత్సవాయ చతుర్భుజ తిమ్మజగపతి మహారాజునకు శేషధర్మమును గృతియొసంగిన మ హా క వి. ఆతని చరిత్రము నింతకుముందు వ్రాసియున్నాఁడను. (పుట 156)

ఈ వెంకటామాత్యకవి విష్ణుపురాణాద్యనేక ప్రబంధములు రచియించినవాఁడఁట. ఈతనిగ్రంథ మొక్కటియు నిపుడు లభింపక పోవుట విచారకరమైనవిషయము. ఏనుఁగులక్ష్మకవికీతఁడు మేనమామ కొడుకు. ఈదులపల్లి భవానీశకవి యీకవికి శిష్యుఁడు. భవానీశకవి రచించిన యీక్రింది పద్యములవలన నీతఁడు సహజపాండిత్యప్రకర్షకలవాఁడనియు, బహుగ్రంథనిర్మాత యనియుఁ దెలియుచున్నది.

సీ. కొంచెపు............మనోభయంకరు
  గెలిచె విద్యావాదవిలసనమున
సద్గురుకృపకల్మిఁ జదువకయే సర్వ
  శాస్త్రపాండిత్యంబు సంగ్రహించె
నయమొప్పఁ బిన్నటనాటనుండియు నాంధ్ర
  గీర్వాణభాషలఁ గృతు లొనర్చెఁ
బ్రౌఢి శ్రీవిష్ణుపురాణాదికములు సు
  ధీవినుతంబుగఁ దెనుఁగుఁ జేసె

నతనివర్ణింతు సేతుకాశ్యంతరాళ
సూరితరనుత చాతుర్య మేరు ధైర్య
లలిత వెణుతురుపలి కులకలశజలధి
సూర్య మోహన వెంకటసుకవివర్య.

—శృంగారమంజరి.

ఉ. శ్రీనుయవాగ్విలాసుఁడు నశేషలిపిప్రవణుండు భూరిశో
భామహనీయమూర్తియుఁ బ్రబంధనిబంధనబంధుర క్రియా
భామహతుల్యసూత్రుఁడు నృపాలకపూజ్యుఁడు నంచు దన్ జను
ల్వేమరు నెంచ దిట్టకవి వేంకటరాయకవీంద్రుఁ డొప్పగున్.

చ. అతని కృపాకటాక్షవిభవాతిశయం బనిశంబు గల్గ నే
నతులకవిత్వతత్త్వమహిమాఢ్యతఁ బ్రౌఢిమఁ గంటిఁ గావునం
గృతమతిచేఁ బ్రబంధ మొనరించుతలంపును స్వప్నముఁగ సమం
చితగతి నమ్మహాత్మునకుఁ జేతులు మోడ్చుచు విన్నవించితిన్.

చ. లలితనవీనతాండవవిలాస విశేషకపర్ద భృజ్జటా
వలయసరిద్ఘటంఘుళరవప్రతిప్రతిభా సమానవా
గ్విలసనశాలియైన యలవేంకటరాయకవీంద్రచంద్రు నే
నలరినుతించి మ్రొక్కుచుఁ దదాజ్ఞఁ బ్రబంధము సేయఁబూనితిన్.

—"ధర్మఖండము"

"దిట్టకవి విశ్వనాథుఁ బ్రార్థించి కొల్తు
నతనినందనుఁ డగు వేంకటాద్రికవికి
వాక్యపూజలుగావింతు...

— ఏనుఁగులక్ష్మణకవి రామవిలాసము.

ఈకవి నివాసము గోదావరిమండలమందలి ద్రాక్షారామము. ఇతఁడు క్రీ. శ. ౧౬౧౦ సంవత్సరప్రాంతమున జన్మించి ౧౬౮౦ వ సంవత్సరప్రాంతమువఱకు జీవించియున్నట్లు కనఁబడుచున్నది.

సీ. మత్పితామహుఁ మేనమామ వెణ్ణురుబల్లి
విశ్వనాథకవీంద్రవిపుల యశుని

నతని తపఃఫలంబనఁగ జన్మించిన
విద్యావిశారదు వేంకటాద్రి

*   *   *

*   *

గీ. మఱియుఁ బ్రార్థింతు నమస్కరింతు

—ఏనుఁగులక్ష్మణకవి జాహ్నవీమాహాత్మ్యము

కూచిమంచితిమ్మకవి తనసర్వలక్షణ సారసంగ్రహమున శకట రేఫప్రకరణంబున నీకవినిగూర్చి యిట్లు వ్రాసియున్నాఁడు.

ఆ. పదము మొదల నిడుదఁ దుదిఁ దద్భవంబుల
రేఫగాని శకట రేఫగాదు
నిక్కమనుచు సుగుణనిధి దిట్టకవి వేంక
టార్యవరుఁడు పలికె... ...

దీనినిబట్టి యీతఁడేదో లక్షణగ్రంథమును రచియించి యున్నాఁడనుట స్పష్టము.



# 302. లింగనమఖి శ్రీకామేశ్వరకవి



ఇతఁడు రుక్మిణీపరిణయము, సత్యభామాసాంత్వనము నను రెండు శృంగారప్రబంధములను రచియించి పాండ్యమండలాధీశ్వరుఁడైన ముద్దళ్ళగిరి ప్రభువున కంకితము చేసెను. రుక్మిణీపరిణయ మిప్పు డెచ్చటను గానరాదు. సత్యభామాసాంత్వనమందలి కొన్ని యాశ్వాసాంతగద్యలలో "వెంగనామాత్యవంశపావన" యనియుఁ గొన్ని యాశ్వాసాంత్యగద్యలలో "వెంగనామాత్యలింగనమఖివంశపావన" యనియుఁ జెప్పఁబడియున్నది. దీనినిబట్టి చూడఁగా 'లింగనమఖి' యనునది గృహనామము కాదనియు, నీతని తాత లింగనసోమ

యాజియనియు, ముత్తాత వేంగనామాత్యుఁ డనియుఁ దోఁచుచున్నది. ఈతనితండ్రి నాగరాజకవి. తల్లి కామాక్షమ్మ. సత్యభామాసాంత్వనగ్రంథాంతగద్య నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

"ఇది శ్రీకాళహస్తీశ్వరచరణారవింద మిళిందాయమానాంతరంగ జ్ఞాన ప్రసూనాంబికా కృపావలంబ విజృంభమాణ సారసారస్వత సుధాతరంగ వెంగనామాత్య లింగనమఖివంశపావన విరచిత విద్యాధిదేవతా సంభావన దక్షిణసింహాసనాధ్యక్ష తిరుమలక్షమాకాంత కరుణాకటాక్షలక్షిత స్వచ్ఛముక్తాగుళుచ్ఛ సితచ్ఛత్రచామర కళాచికాకనకాందోళికాది రాజోపచారధీరజనహృదయరంజక వచోవిహార వల్లకీవాదన ధురీణవర్ణగీతాది గాంధర్వస్వర నవీనకల్పనాప్రవీణ కామాక్ష్యంబికా నాగనకవిరాజనందన కలితసకలబాంధవహృదయానందన సుకవిజనవిధేయ శ్రీకామేశ్వరనామధేయ ప్రణీతంబైన సత్యభామాసాంత్వనం బనుమహాప్రబంధంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము."

కృతిపతియైన ముద్దళ్ఘరిప్రభువు తనతోననిన వాక్యముల నీక్రింది పద్యములలోఁ గవి రచియించియున్నాఁడు.

చ. అనువుగ రుక్మిణీపరిణయంబును మున్ రచియించి యార్యులౌ
ననఁ దనియించినావు మము నప్రతిమంబుగ నవ్యకావ్య మిం
పున రచియించుమీ సొగసుపోఁడిమిమీఱఁగ సత్యభామసాం
త్వనమనఁ గప్పురంపుచలువన్ గెలువన్ దిరుకామసత్కవీ!

క. కాకులవలె నింటింటను
కాకవులున్నారు హంసకైవడి భువిలో
శ్రీకామ నీకెతగురా
యేకడ నుడి పాలునీరు నేర్పఱుగంగన్.

క. ఏభాషనైనఁ గృతిపతి
శోభనములఁ జెందు నీదుసూక్తులవలనన్

నీభాగ్య మసదృశము గా
రీభవ కరుణానివేశ శ్రీకామేశా!

ఈతఁడు రచియించిన రుక్మిణీపరిణయ మిప్పు డెచ్చటను గానవచ్చుటలేదు. ఈకవి "ధేనుమాహాత్మ్య" మనునొక వచన కావ్యమును రచియించినట్లు గన్పట్టుచున్నది. ఇందు గోవులయొక్క గొప్పఁదనము వర్ణింపఁబడినది. దీనియముద్రితప్రతి తంజావూరు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములో నున్నది.

సత్యభామాసాంత్వనము నాల్గాశ్వాసముల శృంగార ప్రబంధము. పదునాఱవ పదునేడవ శతాబ్దములలో కేవలదక్షిణదేశస్థము లయిన తంజావూరు, మధుర, పుదుకోట సంస్థానాధిపతుల ప్రేరణమున ననేకకావ్యములాంధ్రభాషలో బయలువెడలినవి. మధురసంస్థానాధిపతులయాదరణమువడసిన వానిలో నిది మొదటిదియని చెప్పవచ్చును. శ్రీకృష్ణుఁడు సత్యభామతోఁగూడ నేఁగి నరకాసురుని వధించినకథ భాగవతమునుండి గ్రహించి వర్ణనాంశములతోఁ బెంచి కామేశ్వరకవి యీశృంగార ప్రబంధమును రచియించినాఁడు. శ్రీకృష్ణుఁడు నరకాసురవధార్థమై వెడలినప్పుడు తానుగూడ వచ్చెదనని సత్యభామకోరినను శ్రీకృష్ణుఁడు తీసికొనిపోలేదు. నరకాసురుని పట్టణముఁ జేరినపిమ్మట శ్రీకృష్ణునకు సత్యభామావియోగమువలన విరహ మెక్కువయైనది. సత్యభామ ద్వారకయందు నట్టిబాధనే యనుభవించి తననుగూడఁ దీసికొనిపొమ్మని చిలుకను శ్రీకృష్ణున కడకంపినది. శ్రీకృష్ణుఁడు ప్రద్యుమ్ననంపి సత్యను రప్పించుకొనినాఁడు. మన్మథోపాలంభనాది ప్రబంధవర్ణనావకాశముకొఱకై కాఁబోలు కవి యితివృత్తమున నీమార్పు గావించినాఁడు. ఈవిరహబాధా వర్ణనమునఁ గవి శృంగారరసముతో పాఠకహృదయముల ముంచెత్తినాఁడు. ఇతనికవిత్వము సరసమై మృదుపదసంయుతమై ద్రాక్షాపాకమున మనోహరముగా నున్నది.

ఈకృతి సంకితమందినవాఁడు మధురనాయకరాజులలో నొకఁడగుముద్దళఘురి నాయకుఁడు. ఈతనినిగూర్చి తెలిసికొనుటకు ముందు మధురనాయకరాజులనుగూర్చి తెలిసికొనవలసియున్నది. మధురాపట్టణము రాజధానిగా నున్న దేశమును మధురరాజ్యమందురు. ఇందు నేఁడు మధురమండలముగానున్న ప్రదేశమును దానిపరిసరములనున్న కొన్నిప్రదేశములును గలిసి, పూర్వము పాండ్యదేశ మనుపేరఁ బిలువఁబడుచుండెడిది.

దీనిచెంతనే చోళరాజ్యమొకటియున్నది. దానికిఁ బ్రధాననగరము తంజావూరు. తంజావూరు మండలమును దానిచుట్టుపక్కల ప్రదేశములును నా రాజ్యములోఁ జేరియుండెడివి. ఈచోళపాండ్యరాజులు తొలుదొలుత స్వతంత్రులైనను విజయనగరరాజ్యము ప్రబలినపిమ్మట నీయిరువురును విజయనగర రాజులకు సామంతులుగా నుండిరి. శ్రీకృష్ణదేవరాయలకాలములో తంజావూరును వీరశేఖరచోళరాజును, మధురను చంద్రశేఖరపాండ్యుఁడును బాలించుచుండిరి. వీరశేఖరుఁడు బలీయుఁడై చంద్రశేఖరునిగెలిచి మధురరాజ్యమును తంజావూరురాజ్యమునఁ గలుపుకొనెను. చంద్రశేఖరుఁడు శ్రీకృష్ణదేవరాయలయొద్దకువచ్చి వీరశేఖరుఁ డొనర్చిన యక్రమమును దెలిపి తనరాజ్యమును దన కిప్పింపుమని వేఁడుకొనిన శ్రీకృష్ణదేవరాయలు తనదండనాయకులలో నొకఁడగు నాగమనాయకుని బిలిచి, "నీవునీసేనతో తంజావూరునకేగి వీరశేఖరచోళరాజును జయించి, మధురరాజ్యమును చంద్రశేఖరున కిప్పింపుమని యుత్తరువు చేసెను. ఈతఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడైన దండనాయకుఁడు. నాగమనాయకుని పూర్వులవృత్తాంతమేమియుఁ దెలియదు. సత్యభామాసాంత్వనమునఁ జెప్పఁబడినరీతిగా నీవంశావళి నిక్రింద నిచ్చుచున్నాడను.




తంజావూరురాజును జయించునిమిత్తము కృష్ణరాయలచే నియమింపఁబడునాటికి నాగమనాయఁడు వయసుచెల్లినవాఁడు. సాళువనరసింహరాయలయొద్దకూడ నితఁడు దండనాయకుఁడుగా నున్నట్లు శా. శ. ౧౪౦౬ (క్రీ.శ. ౧౪౮౪)లోని యొక శాసనమువలనఁ దెలియుచున్నది.

రాయలయాజ్ఞానుసారముగా నాగమనాయఁడు తంజావూరు రాజును జయించి యారాజ్యమునకును మధుర రాజ్యమునకును దానే ప్రభువై పాలించుచుండెను. అందుపైఁ జంద్రశేఖరపాండ్యుఁడు మరలఁ గృష్ణరాయలయొద్ద కేతెంచి, నాగమనాయఁడు తనరాజ్యమును దన కీయక తంజావూరు మధుర రాజ్యములు రెండిఁటిని దానేయాక్రమించు కొనెనని మనవిచేసికొనెను. అందుపై రాయలు మిగులయాగ్రహము చెంది తనకొలువుననున్న దండనాయకులవంకఁ జూచి, నాగమ నాయనిఁబట్టి తెచ్చువా రీదర్బారునం దెవరేని కలరాయని ప్రశ్నించెను. నాగమనాయని పరాక్రమమునకు భయపడి యెవ్వరును మారుపలుకలేదు. ఆకొలువునందున్న నాగమనాయనికొడు కగువిశ్వనాథనాయకుఁడు లేచి, ప్రభూ! ఏలికసెలవయినచో నే నందులకు సిద్ధముగా నున్నాఁడనని విన్నవించెను. రాయలు మొదట యించుక సంశయించెను. కాని, తుదకాతనికిఁ గొంత సైన్య మిచ్చిపంపెను. విశ్వనాథనాయకుఁడు తండ్రినిజయించి, ప్రాణములతో నాతనినిబట్టు కొనఁగలిగినందులకు భగవంతుని నుతించుచు, నాతనిని దీసికొనివచ్చి రాయలయెదుట నుంచెను. విశ్వనాథుఁ డొనర్చిన కార్యమునకు మెచ్చుకొని, యాతని తండ్రిని దండింపక విడిచిపెట్టెను. ఈసంఘటనమంతయు, క్రీ శ. ౧౫౨౮–౧౫౨౯ లో జరిగినట్లు కనవ్పట్టుచున్నది. చంద్రశేఖరపాండ్యుని యంగీకారముమీఁద విశ్వనాథనాయకుఁడు మధురలోరాజప్రతినిధిగానుండి, చంద్రశేఖరునితరువాత నీతఁడు మధుర రాజ్యమునకు రాజయ్యెను. కృష్ణదేవరాయలకాలములోనే యీతఁడు మధుర రాజ్యమునకు రాజయ్యెనని కొందఱును, అచ్యుతదేవరాయ లీతనిని మధురరాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిగాఁ జేసెననికొందఱును దలంచుచున్నారు. ఏది సత్యమైనను హూణశకము ౧౫౩౫ సంవత్సరములో మధుర రాజ్యమునందు విశ్వనాథనాయకుని శాసనములు గనవ్పట్టుచుండుటచే నంతకుఁ బూర్వమే యీతఁడు మధుర రాజగుట నిశ్చయము.

విజయనగరమున విద్యారణ్యస్వామిచేఁ బ్రతిష్ఠింపఁబడినదుర్గా మహాలక్ష్మీవిగ్రహ మొకటియుండెడిది. విజయనగరపురాజులందఱు నీదేవిని భక్తిశ్రద్ధలతోఁ బూజించుచుండెడివారు. కృష్ణదేవరాయల కాలములో నాణెములపై నీ దుర్గామహాలక్ష్మీరూపమే ముద్రింపఁ బడుచుండెడిదఁట. ఈవిగ్రహమును విశ్వనాథనాయకునకిచ్చివైచి రఁట. శ్రీకృష్ణదేవరాయ లీపనిచేసియుండఁడు. అచ్యుతదేవరాయలే యిచ్చియుండునని యూహింపఁదగియున్నది. ఈ దేవీవిగ్రహము నిచ్చివేయుటయే విజయనగరవినాశమునకు బీజమయ్యెనని యప్పటివారనుకొనిరఁట! ఏమయిననేమి యది మొదలు క్రమక్రమముగా విజయనగరరాజ్యము ధ్వంసమై తుదకు పేరులేకుండఁబోయినది.

ఈదుర్గామహాలక్ష్మీ దానవృత్తాంత మీఁక్రింది పద్యములలో గ్రంథస్థమై యున్నది.

శా. విద్యారణ్యతపోవిపాక విభవావిర్భూతసింహాసన
ప్రోద్యద్దుర్గను భార్గవిన్ విజయలీలోన్నిద్రభద్రార్చనా
హృద్యప్రక్రియ నింటఁ జేస్చకరణిన్ శ్రీవిశ్వనాథుండు చం
చద్యోగంబునఁ జెందెఁ దత్కరుణ హెచ్చన్ శాశ్వతైశ్వర్యముల్
—సత్యభామాసాంత్వనము.

సీ. అచ్యుతరాయ లేయవనీశవరాళికి
నరుదులౌ పలువగబిరుదు లిచ్చె
దక్షిణసింహాసనాక్షీణ సామ్రాజ్య
ధారేయుఁ డయ్యె నేధరణిధవుఁడు
ధనముగా విజయదుర్గను మహాలక్ష్మి
నేధీరుఁడు దెచ్చి ప్రతిష్ఠ సేసె
మధురాపురంబున మహనీయ పాండ్యభూ
మండలం బేలె నేమహీపవరాళి

అతఁడు నృపమాత్రుఁడా! మహాహవజయాంక
భూవరాహాది బిరుదసంభూతకీర్తి
కార్తికీచంద్రధవళిత గగనవాటి
అలఘుఁడగు విశ్వనాథనాయకకిరీటి.

ఈవిశ్వనాథనాయకుఁడు మొదలుగా మధురరాజ్యము క్రమ క్రమముగా నభివృద్ధిచెందినది. పైని గనుపఱచిన వంశవృక్షమునకు స్యూయెల్ పండితుఁ డిచ్చిన వంశవృక్షమునకు నించుకభేద మగుపడు చున్నది. అయినను నాయకప్రభువుల యాస్థానకవిచే నీయఁబడినది. కావున నీవృక్షమే విశ్వాసార్హమయినది.

కృతిపతియైన ముద్దళఘురి ప్రభువు, మధురరాజ్యము నొక్క సంవత్సరముమాత్రమే పాలించెను. కుమారముద్దు వీరభూపతి యనంతరమున చొక్కనాథుఁడే రాజ్యాధిపతియై రాజ్యమును బరిపా లింపుచు నాతఁడు స్త్రీలోలుఁడై తనసవతితమ్ముఁడైన ముద్దళఘురిపై రాజ్యభారమునుంచి తాను కొంతకాలము తిరుచునాపల్లిలో నున్నం దున నాసమయముచూచి యానడిమికాలమున (1676–77) నొక్క సంవత్సరము ముద్దళఘురి స్వతంత్రుఁడుగా రాజునని ప్రకటించుకొని యెను. కాని యింతలో మఱల చొక్కనాథుఁడు వచ్చిరాజ్యమును స్వాధీనపఱ్చుకొనియెను. ముద్దళఘురి తనసవతియన్నగారుండగానే రాజ్యముచేసిన ట్లీక్రిందిపద్యములోఁ గవి చెప్పియున్నాఁడు.”

ఉ. అన్నయుఁ దమ్ములీకరణి నందఱు నొద్దికయై యశోరమల్
చెన్నువహింప రాముకృపఁచేఁ దనుఁ జెందిన రాజ్యసంపద
భ్యున్నతభోగభాగ్యుఁడయి యుర్విని సర్వనృపాలకోటిలో
నెన్నికకెక్కె ముద్దళఘురీందుఁడు తాను మహోన్నతస్థితిన్.

చొక్కనాథుఁడు హూ. శ. ౧౬౬౦ మొదలు ౧౬౮౨ వఱకును మధురరాజ్యమును బాలించియుండెను. ఆతని యనంతర మాతని కుమారుఁడైన రంగకుమారముద్దువీరప్పనాయకుఁడు ప్రభువై ౧౬౮౯

వఱకును రాజ్యమును జేసెను. కావునఁ గృతిపతియైన ముద్దళఘురి పైనచెప్పినశ్లోక సంవత్సరముమాత్రమే రాజుననిపించుకొనినవాఁడుగా నున్నాఁడు.

కామేశ్వరకవి సత్యభామాసాంత్వనమును ౧౬౭౦ ప్రాంతమున రచియించియుండునని యూహింపఁదగియున్నది. చొక్కనాథుఁడు రాజ్యమునకు వచ్చినది మొదలు, తంజావూరు రాజ్యమును జయింపవలయునను నిచ్ఛగలిగియుండి యుద్ధములుచేయుచు వచ్చెను. తుదకు ౧౬౭౩ సంవత్సరమున తంజావూరునకు రాజుగానున్న విజయరాఘవుని నాతనికుమారుఁడైనమన్నారుదేవుని సంహరించి యారాజ్యమును గైకొని యారాజ్యపరిపాలనకుముద్దళఘురిని రాజప్రతినిధిగా నియమించెనని చరిత్రకారులు చెప్పుచున్నారు. ఈయుదంతము సత్యభామాసాంత్వనమునఁ జేర్పఁబడలేదు. చొక్కనాథుని యొక్కయు ముద్దళఘురియొక్కయు, ప్రతాపమును వర్ణించుచు ననేక పద్యములను గవి వ్రాసియున్నాఁడు. గ్రంథవిస్తరభీతిచే వానినిం దుదాహరింపలేదు. ఆపద్యములయందు, తంజావూరు విజయగాథ సూచింపఁబడనైనలేదు. కావున నీగ్రంథరచనమంతకుఁ బూర్వమని యనుకొనవలసివచ్చినది. కృతిపతియైన ముద్దళఘురి గ్రంథరచనము నాటికి మధురాపురమునం దున్నట్లును, "కుంతూరిదుర్గనాయకుండు" నై యున్నట్లును గవి చెప్పియున్నాఁడు. ఈముద్దళఘురినాయకుఁడు తిరుమలరాయనికుమారుఁడని శ్రీ వీరేశలింగముపంతులుగారాంధ్రకవులచారిత్రమున వ్రాసియున్నారు. కాని యదిపొరపాటు. చొక్కనాథుఁడును, కృతిపతియును తిరుమలనాయకుని కుమారులుకారు. మనుమలయియున్నారు.

పైనుదాహరించిన గద్యలోఁగవి, కాళహస్తీశ్వరజ్ఞానప్రసూనాంబికలభక్తుఁడనని చెప్పుటచే, నీతఁడు కాళహస్తియో, లేక తత్పరిసరప్రాంతమో నివాసముగాఁగలవాఁడై రాజాశ్రయముకొఱకు

మధురకేఁగి యచ్చటనివాసమేర్పచుకొని యుండుననితోఁచుచున్నది. కృతిపతికిఁ దాతయైన తిరుమలనాయకునిచేఁ గవి బహుమానమునందినట్లు వైగద్యలోఁ జెప్పుకొనియున్నాఁడు. తిరుమలనాయకుఁడు క్రీ. శ. ౧౬౨౩ మొదలు ౧౬౫౯ వఱకును మధురరాజ్యమును బాలించినవాఁడు. ఇతఁడు మహమ్మదీయులతోఁగలిసి తనపూర్వులకు రాజ్యమొసంగిన కర్ణాటకరాజ్యప్రభు సంతతికిని, దనస్నేహితుఁడైన మైసూరురాజునకును, ద్రోహమొనర్చినవాఁడని చరిత్రకారులనుచున్నారు. ఈతని తరువాత మధురరాజ్యమునకు వచ్చినముద్దువీరభూపతి యీతనికి పట్టమహిషివలనకలిగిన కుమారుఁడు కాఁడనియు నుంపుడుకత్తెకుమారుఁ డనియుఁ గొందఱనుచున్నారు. అది నిజమైనచో, కృతిపతితండ్రియైనకుమారముద్దువీరభూపతి తల్లియలమేలమ్మ తిరుమలనాయకున కుంపుడుకత్తెయని చెప్పవలసివచ్చును. సత్యభామాసాంత్వనమట్లనుట లేదు. ఏదియెట్లయినను, నావిషయవిమర్శన మిట యప్రస్తుతమని విడచితిని.

కామేశ్వరకవి తిరుమలనాయకుని కాలములో ౧౬౫౦ ప్రాంతమున మధురకేఁగి యాతని నాశ్రయించియుండి కవిత్వము చెప్పుచుఁ దననలుబది — యేఁబదియేండ్లవయసునందు రుక్మిణీపరిణయాదికావ్యములను రచించి తిరుమలనాయకుని మనుమఁడైన ముద్దళఘరికీర్తిని జిరస్థాయిగాఁ జేసెనని మనము నిశ్చయింపవచ్చును.

ఈతనికవిత్వశైలి తెలియుటకై కొన్నిపద్యము లుదాహరించి యీతనిచరిత్రమును ముగించెదను.

శా. ఆకంసాసురవైరి యష్టమహిషీవ్యాపారజాపార లీ
లాకూపార నిమగ్నమానస సముద్యత్కామవిద్యాపరీ
పాకంబుల్మెఱయంగ రంగయినమేల్బంగారపుల్ సజ్జలో
లోకాతీతవిహారుఁడై మదవతుల్గొల్వంగఁ గొల్వుండగన్. ౧౮.

ఉ. ఇంతవిచారమేల విబుధేశ్వర యీపనియెంత ముజ్జగం
బంతయు నీదుకోపమునకాఁగునె తమ్ముని మీఁది కూర్మిచే
నింతయుఁ బల్కితీవసుర మెచ్చటికేఁగిన నెందుడాఁగినన్
దుంతవయాళి రాతుఫ్రురిఁ ద్రోచెదఁ గాచెదలోకమంతయున్ ౨ఆ.

చ. ఉవిదలతోడ మర్త్యుఁడు రణోర్వికిఁబోవుట యెట్లుపోయెనా
బవరముచేయు దానవులపైఁబడిచూపుటయెట్లు చూపెనా
యవిరళబాణజాతముల నంగనఁగాచుటయెట్లు కాకనీ
సవతులు విన్ననెట్లు మఱిశారద పూర్ణనిశాకరాననా ౩ఆ.

చ. అహరహరేధమాన శుభమన్వయవృద్ధికి సాధుబుద్ధికిన్
విహితము ప్రేమభావనకు విశ్రుతకీర్తికి నుల్కపట్టునై
యిహపరసాధకంబగు కుతేందుముఖీసుఖ మెంతవానికిన్
బహుతరజన్మపుణ్యపరిపాకమునన్ ఫలియించు నెంచగన్ ౪ ఆ.

క. ఎల్లరు లోకంబున మగఁ
డొల్లని ప్రోయాలిజముఁడు నొల్లఁడనంగా
నుల్లాసమేది యిటువలెఁ
దెల్లముగాఁ బరువు దప్పితిం జెలులారా! ౫ఆ.



## 303. అంగర నృసింహాకవి



ఈకవినిగూర్చి ఆంధ్రకవులచరిత్రమునం దిట్లు వ్రాయఁబడియున్నది.

"ఇతఁడు రాజరాజాభిషేకమను నైదాశ్వాసముల ప్రబంధమును రచియించి కొప్పుల వల్లభూవరున కంకితముచేసెను. ఈకవి రామకృష్ణభట్టారకుని కుమారుఁడు. ఈకవి యేకాలమువాఁడో

నిశ్చయముగాఁ దెలియరాలేదు. ఇతఁడల్లసాని పెద్దనాదులను జేర్పఁ నక శ్రీనాథుని వఱకుఁగల కవులనుమాత్రమే కవిస్తుతిలోఁ జెప్పియుండుటచేతను, మధ్యకవులు మాత్రమే పేర్కొనఁ చిమ్మపూడి యమరేశ్వరుని సంస్తుతించియుండుటచేతను నృసింహకవి మధ్యకవుల లోనివాఁడేమోయని సందేహము కలుగుచున్నది. ఇతఁడు చేసిన కవిస్తుతి పద్యముల నిందుదాహరించుచున్నాను.

క. భారతఘట్టోల్లంఘన
పారీణ కళాధురీణ బంధురధారా
ధీర ప్రబంధగంధ
ర్వారూఢుని భట్టనన్నపార్యుని దలఁతున్.

ఉ. అంజలిచేతుఁ బద్మజ నిశాంతకరాంత నిరంత రోల్లస
న్మంజుల వల్లకీమధుర మంద్రనినాదసముల్లసధ్వని
వ్యంజక వాఙ్నిగుంభన సమంచిత నూతనసృష్టిచాతురీ
రంజిత సత్కవీంద్రబుధరాజికిఁ దిక్కనసోమయాజికిన్.

ఉ. ఇద్ధగుణుం బ్రబంధపరమేశ్వరు నెఱ్ఱనప్రెగ్గడన్ మనః
పద్ధతినిల్పి సూక్తిరుచిభాస్కరుఁడైన హుళక్కిభాస్కరున్
బుద్ధిఘటించి సంతతముఁ బూని భజింతు వచః ప్రసాద సం
సిద్ధునిఁ జిమ్మపూడికులశేఖరు నయ్యమరేశసత్కవిన్.

క. పాథోధిపయోభర ని
ర్మాథ చలద్ఘుమఘుమాయమానలహరికా
పాథేయదాయిసూక్తి స
నాథున్ శ్రీనాథు నెమ్మనంబునఁ గొలుతున్.

ఈ గ్రంథమొకవేళ మధ్యకవులకాలములోనిదేయైనను దీనియందు లక్షణవిరుద్ధములైన ప్రయోగములు కొన్ని కానఁబడుచుండుటచేత నప్పకవీయాదులు తమలక్షణగ్రంథములలో నిందలి పద్యముల నుదాహరింపకపోయియుండవచ్చును. కృతిపతినిబట్టి సహితము కవియొక్క

కాలనిర్ణయముఁ జేయుటకిప్పు డాధారములు దొరకలేదు. కృతినాయకునకు కొత్తాపురము రాజధానియైన ట్లీక్రిందిపద్యమునఁ జెప్పఁబడినది.

సీ. కుదురయ్యెనే వీటికోటలోపల
వైశ్యసుప్రతిష్ఠితుఁడైన శూలపాణి
పాయలేఁడేవీటి పర్యంతవనవాటి
మిండరాయండు లక్ష్మీధవుండు
నిండారునేవీట నెండకాలమునందు
జలజాకరంబైన సాగరంబు
చనువొందు నేవీట సార్వకాలికఫల
స్ఫురితంబు వేడంగి పోఁకతోఁట
సురపురంబునకైన నబ్బురములగుచు
విఱ్ఱవీఁగుచునుండు నేవీటిసిరులు
వసుమతీపాదపద్మ సందళితరత్న
నూపురంబగునట్టి కొత్తాపురంబు.

ఈకొత్తాపురము విశాఖపట్టణమండలములోని కొట్టాముగ్రామమేమో! ఈపురాధిపతియైన కృతిపతి శూద్రకుల సంజాతుఁడు

సీ. మూర్ధాభిషిక్తుల ముకుటంబులేరాజు
పాదపీఠికకు సోపానపంక్తి
చతురబ్ధివలయితక్షితితలంబేరాజు
బాహుదండమునకు బాహుదండ
భువనంబులేలు కప్పురగంధియేరాజు
లీలాకటాక్షపాళికకునీడ
రజనికాంత జయంతరతికాంతు
లేరాజు రూపరేఖకుఁ బ్రతిరూపకంబు
లతఁడు పట్టుతలాటకేళాదిరాయ
రాజదేవేంద్ర రాజాధిరాజచంద్ర

గాయగోవాళజగనొబ్బగండబిరుద
శాలికొప్పుల వల్లభూపాలమౌళి.

మ. భరియించెం జతురర్ణవీధృత మహాభారంబు దోఃపీఠికన్
విరియించెన్ విమతాంధకారము సముద్వేల ప్రతాపోన్నతిన్
గురియించెన్ ధనధాన్యరాశి కవిరాట్కోటీ నివాసంబులన్
వరియించెన్ వరకీర్తికాంతఁ దనరన్ వల్లక్షితీశుండిలన్.

ఇత్యాదిపద్యములలో బిరుదాంకములతో వర్ణింపబడియుండుటచేతఁ గృతిపతి కవిచెప్పిన ట్లఖండభూమండలాధిపతి కాకపోయినను, చిన్న సంస్థానాధిపతియైన నైనట్టు కనుపట్టుచున్నాఁడు. స్పష్టముగాఁ దెలియ వలనుపడని గవికాలము నిప్పుడు పదునాలువందలయేఁబదికిఁ దఱువాతి కాలమనుకొందము. ఈకవిత్వమునందు లక్షణదోషముల నేకములు కలవు. ఇతఁడు ప్రబంధములోని యీ మొదటి పద్యములోనే వ్రాయుటయనియుండవలసినదానికి వ్రాసుటయని ప్రయోగించినాఁడు.

ఉ. శ్రీసతిచన్నుఁ గ్రేవలను జెక్కులనొక్కటఁ బత్రభంగముల్
వ్రాసుటకున్ విరించి నిటలంబుల నొక్కటఁ భాగ్యవర్ణముల్
వ్రాసుటకున్ జతుర్భుజవిలాసముపూనిన వేల్పు సత్కృపో
ల్లాస మెలర్పఁ బ్రోచుశుభలక్షణుఁ గొప్పులవల్లభూవరున్.

ఇట్లు కొన్నిదోషములు కానఁబడుచున్నను మొత్తముమీఁదఁ గవిత్వము రసవంతముగానేయున్నది. రాజరాజాభిషేకములోని కొన్ని పద్యములిం దుదాహరింపఁబడుచున్నవి.

చ. పనివడి చెప్పనేల శిశుపాలుని విక్రమచేష్టితంబులా
తని పనిపూని దానవపదాతులు వచ్చిరిపీరెవారెయం
చనిశము తెప్పవెట్టక సురావళి దిక్కులుచూచుచుండఁగా
ననిమిషనామ మొక్కటియు నర్థము దప్పకయుండె నిప్పుడున్.

ఉ. ఆరయవిన్నమాత్రమున నైనను జూచినమాత్ర నైన నె
వ్వారిమనంబులం బ్రణయవాసితమై యనురాగకందళం
బీరికలెత్తఁగారణ మొకించుక లేకయుఁ బూర్వజన్మ సం
స్కారవిశేషమండ్రది వికస్వరమై కొనసాగు నుర్వరన్. ఆ౨.

చ. అమృతసరోవంబుగ హిమాంశుని మూర్తికరంగిలోని చి
హ్నము వికచోత్పల ప్రకరమై చెలువొందిన నందులోన సం
భ్రమమున నీఁదులాడి జడిమంబున నంగములూను నేని యా
హిమమున నించుకేని శమియించునొకో మదనాస్త్రవేదనల్.
ఆ౩.

శా. శుద్ధాంతఃకరణైక యోగ్యమగుచున్ శోభిల్లు నస్మద్వచో
రాద్ధాంతంబిది యిచ్చగింపక వృథాప్రజ్ఞాపరిజ్ఞాన స
న్నద్ధుల్కొందఱు కేవలంబుగ వితండావాదులై తారసం
బద్ధోక్తుల్వచియించిరేని మదమూర్ఖన్వారి ఖండించెదన్. ఆ౪

మ. మహిలో నీకిట మున్న నేము విమతమ్మన్యత్వము ల్బూనుటల్
సహియింపందగునంచు నిప్పుడును విజ్ఞాపింప మాకేటికిన్
గుహనానాటక సూత్రధార! భువినీ క్రోవ్యాడి మాయావిధుల్
బహురూపంబులు పన్నఁగాఁ దిరుగరే బ్రహ్మేంద్రచంద్రా
ద్యులున్ ఆ౫

ఈకవి రచించిన రాజరాజాభిషేకము నాకు లభింపకపోవుటచే నీకవికులము, కాలము నివాసము మొదలగు విషయములనుగూర్చి యేమియు వ్రాయఁజాలకున్నాఁడను. "అంగర" వారు ఆర్వేల నియోగులలోను, మధ్వబ్రాహ్మణులలోను, వైఖానసులలోను కలరు.

# 304. చక్రపురి రాఘవాచార్యుఁడు



ఇతఁడు శ్రీవైష్ణవుఁడు; తిరువెంగళాచార్యపుత్త్రుఁడు; దొడ్డయాచార్యునకుఁ బౌత్త్రుఁడు; కందాళవారు వీరికికులగురువులు. ఈకవి నలచరిత్రమును, విష్ణుపురాణమును ద్విపదకావ్యములుగా రచియించి, ఘటికాచలమందలి శ్రీనరసింహునకుఁ గృతియిచ్చెను. తననుగూర్చి కవి యీక్రింది ద్విపదలను వ్రాసికొనియున్నాఁడు.

నలచరిత్రము:—

"ననుచు వాధూలగోత్రాబ్ధిచంద్రుండు
చిరకీర్తిమంతుఁ డాశ్రితహితోదయుఁడు
కరుణాపయోనిధి కందాడ దొడ్డ
యాచార్యునకు శిష్యుఁడైనట్టి వైష్ణ
వాచారమూర్తి సత్యదయాపరుండు
పొలుపుమీఱిన చక్రిపురి దొడ్డఘనుఁడు
వలనొప్ప నతనికి వరకూర్మితనయుఁ
డకలంకమానసుం డతిసత్వధనుఁడు
సకలకవిత్వ వాచావిశారదుఁడు
దనర నాతనికి విద్యాప్రవీణుండు
జనలోకనుతుఁడు సజ్జనలోకహితుఁడు
తిరువేంగళాచార్య ధీరాగ్రగణ్యుఁ
డరయ నాతనికి నేనాత్మసంభవుఁడ
నమలమానసుఁడ విద్యావిశారదుఁడ
రమణ నేవరకవి రాఘవాహ్వయుఁడ
నరహరిఘటికాద్రి నాథునిపేరఁ
బరువడి నేనాంధ్రభాషలవెలయ

నవనిలోఁ గవిరాజు లైనట్టి సరస
కవుల సత్కృప నాకుఁ గలుగుటఁజేసి
యలరార నీనలాహ్వాయునిచరిత్రఁ
దలఁచి చెప్పితిని యుత్తరభాగ మెలమి.

ఈకవికాలమును దెలిసికొనుటకుఁ దగిననిర్దిష్టము లగునాధారములు గ్రంథములలో లేవు. కవి తాతయైన దొడ్డయాచార్యుఁడు, కందాళ దొడ్డయాచార్యుని శిష్యుఁడైనట్లు పైనచెప్పిన ద్విపదలలో నున్నది. విష్ణుపురాణమందలి యీక్రింది ద్విపదలలోఁ జెప్పినదొడ్డయాచార్యుఁడును పైదొడ్డయాచార్యుఁడును నొక్కరో భిన్నులోఁ జెప్పఁజాలము.

"సిరులొందు కందాళసింహాసనస్థుఁ
డరయంగ కులగురుం డగుదేశికార్యుఁ
డతికృపాంబుధి యప్పలాచార్యసుతుఁడు
సతతచతుర్వేదశాస్త్రపారగుఁడు
గురురాయచంద్రుండు గురుకులవర్య
గురుసార్వభౌముండు గురుశేఖరుండు
నగుమాకులస్వామి నర్చించి మ్రొక్కి

యనుద్విపదలవలనఁ దెలియుచున్నది. ఈగురువునుబట్టి కవికాల నిర్ణయము చేయుట కవకాశముకలుగునేమో చూడవలసియున్నది. శ్రీమహాభారతారణ్యపర్వమందలి నలచరిత్రము ననుసరించి యైదాశ్వాసములుగా రెండుభాగములలో నీనలచరిత్ర ద్విపదకావ్యము రచియింపఁబడినది.

విష్ణుపురాణము, సంస్కృతవిష్ణుపురాణమున కాంధ్రీకరణము కాదు. వెన్నెలకంటి సూరనార్యాదులు రచించిన యాంధ్రవిష్ణు పురాణముల కనుకరణమునుగాదు. ఇదియొక స్వతంత్రకావ్యము. పూర్వభాగమున ముఖ్యముగా యమలోకవర్ణనమును నాలోకమునకు

వచ్చెడి పాపాత్ములు చేయుపాపములు మొదలగునవి చెప్పఁబడినవి. ఉత్తరభాగమున శ్రీరామానుజుల ప్రభావమును రామానుజమత స్థాపనమును దన్మతమాహాత్మ్యమును వర్ణింపఁబడినవి.

వ్యాకరణదోషములు తఱచుగాఁ గనఁబట్టుచున్నను, నచ్చటచ్చట ఛందోదోషములున్నను శైలి నాతిక్లిష్టమై యింపుగా నున్నది. శైలి తెలియుటకై రెండు గ్రంథములనుండియుఁ గొన్ని ద్విపదల నుదాహరించుచున్నాఁడను.

"నిది యేలనయ్యా! మీకిటువంటిపనులు
కొదుకక చేయమీకూఁతురఁ గాన
నైజరూపముఁ దాల్చి నరులంద తెలుఁగ
రాజిల్లి నను గృపారస మొల్కఁ గాంచి
నాకాధిపతులార! నలునకు నన్ను
వేకూర్చి పెండ్లి గావించి యీవేళఁ
గన్నులారఁగఁ జూచి కరుణతో నలుని
నన్ను దీవించి మన్ననఁ జేసి మీరు
వేంచేయరయ్యా! నా వెఱపెల్ల మాన్పి
యంచు వేఁడిన మెచ్చి యతిదయామతిని
ప్రముదితచిత్తులై బలభేది వహ్ని
జముఁడును వరుణుండు సత్వరంబునను
తమతమరూపముల్ తప్పక తాల్చి
యమరంగఁ గనుపడిరందఱికప్పు
డాలోన నలునినొయ్యనఁ జేరి పుష్ప
మాలిక మెడ వ్రేసె మగువ పొంగుచును

* * *

నప్పుడు దమయంతి యాత్మేశుకడకుఁ
దప్పకవచ్చి యాదహనునిఁ గాంచి

తనపతిపాదపద్మములకు మ్రొక్కి
ఘనభక్తి మీఱంగఁ గరములు మొగిచి
చేరి యగ్నికిఁ బ్రదక్షిణముగా వచ్చి
నారుల కిది ప్రమాణం బని పలికి
యోపావక! మహాత్మ! యో దయాంభోధి!
శ్రీపతిసాక్షిగా జీవితేశునకుఁ
దప్పివాక్కునను జిత్తమునఁ గర్మమున
నొప్పనిపనుల నే నూహించితేని
ప్రాకటంబుగ నన్నుఁ బట్టిదహింపు
లేకున్న నన్నుఁ బాలింపవే యంచుఁ
జెలువైన కలహంస చెంగల్వకొలను
వలనొప్పఁ జొచ్చినవసువునఁ జిచ్చుఁ
జొచ్చిన దివినున్నసురలెల్లఁజూచి
యచ్చుగా మఱి యప్పు డలరులవాన
లందంద గురియింప నప్పుడాయగ్ని
చందమంతయు మాని చల్లనైయుండె.

విష్ణుపురాణము:—

గుణవంతుఁడగు చిత్రగుప్తుని జూచి
గఁణుతించి చెప్పు మీకర్మలుచేయు
ఘనపాతకుల నెల్ల కవిలెలుచూచి
యనవుఁడు దేవ మహాప్రసాదంబు
పలుమారు పలుమారు పరవధూమణుల
బలియుఁడై పట్టె నీపరమపాతకుఁడు
కలిగినవారితోఁ గలహించిపోయి
కండగర్వమున భూకాంతునితోడఁ
గొండెముల్ చెప్పె నీక్రూరవర్తనుఁడు

పలుమారు గోవులఁ బట్టిచంపించి
చెలఁగి బ్రాహ్మణులనే శిక్షించెవీఁడు
*        *        *
చూచితే రామానుజుని మహత్వంబు
భూచక్రమున మహాద్భుతముగా వెలసె
నతని మానవుఁడంచు నాత్మ నెంచకుము
ప్రీతిలేని యిందిరాపతి పాన్పుపైన
భోగీశ్వరునియంశఁ బుట్టినాఁ డనుచు
బాగుగా బ్రజలెల్ల పలుకుచున్నారు

ఈకవి యేపరిసరములవాఁడో తెలియలేదు. "ఇతఁడు దక్షిణ దత్తమండలములందుఁ బ్రచారమున నుండుపదంబుల వాడుటవలనను నీతనియింటిపేరు గలవారును నీతని గురువంశ్యులును బెక్కురుండుట చేతను నీమహాకవి దత్తమండలవాసియగునని యే బుద్ధిమంతుడైనను దప్పక యొప్పికొను"నని నలచరిత్రమునకుఁ బీఠికవ్రాసిన కావ్యతీర్థ జనమంచి వెంకట సుబ్రహ్మణ్యశర్మగారు పీఠికలో నుడివియున్నారు. వీరియూహ సత్యమే కావచ్చును. ఈతని రెండు గ్రంథములును ఘటికాచల నరసింహునకే కృతియిచ్చుటంజేసి యితఁడు తత్పరిసరములవాఁడుఁ గావచ్చును. ఘటికాద్రి చిత్తూరుమండలములోనిది.

ఈతని కాలనిర్ణయము సేయుట కాధారములు లభింపలేదు. ఈకవి తాతయైన దొడ్డయాచార్యుఁడు కందాళం దొడ్డయాచార్యుని శిష్యుఁడని కవి చెప్పియున్నాఁడు. తిరుపతి దేవస్థానమువారు ప్రకటించిన వంశవృక్షములలో నొకదానియందు (Table No 127) దొడ్డయాచార్యుఁ డొకఁడు కన్పించుచున్నాఁడు. అతనిది ఘటికాచలమే. ఆతఁడు క్రీ. శ. ౧౫౧౭లోఁ దిరుపతి వెంకటేశ్వరునకు 2520 పణము లర్పించి శాసనము వ్రాయించెను. ఆతఁడే కవితాతకు గురువైనచో నీకవి పదునాఱవశతాబ్దియం దుత్తరార్థమున నున్నవాఁడని నిశ్చయింపవచ్చును.

ది 21-8-1955 తేదీగల యాంధ్రపత్రికయందు శ్రీ S.V. జోగారావుపండితు లీకవినిగూర్చి వ్రాయుచు మదరాసుప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నున్నవిప్రనారాయణచరిత్రమను యక్షగాన తాళపత్రప్రతి(P.L.13-8-21) కీకవి గ్రంథకర్తయని సహేతుకముగా వ్రాసియున్నారు. అముద్రితగ్రంథపట్టికలోఁ జేర్పవలసిన యొక మహాగ్రంథమునకు గతిని సమకూర్చిపెట్టిన శ్రీ జోగారావుగారి కాంధ్రలోకము కృతజ్ఞత చూపవలసియున్నది.

ఈకవికాలము క్రీ.శ. 1620 ప్రాంతమని బ్రౌనుపండితుడును, 1690 ప్రాంతమని కీ.శే. డాక్టరు చిలుకూరి నారాయణరావుపంతులు గారును వ్రాసియున్నారని శ్రీ జోగారావుగా రావ్యాసమునందుఁ బొందుపరచియున్నారు. ఈ కవికాల విషయమున నింకను బరిశోధనముగావించి నిర్దిష్టముగా నిర్ణయముచేయవలసిన యావశ్యకత కలదు.



## 305. నిమ్మల లక్ష్మణార్యుఁడు



ఈకవి బ్రాహ్మణుఁడు; కౌండిన్యగోత్రుఁడు; వెంకటార్యునకును లక్ష్మాంబకును గుమారుఁడు, ఇతఁడు శైవుఁడైయుండునని శతక కవుల చరిత్రకారులు వ్రాసియున్నారు. కానియందులకాధారము లేదు.

ఈకవి కంచియేకామ్రనాథుని స్తుతించుచు నేకామ్రలింగ శతకమునురచియించెను. ఇదిప్రతిపద్యమునకును "విషమశరభంగ శరభాంగ వృషతురంగ। యోగిహృత్సంగ బాలచంద్రోత్తమాంగ। యంచికార్థాంగ కంచి యేకామ్రలింగ॥" అను గీతాపాదత్రయమకు

టముతోనున్న సీసశతకము. ఈక్రింది శతకాంతపద్యములో కవి తననుగూర్చి చెప్పుకొనియున్నాఁడు.

సీ. అతివేడ్క శతకమేకామ్రేశ నీపేరఁ
జేసి తానర్పించెఁ జిత్తమలర
గురుతరకౌండిన్యగోత్రపావనుఁడైన
యవని నిమ్మలవేంకటార్య సుతుఁడు
ఘనుఁడు తాలమ్మాంబ గర్భాబ్ధిచంద్రుండు
లక్షణవరకవి లక్షణార్యుఁ
డదివిన్న వ్రాసినతిభక్తిఁ జదివిన
జనులకు నిహపరసౌఖ్యమొదవు
తమకృపాదృష్టి సకలసంపదలుగల్గు
మోదమలరంగ ముక్తికి మూలమగును... విషమ...

ఈ క్రింది పద్యముల సంస్కృతాంధ్రకవులను గలియఁ గలిపి వర్ణించియున్నాఁడు.

సీ. వ్యాసవాల్మీకుల వర్ణించి యాకాళి
దాసుల నెమ్మదిఁదలఁచి యెన్న
వరుసఁ దిక్కనమంత్రి నధిపులఁగొనియాడి
భీమ వేమానంత బిరుదకవుల
బడచార్య పెద్దన్న బాణయాజినదేవ
సత్కవీంద్రులనెల్ల సన్నుతించి
నేనేర్చువిధమున నీయంకితమ్ముగాఁ
జెప్పెద శతకంబు చిత్తగింపు
పరమపావనచారిత్ర ఫాలనేత్ర... విషమ...

మొగలాయిలచే హిందువులకు బాధకలుగుటనుజూచి, వ్యాజస్తుతిగా నీశతకమును గవిరచించినట్లీ క్రింది పద్యమువలనఁ గన్పట్టు చున్నది.

సీ. మొగలాయిదెబ్బకే ముగిసెనీపను లెల్ల
తగఁబార్థుదెబ్బకుఁ దాళితెట్లు
జడియక త్రిపురాల సంహరించిన నీవు
పగతురకలఁజూచి పారితెట్లు
నేఁడు విప్రులబాధ నిర్దయించిననీవు
గరిమతో భక్తులఁగాచితెట్లు
భువనంబు నశియింపఁ బ్రోవలేవైతివి
కొంచక జగముసృష్టించితెట్లు
పుడమినానాఁట నీ సత్యముడిగెనేమొ ... విషమ ...

ఈకవి నివాసము కంచి ప్రాంతమైయుండును. పూర్వకవులలో, నలసాని పెద్దనను స్తుతించియుండుటచేత నీతఁడు పదునేడవ శతాబ్దివాఁడై యుండునని తోఁచుచున్నది ... ఈతని కవిత్వము ప్రౌఢముగాలేదు. వ్యాకరణ దోషములు పెక్కుగానవచ్చుచున్నవి. ఉదాహృతపద్యములు చాలునని యెంచి, శైలిచూపుటకై వేఱు పద్యముల నీయలేదు.



## 306. చింతలపల్లి గోపాలమంత్రి

—*—

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; ఆశ్వలాయనసూత్రుఁడు; వసిష్ఠగోత్రుఁడు; వీరరాఘవునకును నరసమాంబకును బుత్త్రుఁడు; మూర్తిరామాంబలకుఁ బౌత్త్రుఁడు; వెంకటజోగి ఎల్లమాంబలకుఁ బ్రపౌత్త్రుఁడు.

మధురవాణీవిలాసమును రచించిన చింతలపల్లి వీరరాఘవకవి కీతఁడు పెదతండ్రి. ఈతఁడు ఆర్యాశతకమును రచించినట్లు వీరరా

ఘవకవి మధురవాణీవిలాసమునం దీ క్రింది పద్యములోఁ జెప్పి యున్నాఁడు.

"వ. అందగ్రజుండు సమస్తగుణాలంకారుఁ డతండు.

మ. విలసత్పాండితిఁ గల్పనాగతి జగద్విఖ్యాతుఁడై జాములో
పల నార్యాశతకంబు వజ్రగిరి గోపాలాంకితం బూహచే
సిలలిన్ దివ్యసుమాంబరాభరణముల్ శ్రీమించఁ జేకొన్న యో
గ్యులమేటిన్ గవిరాజునెన్నఁ దరమే గోపాలవిద్వన్మణిన్."

ఈతని యార్యాశతకమిప్పుడు గానవచ్చుటలేదు. ఈతఁడు గంగాపురవాస్తవ్యుఁడనియు 3౫౦ ఏండ్లకిందట నున్నవాఁడనియు, గద్వాల జటప్రోలు సంస్థానములలోఁ జేరొందినవాఁడనియు గోలకొండకవుల సంచికలో వ్రాసియున్నారు. మధురవాణీవిలాసమును రచించిన వీరరాఘవకవి క్రీ.శ. ౧౬౬౦ సంవత్సరప్రాంతమువాఁడని యాతని చారిత్రమున వ్రాసియున్నాఁడను. కావున నాతనికిఁ బెదతండ్రియైన యీగోపాలమంత్రి ౧౬౩౦ ప్రాంతమున నుండియుండు నని చెప్పవచ్చును. పైపద్యమునఁ జెప్పబడిన వజ్రగిరి యెక్కడిదో యిప్పుడేపేరున నున్నదో తెలియదు. ఈకవినిగూర్చి యింకనేమియుఁ దెలియదు.



# 307. చింతలపల్లి వీరరాఘవకవి

—*—

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆశ్వలాయనసూత్రుఁడు; వసిష్ఠగోత్రుఁడు; వెంకటార్యునకును లక్ష్మమ్మకును బుత్త్రుఁడు; వీరరాఘవ పౌత్త్రుఁడు.

ఈకవి మధురవాణీవిలాస మను ప్రబంధమును రచియించి శ్రీ వెంకటేశ్వరున కంకితము చేసెను. అయిదాశ్వాసములవఱకును గల యీగ్రంథముయొక్క యముద్రితప్రతియొకటి మదరాసుప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నున్నది. గ్రంథము మొత్తమెన్నియాశ్వాసములు కలదియో తెలియదు. పాంచాలరాజును వర్ధమానపుర నివాసియునునగు విక్రమశాలి యనుమహారాజుకుమార్తె మధుర వాణిని గార్తవీర్యార్జునచక్రవర్తి పరిణయమాడినకథ యిందు వర్ణితమయినది. కవితనుగూర్చి చెప్పుకొనిన పద్యము నిందు క్రిందఁ బొందుపఱచుచున్నాఁడను.

శా. సాహిత్యంబుఁ గవిత్వమున్ వివిధశాస్త్రప్రజ్ఞ సత్కర్మతా
సాహిత్యంబును, దత్త్వబోధమును దిక్స్కంధాత్మక జ్యోతిషం
బూహాచాతురి దేవభక్తియును నీకొప్పున్ స్వభావంబులై
యాహా! చింతలపల్లి (వీర) రాఘవకవీ! యాధ్యుండ వీవన్నిటన్

మ. అవధానంబు లనేకము ల్నెఱపి రాజాస్థానముల్ చేరి వా
దవిధిన్ ధీరుఁడవై చతుర్విధకవిత్వప్రౌఢిమల్ చూపి భూ
ధవదత్తద్విపఘోటకాది బహుసత్కారంబు లైకొన్నమి
న్నవు నీకబ్రమె వేంకటేశ్వరుఁడు స్వప్నంబుం బ్రసాదించుటల్.

సీ. జాములో శతకంబు సంధించి కంకణా
దులుగొంటి వలరాయదుర్గమునను
బహుళావధానము ల్వఱపి నాలుగునగల్
తేజనందితి మల్లధీరువల్ల

వాగ్ధాటి సంప్రీత దిగ్ధరాధిపదత్త
వస్తువాహనముల వార్తగంటి
కూపవాపీతటాకోపవను ల్సేసి
స్థిరకీర్తిఁ జెందితి వురుతరముగ
సకలభూపాల సంస్థానశంసనీయ
నిజచతుర్విధకవితాభినేయపాండి
తీసమాఘోకనాపూర్ణ దిక్ప్రదేశ
వీరరాఘవ! నీసరివిప్రులేరి?

ఈపద్యములనుబట్టి యీకవి పండితుఁడును నిరర్గళకవితాధార గలవాఁడైనట్లు కన్పట్టుచున్నాఁడు.

ఈతని పితామహుఁడైన వీరరాఘవుఁడు స్వాధ్యాయవేత్తయై, మల్లయనంతభూపాలునిచే బహుమతుల నందెననియు, సైన్యాధిపతియై యనేక గ్రామముల కధికారిగా నుండెననియు, నీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. ఎవఁడు వేదపరీక్ష లిచ్చి మల్లయనంత
రాజుచేఁ గొనియెఁ జక్రములు వేయు
నెవనికవిత్వంబు వివరించి పూలరం
గపతిరా(జు ని)చ్చెగ్రామపతిగాఁగ
నెవ్వాఁడు రాణువనేలి కైకొనె రాజు
వారిచెంగట దళవాయితనము
నెవ్వాఁడు బహుకాల మేలె నెన్నేని గ్రా
మంబులు రాణువ సంబడముగ

గీ. నట్టిసకలగుణోదీర్ణుఁ డభినుతింపఁ
దగఁడె వీటూటవీనాథ తతకటాక్ష
లబ్ధనైజ ప్రభావైకలాఘువుండు
రాఘవవిధేయుఁ డగు వీరరాఘవుండు

ఇందుఁ జెప్పఁబడిన 'వీక్షాటవి' యిప్పుడు తిరువళ్లూరనుపేరఁ బిలువఁబడుచున్నది. అందు వెలసియున్న వీరరాఘవస్వామి సుప్రసిద్ధదైవము. ఈదేవుని నామమే, యీకవికిని, నాతని తాతకును బెట్టినట్లు కన్పట్టుచున్నది. పైపద్యములోఁ జెప్పఁబడిన మట్లయనంత భూపాలుఁడు కకుత్థ్స విజయప్రబంధమును రచించిన యాతఁడే యయినపక్షమున నీవీరరాఘవపండితుఁడు క్రి. శ. ౧౬౦౦ సంవత్సర ప్రాంతమువాఁడనుట స్పష్టము. మట్లవారిలో ననంతరాజనామధారులు పెక్కురు గలరు. వీరరాఘవపండితు నాదరించిన దేయనంత రాజో తెలియదు. ఈతఁడు క్రి. శ. ౧౬౦౦ సంవత్సరప్రాంతము వాఁడగుట యథార్థమయ్యేనేని మనవీరరాఘవకవి ౧౬౬౦సంవత్సర ప్రాంతమునాఁ డని చెప్పవచ్చును.

ఈకవికిఁ బూర్వుఁడును నేడవతరమువాఁడు నైన యెల్లకవిని గూర్చి వ్రాసియున్నాఁడు.

గీ. ఎల్లకవి యనంగ నుల్లసిల్లుఁ బ్రపంచ
మెల్లఁ దెలియఁ దనరె యెల్లయాఖ్య
కవితమహిమ రాజుఁ గని మెప్పుగనె నగ్ర
హార నిత్యవర్తనాదిధనము.

సీ. ఏధన్యు హరితత్త్వబోధాప్తి కలపుష్ప
గిరి దుర్గ తో డైనవరము సాక్షి
ఏవాగ్మి సుకుమారతావృత్తికిని బినా
కిని చెంత సేవింపుచునికి సాక్షి
ఏమాన్యు నైశ్వర్యసామాన్యతకు రాజ
కృతి శిరోభూషణకృతియు సాక్షి
ఏగ్రంథకారు వంశాగ్రియతకు ఘన
ప్రభుమానితం బైన బ్రతుకుసాక్షి

గీ. అట్టిఘనుఁ డీ కులంబున బుట్టివారి
కలిమి కవితయకా వర మడిగికొనియె
నట్టి చింతలపల్లి వంశాగ్రయాయి
పల్లకిపదస్థుఁడై మించు నెల్లసుకవి.

ఈకవి రచించిన గ్రంథనామములు తెలియరాదు. కృతిశిరో భూషణము గ్రంథనామమువలెఁ గన్పట్టుచున్నది. కాని యది కాదు. అది గ్రంథనామమైనచో దానికిఁ దగనస్థానము పైపద్య మందలి నాల్గవపాదముకాని మూఁడవపాదముకాదు. ఈయెల్లయకవి పుత్త్రు లిరువురును వ్యాకరణతర్కశాస్త్రములయందు గొప్పపండితు లయిన ట్లీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది. ఎల్లయకవి కోరు కొనిన ట్లీ వంశీయులు పండితులును గవులునైయున్నారు.

క. ఆయగ్రజుండు జోగయ
వైయాకరణులకు నవ్యవరరుచియనఁ బోల్
నైయాయికులకు గౌతముఁ
డై యలరున్ వేంకటాఖ్యుఁ డతనియనుజుఁడై

వీరరాఘవకవిపూర్వులు పినాకినీతీరవాసులయినట్లు పైపద్యము వలనఁ దెలియుచున్నది. ఈతనితాత తిరువళ్లూరు వీరరాఘవ స్వామిభక్తుఁ డగుటచే నాతని నివాసము తిరువళ్లూరుగాని తత్ప్రాం తముగాని యై యుండునని యూహింపఁదగియున్నది. ఈతని పెద తండ్రి యైనగోపాలమంత్రియుఁ బినతండ్రి కుమారుఁడైన ఛాయా పతియుఁ గవులై గ్రంథములను రచియించియున్నవారు. వారు నిజాము రాష్ట్రములోని గంగాపురమను గ్రామనివాసులైనట్లు తెలియు చున్నది. వీరరాఘవకవి యత్తవారి నివాసముకూడ గంగాపుర మైనట్లు మధురవాణీవిలాసము నందలి యీక్రింది పద్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

శా. శాండిల్యోజ్జ్వల గోత్రజుండు మిగులన్ శాంతుండు గంగాపురి(రిన్)
కొండుశ్రౌతులు షట్త్రికాష్టకము నొక్కొర్నిన్నమంతుగాంచెమే
ల్నిండక్ రామపయందు వారియెడ నెంతేఁ దల్లికిం బ్రేమయం
దుండుస్థాని సరస్వతీసతిని నిందుద్వాహమై కూర్మిమై

చ. పటుతరభక్తి శేషగిరిభర్త వరంబు పత్రిజ్ఞఁ జెంది వేం
కటరమణాదిపుత్రులను గాంచితి వేంకటశౌరిపట్టివై
స్ఫుటమతి వేంకటప్రభునిఁ బుత్రునిగాఁ గయికొన్నసీయశః
పటిమ శివుండెఱుంగఁ దగుబ్రహ్మవుగావె సరస్వతీసతీ.

దీనినిబట్టి యీతఁడుకూడఁ గొంతకాలము గంగాపురమున నివసించియుండెనని తోఁచుచున్నది.

ఉదాహృతపద్యములనుబట్టి యీతని కవిత్వము ప్రౌఢమై మనోహరముగా నున్నదని చెప్పవచ్చును.



## 308. చింతలపల్లి ఛాయాపతి



ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆశ్వలాయనసూత్రుఁడు; వసిష్ఠగోత్రుఁడు; గోపాలమంత్రిపుత్త్రుడు; వీరరాఘవకవిపౌత్త్రుడు.

ఈకవి రాఘవాభ్యుదయమను నాఱాశ్వాసముల ప్రబంధమును రచించి బోరువెల్లి నివాసుఁడును మిటిమిల్లగోత్రుఁడును నగునాడె గాని వెంకటపతియను నొకపాకనాటిరెడ్డి ప్రోత్సాహముచే నాగ్రామమందలి కేశవస్వామి కంకితముచేసెను.

ఆర్యాశతకమును రచించినగోపాలసూరి యీతనికిఁ దండ్రి. మధురవాణీవిలాసమునురచించిన వీరరాఘవకవి యీతనికి బినతండ్రి కుమారుఁడు. చంద్రాంగదోపాఖ్యాన కృతికర్తయగు సంజీవకవి యీతనికి మఱియొక పినతండ్రి కుమారుఁడు. ఈకవి వంశవృక్షమును వీరరాఘవకవిచారిత్రమున నిచ్చియున్నాఁడను.

కృతిపతి నివాసమైన బోయనెల్లి నిజామురాష్ట్రము లోనిది. రాఘవాభ్యుదయము ఆంధ్రభా భిమానులగు శ్రీసురవరముప్రతాపరెడ్డిగారిచేఁ బ్రకటితమయినది.

ఈతఁడును, వీరరాఘవకవియును, సంజీవకవియును బినతండ్రి పెదతండ్రి బిడ్డలగుటచే సమకాలికులని చెప్పవచ్చును. కావున నీతని కాలము క్రీ. శ. ౧౬౬౦ వ సంవత్సరప్రాంతమని తలంపవలసియున్నది. ఈతని నివాసము నైజామురాష్ట్రిమందలి మహబూబునగరమండలములోని గంగాపురము. ఈకవి ౧౦౦ సంవత్సరములకిందటివాఁడనియు, మధురవాణీవిలాసమును రచించిన వీరరాఘవకవి యీతనితాతయనియు, గోలకొండకవుల సంచికలో వ్రాయఁబడినది. కాని యదిపొరబాటని పైపద్యములవలన స్పష్టమగుచున్నది.

ఈకవికి వ్యాకరణవిద్యాగురువు తిరుమల శ్రీనివాసాచార్యుఁడని యీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

ఉ. తద్ధితమూర్ధుఁడైనను తద్ధితమూర్ధునిఁజేసి వాక్యసం
సిద్ధి ఘటించినట్టి బహుచిత్రితశాస్త్రకలాప ధన్యులన్
ఇద్ధవదాన్య తిర్మలకులేశ్వర మాన్యుల శ్రీనివాస స
ద్బుద్ధిమదగ్రగణ్యులను బుణ్యుల మాన్యుల సన్నుతించెదన్.

"తద్ధితమూర్ధాః పాణినీయాః" అను సూక్తిని గవి యిట్లు చమత్కరించినాఁడు. వ్యాకరణశాస్త్రవిషయములను గొన్నిటిని కావ్యములోఁ బ్రసంగవశముగాఁ జొప్పించి యున్నాఁడు. ఒకటి రెం డుదాహరణములు:—

"అదియునుంగాక నిజిద్ధాతువు లధ్యుపసర్గంబునుం బలె..."
"భవదీయాగమంబు మదీయప్రాణపదంబునకు హితసువి
భక్త్యాగమంబునుం బలెఁ బ్రకృతిరంజనం బానర్చె..."
—తృతీయాశ్వాసము

లభించిన యైదాశ్వాసములలోను అజమహారాజుచరిత్రమే వర్ణితమైనది. పంచమాశ్వాసము రఘుమహారాజు జననముతోఁ బూర్తియైనది. గ్రంథనామము రాఘవాభ్యుదయమైనను నాలుగవయాశ్వాసమునందు మాత్రమే రఘుమహారాజుచారిత్రము చెప్పఁబడియెను.

కాళిదాసు రఘువంశములోని ౪,౫,౬ సర్గలనుండి చాలభాగమాంధ్రీకరించి యీకవి యీ రాఘవాభ్యుదయమునఁ జేర్చికొనియుండెను. మచ్చునకై కాళిదాసు శ్లోకములను నీకవి పద్యములను గొన్నిటి నీక్రింద నిచ్చుచున్నాఁడను.

ఇతఁడు మనుచరిత్రమునందలి పద్యములవంటి పద్యములు కొన్నిరచించినాఁడు. అట్టిదొక్క పద్యము నీక్రింద నిచ్చెదను.

సనిర్విశ్య యథాకామం తటే ష్వాలీనచందనౌ
స్తనావివ దిశా స్తస్యాః శైలౌ మలయదర్దురౌ. రఘు. 4సర్గ. 51

గీ. తటనితాంతవిలీనచందనము లగుచు
తద్దిశాబంధు రస్తనద్వయముఁ బోలి
రూఢి కెక్కినమలయదర్దురములందుఁ
గొంతతడవు సుఖంబుండి యంత వెడలి. 2 ఆశ్వా.

తం కర్ణభూషణ నిపీడితపీవరాంసం
శయ్యోత్తరచ్ఛద విమర్దకృశాంగ రాగం
సూతాత్మజాః సవయసః ప్రథితప్రబోధం
ప్రాబోధయన్ ఉషసి వాగ్భిరుదారవాచః రఘు. 5 సర్గ. 64

ఉ. పేశలకర్ణభూషణనిపీడితపీనతరాంసభాగు సు
శ్రీశయనోత్తరాస్తరణచేల విమర్దకృశాంగరాగు ధా
త్రీశు గురుప్రబోధుని సదృక్షవయస్తుతి పాఠకుల్ విని
శ్వేశు లుదారభూషణులు వేకువ మేల్కొనఁజేసి రల్లనన్. 4 ఆ

రతే ర్గృహీతానునయేన కామం ప్రత్యర్పితస్వాంగ మివేశ్వరేణ
కాకుత్స్థ మాలోకయతాం నృపాణాం మనోబభూ వేందుమతీ
నిరాశమ్ 6 సర్గ. 2

మ. రతిసంప్రార్థితచంద్రశేఖర కృపాప్రత్యర్పితస్వాంగసం
గతుఁడైనట్టి ప్రసూనసాయకుఁ డనఁ గన్పట్టు కాకుత్స్థ భూ
పతి నీక్షించు నరేంద్రచిత్తము విదర్భక్షోణి భృత్కన్యకా
యుతి నిర్వేశనిరాశమై యపగత ప్రోత్సాహ మయ్యెం గడున్.
5 ఆశ్వా.

వింధ్యస్య సంస్తంభయితా మహాద్రేః
నిశ్శేష పీతోజ్ఝిత సింధురాజః
ప్రీత్యాశ్వమేధావ బృధార్ద్రమూర్తేః
సౌస్నాతికో యస్య భవత్యగస్త్యః 6 స॥ 61

ఉ. ఓతరళాక్షి! వింధ్యధరోద్ధత గర్వనిబర్హణుండు ని
ష్పీత సముజ్ఝితాబ్ధియతి విఖ్యాతుఁడగస్త్యమునీంద్రుఁ డీ మహా
ఖ్యాతయశస్వికి న్నవబృధార్ద్రతనుం డగువేళఁ బ్రీతి సౌ
స్నాతికుఁ డయ్యె నట్టిగుణశాలి యితం డవనీశమాత్రుఁడే! 5ఆశ్వా

తాంబూల వల్లీపరిణద్ధపూగా
స్వేలా లతాంగితచందనా సు
తమాలపత్రాస్తరణాసు శశ్వత్
ప్రసీదరంతుం మలయస్థలీషు. 6 సర్గ. 64

బాల! నృపాలుఁడై వెలయు పాండ్యనృపాలునితో రమింపు మే
లాలతికానికాయ పరిరబ్ధస సౌరభగంధసార తాం

బూలలతావితాన పరిపూర్ణ మహోన్నత పూగపూగతా
మాలనవచ్ఛదాస్తరణ మాలయమంజుళ కుంజసీమలన్. 5 అశ్వా

సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ
యం యం వ్యతీయాయ పతింవరా సా
నరేంద్ర మార్గాట్ట ఇవ ప్రపేదే
వివర్ణభావం స స భూమిపాలః 6 సర్గ. 67

ప్రాయస్ఫూర్తి నిశీథినీ సుచర దీపజ్వాలనో లెన్ గహీ౯
ఏయేరాజు నతిక్రమించి చనెనో యిందీవరన్నేత్రి (?) దా
నాయాయిక్షితిపాలమాళి నృపమార్గాట్టస్థితిన్ తోనె వి
చ్ఛాయత్వంబుభజించె ఖేదమదరోషస్ఫూర్తచే తస్కుఁడై.
5 అశ్వా.

కులేన కాంత్యా వయసా నవేన
గుణైశ్చ తైస్తైర్వినయప్రధానైః
త్వమాత్మనస్తుల్యమముం వృణీష్వ
రత్నం సమాగచ్ఛతు కాంచనేన. 6 సర్గ. 79

ఘనవంశోజ్జ్వలకాంతి నూతనవయః కారుణ్యలీలావలో
కన మేధావినయప్రధానగుణ లేఖనాత్మ సంకాశు నీ
యిన సంతానవిధాన రత్నమజుని౯ హేమాంగ! కామింపు, కాం
చనమున్ రత్నయుతంబుఁజేయనగు చంచద్వైఖరి౯ జేకుర౯.
5 అశ్వా.

తయా స్రజా మంగళ పుష్పమయ్యా
విశాలవక్షస్థల లంబయా సః
అమంస్త కంఠార్పిత బాహుపాశాం
విదర్భరాజావరజాం వరేణ్యః

అంగభవోజ్జ్వలాకృతి యహర్పతిగోత్రజుఁడజకుమారుఁడా
రంగదు రస్థలపరిచురరత్నమయోజ్జ్వలహార పీఠికా

మంగళపుష్పరూపమగు మాల్యముచేత విదర్భరాజ సా
రంగసహోదరిన్ దలచె రమ్యగళార్పితబాహుపాశగన్. ౫ ఆ.

మ. అలఘువ్యాకరణైకసూత్రము కుతర్కాక్షేపిన్నై యాయికా
చలవజ్రాయుధమై నిజప్రకృతవాచ్య ప్రత్యయప్రాప్తి ని
ర్మల శబ్దానుగత ప్రమాకరణమై రంజిల్లు సంచున్ బుధుల్
బలుకన్ మాణవకుల్ గ్రహించిసయిరింపం జొప్పడున్ దత్పురిన్
౧ ఆ

ఉ. కాంతలతోడఁ జిత్రరతికల్పనలన్ మదిఁ బొంగి యెంతయున్
వింతగఁ బ్రొద్దు పుచ్చుచు వివిక్తపదంబులఁ గ్రీడసల్పు శై
లాంతరవర్తు లాధ్వనుల కాత్రత నొందిరి దైవయుక్తి నా
గంతుక మైనదుఃఖము సుఖంబు శరీకు లెఱుంగ నేర్తురే. ౨ఆ.

ఉ. యత్రభవత్ భవత్పదయుగా శ్రయణం బొనరించునాగు నో
కత్రియపూజ్యులొ టరుదు గాదు కృతీశితమైన వారిచా
రిత్రి మనంతవర్షసమవృత్తినివా చకరిష్టతాత్రివై
చిత్రి భరించు మీరు దయచేసిన శిష్యులభాగ్య మెంతనన్.
౩ ఆ

ఉ. సారసలక్ష్మి గుత్తఁగొను చక్కనిపాణితలంబు లంజలిం
గా రచియించి చూపులు వగన్ జలపూరమునందు నిల్పి శృం
గారపుకప్పులో యనఁ బ్రకాశ మెసంగు మెఱుంగుచన్నులో
య్యారము గుల్కఁ మొక్కె సతి యాజలదేవతకున్ హితమ్మనన్
౪ ఆ.

ఉ. చెలువుని మోహముం దెలియఁ జెప్పెడినో యన నప్పళించు త
ప్పలవగ గుప్పళించెడి యపాంగవిలక్షనిరీక్షలాగినన్
దళదరవింద వైఖరి నథఃకృతిఁ జేయువిలోచనంబునన్
గలికి యజేశుఁ జూచె రతికాంక్షలు పైపయి రేపుచూపులన్.
౫ ఆ.

చక్కఁదనంబు కీవియును జవ్వనముంగల ప్రాణవల్లభుం
దక్కఁగఁగూర్చి ముద్దుగొని యక్కఱదీరగ గారవింపఁగా
సొక్కిసుఖింపలేని యలసుందరి సోయగమేల నింపుసొం
పెక్కుడు రూపమేల కళలేల విలాసములేల యారయన్. 4ఆశ్వా
చొక్కపుఁ బ్రాయముల్ మిగులసోయగముంగల ప్రాణనాయకుం
డెక్కుడు వశ్యతన్ రతుల యేకటదీర్చి సమేళమొప్పగా
నక్కఁగఁగారవించి ప్రియమందఁగ నోఁచని యింతికైన యా
చక్కఁదనంబదేమిటికి? జవ్వనమేటికి నేర్పులేటికిన్ మను.3 ఆశ్వా7



# 309. చింతలపల్లి సంజీవకవి

—✳—

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆశ్వలాయనసూత్రుఁడు; వసిష్ఠగోత్రుఁడు; అయ్యప్పగిరియమ్మల పుత్త్రుఁడు; వీరరాఘవనరసమాంబలకుఁ బౌత్త్రుఁడు.

ఆర్యాశతకమును రచించిన గోపాలమంత్రి యీతనికిఁ బెదతండ్రి. మధురవాణీవిలాసమును రచించిన వీరరాఘవకవి యీతనికి వేఱొక పెదతండ్రికుమారుఁడు. రాఘవాభ్యుదయమును రచించిన ఛాయాపతి యీతనికి మఱియొక పెదతండ్రికుమారుఁడు. ఈ సంజీవకవి చంద్రాంగదోపాఖ్యానమును రచియించినట్లు వీరరాఘవకవి మధురవాణీవిలాసమునం దీ క్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

మ. చతురుండై యవధానముల్ సలిపి దేశాయీలు మెచ్చన్ మహో
న్నతుఁడయ్యప్పకవీశ్వరుండు గిరియన్నారీ వతంసంబునం
దతివిద్యానిధి సాహితీనిపుణు రాజాస్థానసంపూజ్యు నం
చితవాగ్ధాటిఁ ప్రబంధకర్తఁ గవి సంజీవాఖ్యుఁ బుత్రుంగనెన్.

శా. శ్రీఖ్యాతుల్ కనబోలు మేలుకవి సంజీవుండు చంద్రాంగదో
పాఖ్యానప్రముఖ ప్రబంధములు భూపాలాంకితంబుల్గా జగ
ద్విఖ్యాతంబుగఁ జేసి చెందె శిబికాదివ్యాంగదైకావళీ
ముఖ్యాలంకరణాదు లెన్నఁదరమే! భూమిన్ దదీయప్రభన్.

ఈతఁడును వీరరాఘవకవియును, పినతండ్రి పెదతండ్రి బిడ్డ లగుటచే సమకాలికులని చెప్పవచ్చును. వీరరాఘవకవి క్రీ. శ. ౧౬౬౦ సంవత్సరప్రాంతమువాఁ డని చెప్పియుంటిని కావున నీతఁ డును నాకాలమువాఁ డని తలంపవచ్చును. ఈ సంజీవకవి ౨౦౦ సంవత్సముల క్రిందటివాఁ డనియు నీతఁడు చింతలపల్లి వీరరాఘవ కవికిఁ బూర్వుఁ డనియు గోలకొండకవులసంచికలో వ్రాయబడి యున్నది. కాని పైన వ్రాసినపద్యములనుబట్టి యవి పొరబాటులని యూహింపఁదగియున్నది. ఈసంజీవకవి గద్వాలాది సంస్థానము లలోఁ జేరొందినవాఁడఁట. ఈతఁడు రచించిన చంద్రాంగదో పాఖ్యాన మిప్పు డెచ్చటను గానవచ్చుటలేదు. ఈకవి నివాసము నిజామురాష్ట్రమందలి మహబూబునగరుమండలములోని గంగాపుర మనుగ్రామము.

---

## 310. రోసనూరి వెంకటపతి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; కాశ్యపగోత్రుఁడు; లింగనా మాత్యపౌత్రుఁడు; గంగనమంత్రి పుత్రుఁడు.

ఈకవి విష్ణుమాయావిలాస మను మూఁడాశ్వాసముల ప్రబం ధమును రచించి నెల్లూరిమండలములోని వెంకటగిరి సంస్థానప్రభువగు బంగరుయాచమనాయకప్రభువున కంకితము చేసెను. కృతిపతి తండ్రియైన కుమారేచభూపాలుఁ డీ కవికి "తిక్కయజ్వ"యను బిరు దము నొసంగిన ట్లీ క్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

మ నను శ్రీభూపతిలింగపాదభజనానందుల్ గుమారేచ భూ
జనపాలాగ్రణి "తిక్కయజ్వ" యనుచుం జాలంగఁ బేరిచ్చి పో
చినఁ బెంపొందిన రోసనూరికులుఁడన్ శ్రీ వేంకటాఖ్యుం గృపా
ఘన గంభీర శుభైకదృష్టి వెలయంగాఁ జూచి పల్కెం దగన్.

ఈకవి పెదూరి పెద్దామాత్యకవి నీ గ్రంథమున నీక్రిందిపద్య
ములోఁ గీర్తించియున్నాఁడు.

మ. స్వ వశంబై తగు కాళికా వరకృపాసంపూర్ణతన్ శబ్ద సా
స్త్రవచిత్రార్థ సలక్షణక్రమ నిరూఢప్రక్రియా స్వీతమా
కవితాతత్త్వమహత్త్వము న్సభల వక్కాణించె నేమేటి భ
వ్యవచోమాధురి నాపెదూరికవిఁ బెద్దామాత్యుఁ గీర్తించెదన్.

ఈపెద్దామాత్యునిగూర్చిన వివరములు తెలియవు.

శ్రీమహావిష్ణువు మోహినీరూపమున నీశ్వరుని మోసగించిన
విధ మీ గ్రంథమునఁ జక్కఁగా వర్ణింపబడినది.

వెంకటగిరి సంస్థానాధీశులలో "కుమారయాచ" "బంగారు
యాచ" నామములను వహించిన ప్రభువులు పెక్కురుకలరు. ఈ
వెంకటపతికవి నాదరించినవారు మొదటి కుమారయాచభూపతియు,
మొదటిబంగరు యాచప్రభువునైయున్నారు. ఈ కుమారయాచ
నాయఁడు మైసూరురాజుతో జరిగినయుద్ధమున జయముఁగాంచి ఢిల్లీ
చక్రవర్తిచే బహుమానమందిన ప్రభువు. బంగరుయాచమనాయఁడు
క్రీ.శ. ౧౬౫౮ మొదలు ౧౭౦౭ వఱకు రాజ్యపాలనముచేసినవాఁడు
కావున మనకవియు నాకాలమునం దనఁగా పదునేడవశతాబ్దియం
దుత్తరార్ధప్రారంభమునుండియుఁ గవిత్వముఁ జెప్పగలిగిన వయసునం
దున్నవాఁడనుట నిశ్చయము. ఇతఁడు తండ్రికుమారులగు కుమార
యాచ బంగారుయాచ ప్రభువు లిరువురియొద్దను కవిగా నుండెను.

"రోసనూరు"అను గ్రామము నెల్లూరుమండలమున సుళ్లూరు
పేట తాలూకాయం దున్నది. ఆగ్రామమునుబట్టి కవి గృహనామ

మేర్పడియుండును. కృతినాయకుఁడైన బంగరు యాచమ నాయకప్రభువును 'రోసనూరిభూపతి' యని యీక్రిందిపద్యములోఁ గవి సంబోధించియున్నాఁడు.

క. శ్రీరోసనూరి భూపతి!
గౌరీశదయానులబ్ధ కామితఫల శృం
గార! వెలుగోటికుల బం
గారేచనృపాలచంద్ర! కవనమృగేంద్రా!

దీనినిబట్టి వెంకటగిరిప్రభువుల కా కాలమున నీ రోసనూరు రాజధానీనగరముగనో, ప్రధానపట్టణములలో నొకటిగనో యుండి యుండును.

శ్రీ మహావిష్ణువు మాయామోహినీరూపమున నీశ్వరుని మోసగించిన కథనిందుఁ జక్కఁగాఁ గవి వర్ణించియున్నాఁడు.

ఈకవికాలమునుగూర్చి బ్రి. శ్రీ వీరేశలింగముపంతులుగారు "కృతినాయకుఁడైన బంగరు యాచమనాయుఁడు ఔరంగజేబు ఢిల్లీ చక్రవర్తిగానున్న కాలములో 1695వ సంవత్సరమునందు నెల్లూరి నవాబగు జుల్ఫగారిచేఁ జంపఁబడినందున ఈపుస్తకము 1690 సంవత్సరప్రాంతములయందు రచియింపఁబడినదని చెప్పవచ్చును." అని వ్రాసియున్నారు. ఈతనితండ్రియైన కుమారేచభూపాలుఁడు క్రీ.శ. 1659 వ సంవత్సరములో గోలకొండనవాబునకును మూఁడవ శ్రీరంగ రాయలకును పెనుగొండప్రాంతమున జరిగినయుద్ధములో శ్రీరంగ రాయలపక్షమునఁ బోరాడినట్లు వెలుగోటివారివంశావళి చెప్పుచున్నది. కావున శ్రీపంతులుగారొనర్చిన కాలనిర్ణయ మంగీకరింపఁ దగినది. నాకీ గ్రంథము లభింపలేదు. శ్రీపంతులుగా రుదాహరించిన రెండుపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

చ. ఇటువలె నేమి యాపయన మిప్పుడు మీ రఖిలేశ మాయలన్
బటువగు విష్ణుడం చనెడుపల్కులు సిద్ధము సుందరీక్రియా

కుటిలశిరోజమైన వారి గొబ్బున( జూచితి రేని మీరునా
క్కట( జపలత్వ మైనతటి గౌరవ మెట్లగునో తలంపుడీ.

చ. వనయువతీవసంతుల వివాహమహోత్సవవేళ నెమ్మదిం
దనరుకుతూహలంబున లతాలలన ల్కరపల్లవంబులన్
ఘనముగ సేసవెట్టుటకు(గా ధరియించిన మౌక్తికంబులో
యన విలసిల్లె సెల్లెడ మహాసుకుమారకకోరకావళుల్.

---

## 311. పౌనుగోటి జగన్నాథరాయకవి

ఈకవి పద్మనాయకకులజు(డు; పల్లచెల్ల గోత్రుడు; రాఘవ రాయపుత్త్రు(డు; ఇతని నివాసము దేవాద్రి.

ఈకవి కుముదవల్లీవిలాసమను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి తనగురువయిన సముద్రాలతిరుమలాచార్యునకు( గృతియొసంగెను. ఇతఁడు తననుగూర్చి కృత్యాదియం దిట్లు చెప్పుకొని యున్నా(డు.

సీ. పౌనుగోటి వంశాబ్ధిపూర్ణచంద్రుఁడ పల్ల
చెల్లగోత్రాంకప్రఫుల్లయశుఁడ
దేవాద్రిపట్టణాధిపుఁడ రాఘవరాయ
మనుజరాడప్పలమ్మకు దనయుఁడ
వాధూలగోత్రపావన తిరుమలాచార్య
శేఖర శ్రీపాదసేవకుఁడను
తే.గీ. అశ్వపతి దత్తమత్తేభహయదభూమి
కాధ్వజచ్ఛత్ర చామరకల్పవిభవ
సకలసామ్రాజ్యశాశ్వతైశ్వర్య ధుర్య
రాజవరుఁడ జగన్నాథరాయవిభుఁడ

ఈకవి తనగ్రంథమును గురువైన తిరుమలాచార్యునకే కృతి యిచ్చి యందాతని నీక్రిందిపద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. వాధూలగోత్రపావనుఁడు సముద్రాల
వంశపాథోధి జైవాతృకుండు
అఖిలవేదాంతసారార్థపారాయణుం
డర్థపంచకరహస్యార్థవేది
దుర్మతప్రతివాది మర్మవిభేదనో
ద్యద్వేదభాష్యతర్కాదిచతురుఁ
డరివర్గరహితుండు పరతత్త్వనిష్ఠాగ
రిష్ఠుండు పరమధార్మికగుణుండు
తే.గీ. ఆర్యకందాళ దొడ్డయాచార్యవర్య
సుందరపదారవింద మిళిందహృదయుఁ
డౌబళాచార్య సత్పుత్రుఁడవని వెలసె
సరసగుణశాలి తిరుమలాచార్యమౌళి.

ఈకవివంశమునఁ దొమ్మిదవపురుషుఁడైన పోనుగోటి వెంకటరాయఁడుగా రీగ్రంథమును క్రీ. శ. ౧౯౨౫ వ సంవత్సరమున ముద్రించినట్లు పీఠికలోనుండుటచేసీకవి పదునేడవ శతాబ్దిఁ దుదిభాగముననో పదునెన్మిదవశతాబ్ది ప్రథమపాదముననోయున్నట్లూహింపఁదగియున్నది.

కుముద్వతికలువలో జన్మించినది. ఒకబ్రాహ్మణునకు దొరకినది. ఆమెను పరకాలుఁడను వైష్ణవభక్తుఁడు పరిణయమాడినాఁడు. ఆతఁడు పరాంతకుఁడను రాజునొద్ద యుద్యోగి. రాజుద్రవ్యమంతయు స్వామికార్యములకై వినియోగపరచెను. ఈవిషయము క్రమముగా రాజునకుఁ దెలిసెను. రాజరుదెంచి పరకాలునిసొమ్మునకై నిరోధించెను. పరకాలుఁడు రాజుపైఁ దిరుగఁబడియెను. ఆ యుద్ధములోఁ బరకాలునకే జయముకలిగినది. పరాంతకుఁడు శేదో

పాయము నవలంబించి పరకాలుని తనయొద్దకు రప్పించుకొని యాతని నిర్బంధమునం దుంచెను. ఆతఁడు రాజును బ్రతిమాలి నెలదినములలో సొమ్మిచ్చెదనని రాజసేవకులతోఁగూడ కంచి కరుదెంచి దేవుని బార్థింప భగవంతుఁడే యల్లాడరెడ్డివేషమున నాసొమ్ము రాజసేవకుల కర్పించి విముక్తుఁడయ్యెను. భగవానుని కృపాకటాక్షవిశేషములనుగూర్చిన కథలవంటివే పరకాలునిగూర్చి రెండుమూఁడిందుఁ గలవు.

ఈతనికవిత్వము మృదువై, భక్తిరసపూరితమై హృదయంగమముగానున్నది. ఈతనినివాసమయిన దేవాద్రి నిజామురాష్ట్రములోనిది. ఈతనికవిత్వశైలి తెలియుటకై అయిదాశ్వాసములనుండియు నైదుపద్యముల నిందుదాహరించుచున్నాఁడను.

ఉ॥ ఆనగరంబునం దమృతహస్తు డనందగు వైద్యుఁడుత్తమ
జ్ఞాన పదాగ్రగణ్యుఁ డొకనాఁడు రమేశ గుణానుభూతి నం
భోనిధిఁ జేరు నద్ధవళపుష్కరిణి న్మదిసంతసింపుచుక్
స్నానము సేయఁగాఁ దలఁచి దానమిత ప్రమదంబుసంధిలక్. ౧ఆ.

ఆ. వె. చిలుకచెలిమి, పిల్లి శీలంబు లొగిబక
ధ్యానములును నక్కతక్కుల రయ
మును పరాంతకుండు నను జేయుమచ్చిక
చెప్పుకొనఁగ నేల సిగ్గుచేటు. ౨ ఆ.

మ. అనినం గైరవవల్లి దర్పక ధనుర్జ్యావల్లి కావల్లి యి
ట్లను ప్రాణేశ్వర మీరలిట్లనిన మాటాడంగ నేనెంత దా
నను మీమన్ననగూర్చి యొక్క- పలుకెన్నన్ జూతుమీవంటి పా
వన శీలుర్ కడుచోరవర్తనముల్ వర్తింపఁగా నేరరీ
సున, సంస్తుత్యచరిత్ర మీమనసు దా చోరక్రియల్ గోరెనే ౩ఆ.

చ॥ మిటిమిటి యెండసోకునను మేనొకయించుక కాకఁదేఱనా
కటఁగడుదప్పిచే నతఁడు గాసిలిక్రొవ్విరి తేనె తుంపురుల్

జోటజోటగారు తోఁటకడుచుట్టుగఁ బాతిన యేరుగాంచి యు
చ్చట జలమాని యాత్మభటసంఘముతో శ్రమఁజెందియున్నెడక్
౪ ఆ.

చ॥ అలఘుపరాక్రమ క్రమమహాద్భుతలీలఁ దనర్చునీదు ని
శ్చలతరమైన భక్తికిని సంతసమయ్యెడు నిన్ను నెల్లవా
రలు వినుతింపఁగా నిహపరంబులు కొల్లలుగొంటివారి! నీ
తలచినయట్లఁ జేసెదను ధన్యతనొందె భవచ్చరిత్రముల్ ౫ ఆ.

ఈకవి నివాసము నిజాముఁరాష్ట్రములోని దేవరకొండసీమ యందలి పానుగోడను గ్రామమని గోలకొండకవుల సంచికలో వ్రాయఁబడినది. ఈకవి గురువునకుగురువైన కందాళ దొడ్డయాచార్యుఁడు నలచరిత్ర ద్విపదకావ్యకర్తయగు చక్రపురి రాఘవాచార్యునకును, ఉయ్యాలవాడ నారాయణకవికినిగూడ గురువై యున్నాఁడు.

---

## 312 ఈదులపల్లి భవానీ శంకరకవి.

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భరద్వాజగోత్రుఁడు; నరసామాత్య పౌత్రుఁడు; శంకరమంత్రి యచ్చమాంబల పుత్త్రుఁడు.

ఈకవి శృంగారమంజరి, ధర్మఖండము నను రెండుగ్రంథములు రచియించెను. శృంగారమంజరిని శ్రీశైల మల్లికార్జునస్వామికిఁ గృతియొసంగెను: శాకమూరి శ్రీరంగరాజువద్ద నాస్థానకవిగా నుండిన పర్వతవర్ధనుఁడను కర్ణాటకకవి సంస్కృతమున రచియించిన శృంగారమంజరికిది యాంధ్రీకరణమని భవానీశంకరకవి యీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

శ్లో॥ ప్రాప్తశ్శ్రీక మురీంద్రమాదన సుతశ్శ్రీరంగ పేందోస్సభాం
చంద్రో రుద్రశిరోయథాహారి భుజామధ్యం యథాకౌస్తుభః

శ్రీమన్నందవరాన్వయోఽప్పనసుత శ్రీరంగ మానందనో
యస్తత్పర్వత వర్ధనేన రచితాశ్శృంగార మంజర్యసౌ.

సీ॥ హరియురంబునఁ దిరంబగు కౌస్తుభమువోలె
హరుశిరంబునసుధాకరుఁడువోలె
ధరశాకమూరి మాదనసుత శ్రీరంగ
రాజ సభాస్థలిఁ బ్రబలువాఁడు
స్థిరతరంబగు నందవరపురాన్వయుఁడప్ప
యకు రంగమాంబకు నాత్మజాతుఁ
డగయ పర్వతవర్ధనాహ్వాయ సుకవి శృం
గార మంజరియను కావ్యమెలమి
సకల కలుష హరంబుగా సంస్కృతమున
హరిచరిత్రంబు శృంగార సరణిఁజెప్పె
నదియు నేనేర్చు తెఱఁగున నాంధ్ర భాషఁ
గబ్బమిరవుగఁ జేసితిఁ గవులుపొగడ.

క॥ పూర్వము కర్ణాటకుఁడగు
పర్వతవర్ధనుఁడు తత్ప్రబంధమొనర్చెన్
గీర్వాణ భాషనది నే
నుర్విరఁదెలిఁగింతు సుకవు లొగినను నసఁగ౯

మాదనసుతుఁడైన శ్రీరంగరాజెవ్వరో తెలిసినదికాదు. పర్వతవర్ధనుఁడు నందవరీకుఁడైనట్లు పైశ్లోకములో నున్నది. నందవరీకు లాంధ్రులు. కర్ణాటకుఁడని భవానీశంకరకవి యనుట కేమిగారణమో తెలిసినదికాదు.

ఈకవి తనగురువులైన యివటూరి శంభులింగమును, వెలుతురుబల్లి వెంకటకవిని తనసఖుఁడైన వక్కలంక వీరభద్రకవిని యీ క్రిందిపద్యములలో సంస్మరించి యున్నాఁడు.

క॥ అనిశము భక్తిభజించెద
నొనరఁగ నివటూరి కులపయోనిధి హిమధా

మునిసద్గుణ గణమణి ఖా
ముని మునినిభు శంభులింగముఁ గనుమూర్తిన్.

సీ॥ కొంచెపు ... ... మనోభయంకరు
గెలిచె విద్యావాద విలసనమున
సద్గురు కృపకల్మిఁ జదువకయే సర్వ
శాస్త్ర పాండిత్యంబు సంగ్రహించె
నయమొప్పఁ బిన్నటనాఁటనుండియు నాంధ్ర
గీర్వాణభాషలఁ గృతులొనర్చెఁ
బ్రౌఢి శ్రీవిష్ణు పురాణాదికములు సు
ధీవినుతంబుగఁ దెనుఁగుఁజేసె
నతనివర్ణింతు సేతుకాశ్యంతరాళ
సూరితరనుత చాతుర్యమేరు ధైర్య
లలిత వెణుతురుపలికుల కలశజలధి
సూర్యమోహాన వెంకట సుకవివర్యు.

సీ॥ అభియాతిమానవ ప్రభుమకాళి మణిఘృణి
రాజినీరాజిత రాజితాంఘ్రి
నీరేరు హుంద్రైన శ్రీరావు మాధవ
రాయశౌరికి నతిప్రౌఢరీతి
వాసవదత్తాది భాసురకృతు లనే
కములొనరించి తత్కరుణచేత
హారకేయూరాగ్రహార విస్ఫారితు
రంగముల్ రంగు మీఱంగ నంది
సకల సుకవీశ్వరాంభోజ నికరహేళి
యైయలరు వక్కలంకన్వవాయకలశ
జలధి శశివీరభద్రుమత్సఖు నుతించి
తదనుమతిఁ గృతినొనరింతు ముదముతోడ.

ఇందు శృంగార నాయికానాయక లక్షణములు లక్ష్యములతోఁగూడ వర్ణింపఁబడినవి. ఈ గ్రంథము ముద్రితము కాలేదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందొక వ్రాత ప్రతి యున్నది. ఇది యేకాశ్వాసప్రబంధము.

ఈతఁడు రచించిన రెండవగ్రంథమగు ధర్మఖండమునందుఁ గవి తనకు ఈశ్వరుఁడు స్వప్నమునఁ బ్రత్యక్షమై

గీ. "సర్వధర్మకర్మసార సంగ్రహ శోభి
తైన ధర్మఖండ మాంధ్రభాష
నీవు రచనసేయు మీకథ మాపేర
నంకితంబుసేయు మనఘచరిత"

అని యానతిచ్చినట్లును, నాసంగతిని తన గురువైన దిట్టకవి వెంకటరాయకవితోఁ జెప్పఁగా నాతఁడీక్రింది విధమున నాజ్ఞ యిడినట్లును గవి వ్రాసికొనియున్నాఁడు.

సీ. ధాత్రి భారద్వాజగోత్ర పవిత్రుఁడై
సురుచిరాపస్తంబసూత్రుఁ డగుచు
నిరతాన్నదానాభి నిరతుఁడౌ నీదుల
పలినరసామాత్యపౌత్త్రవరుని
సంతతపూజిత శంకరుండగు శంక
రామాత్యమౌళికి నాత్మభవునిఁ
బ్రాజ్ఞుని నచ్చమాంబా గర్భశుక్తి ము
క్తామణి నీశ్వరధ్యాన నిరతు

గీ. భవ్యశృంగార మంజరీ కావ్యరత్న
మాంధ్రభాష నొనర్చిన యనఘచరితు
శంభునిభుఁడగు నివటూరి శంభుశిష్యు
ననుభవానీశ నాముఁ గన్గొనుచుఁబలికె.

క. శ్రీకరమత్కారుణ్యా ర
సాకలనఁ బ్రబంధకర్తనై యటురీతి వి
వీకృతికన్యన్ మోర్వన్
శ్రీకంఠున కర్పణంబుసేయుము నేఁడున్

గీ. అఖిలలోకైక నాయకుండయిన శ్రీగి
రీశ్వరుఁడు మల్లికార్జునుఁ డిందుమౌళి
యిష్టదైవంబుగద నీకు నీప్రబంధ
మంకితముసేయు మీవమ్మహాత్మునకును

క. చెఱకున ఫలముం బసిఁడిం
దఱచుగఁ దావియుఁబటీర తరువునవిరియున్
వఱలినగతి నీకృతికిన్
గఱకంఠుఁడధీశుఁడగుట గౌరవము మహిన్

ఈధర్మఖండము స్కాందపురాణాంతర్గత మనియు, దానిని తానాంధ్రీకరించితిననియుఁ గవి యీక్రింది పద్యములోఁ జెప్పి యున్నాఁడు.

గీ॥ స్కాందమునఁదగు నేఁబదిఖండములను
ధరణిధరములఁ గనక భూధరముకరణి
మేటియై ధర్మఖండంబు మిగులనలరు
నదియు నానేర్చురీతిఁ జెప్పెద ముదమున.

ఈధర్మఖండము తొమ్మిది యాశ్వాసములు కలది. 'ఇందలి ప్రధానమైన యితివృత్తము వాల్మీకిమహర్షి చరిత్రము. ఆ వాల్మీకి కథయే ప్రధానముగా నీగ్రంథమున నీతి, భక్తి, ధర్మ ప్రతిపాదకం బులగు నుపకథలనేకములు ప్రస్తావింపఁబడినవి. ఆ యుపకథలలోఁ గొన్నిటియందు శివకేశవాభేదనిరూపణము మిక్కిలి గాఢముగను యుక్తియుక్తముగను గావింపఁబడినది. మఱియు శివునిఁగాని విష్ణువునిఁ గాని నిందించుట మహాపాపహేతువని చెప్పఁబడినది. సందర్భము

ననుసరించి యిందు పతివ్రతామాహాత్మ్యము, మార్కండేయ హృదయనైర్మల్య పరిశోధన వైచిత్ర్యము, ద్రాక్షారామ పీఠకాపుర క్షేత్ర మహిమాద్యభివర్ణనము, దూర్వాస మహామునీంద్ర విచిత్ర చర్యాకథనము, ప్రహ్లాదగర్వనిర్వాపణకథ, భగవద్గీతాపఠన ప్రభావాభివర్ణనము, నింకను భారత, భాగవత రామాయణాదులలోని కథలనేకములును నాయూచోటులఁ జెప్పఁబడినవి.

ఈధర్మఖండమునకు, విమర్శాదర్శకులగు నడకుదుటి వీరరాజు పంతులుగారు ౮౦ పేజీల పీఠికనువ్రాసి యిందలి గుణదోషములను నిరూపించియున్నారు. ఇకారసంధులు, ద్రుతరహిత షష్ఠీకువర్ణక ప్రయోగములు, మొదలగు కొన్నిదోషములిందుఁ గన్పట్టుచున్నను వీరరాజుపంతులుగా రనినట్లుగా నవి యజ్ఞానకృతములుకాక బహుకవిజనసమ్మతములగుటఁ బ్రయోగార్హములుగాఁ గవితలంచి ప్రయోగించినట్లెంచఁదగియున్నది.

ఈకవి, ఏనుఁగు లక్ష్మణకవి, వక్కలంక వీరభద్రకవి, కూచిమంచి తిమ్మకవి మొదలగువారితో సమకాలికుఁడు. ద్రాక్షారామ నివాసియగు దిట్టకవి వెంకటకవి శిష్యుఁడగుటచే నీ భవానీశకవి గోదావరిమండల వాసుఁడగుట నిశ్చయము. గోదావరి మండలమందలి అమలాపురమునొద్ద యీదరపల్లెయను గ్రామమున్నదనియు. నందీదరపల్లెవారను నియోగిబ్రాహ్మణు లున్నారనియు, వారిది భారద్వాజ గోత్రమనియు, నీభవానీశకవి వారిపూర్వుఁడై యుండు ననియు, పూర్వమాగ్రామము ఈదులపల్లెయేయై యుండి క్రమముగా వర్ణక్రమముమారి, ఈఁదరపల్లె యైనదనియు, గుంటూరు నెల్లూరు మండలములలో 'ఈఁదుల' పూర్వముగాఁగల పల్లెలు, పాలెములు పదివఱకుఁ గలవనియు పూర్వమం దేదియో యొక గ్రామమునుండి భవానీశకవి పూర్వులు గోదావరి మండలమునకు వచ్చి అమలాపురము దగ్గర గ్రామము కట్టు

కొని దానికి దమపూర్వ గ్రామనామమునే పెట్టి యందు వసించి యుండిరనియు, వీరరాజు పంతులుగారు పీఠికలో వ్రాసియున్నారు. ఈయూహలు సరియైనవనియే నాయభిప్రాయము. గోదావరి మండల మందలి బ్రాహ్మణకుటుంబములలోఁ జాలభాగము గుంటూరు నెల్లూరు మండలములనుండి వలసవచ్చినవియే యనుటకుఁ బెక్కు నిదర్శనములున్నవి.

ఈకవి తన కాలమిదియని గ్రంథమునఁ జెప్పి యుండలేదు. కాని యాతనికాలమును నిర్ణయించుటకొక యాధారమున్నది. ఈతని సహాధ్యాయియు, మిత్రుఁడునగు వక్కలంక వీరభద్రకవి, క్రీ. శ. ౧౭౭౯ మొదలు ౧౭౦౮ వఱకును పిఠాపుర సంస్థానమును బరిపాలించిన రావు మాధవరాయప్రభువునకు వాసవదత్తాపరిణయమును గృతి నొసంగిన వాఁడగుటచే నీకవియు నాకాలమందున్న వాఁడనుట నిశ్చయము. ఈతఁడు ౧౭౭౦ సంవత్సర ప్రాంతమున జన్మించి, దిట్ట కవి వేంకటామాత్యకవికి శిష్యుఁడై ఏనుఁగు లక్ష్మణకవి, వక్కలంక వీరభద్రకవులతో సమకాలికుఁడై కూచిమంచి తిమ్మకవికంటె నించుమించుగ నిరువదేండ్లు పెద్దవాఁడై ౧౮౦౦ సంవత్సర ప్రాంతము నుండియు కావ్యములను రచియించియుండునని యూహింపఁదగి యున్నది.

ఈకవి ఎఱ్ఱయకవికృతమగు సీతికథానిధానమునకు దినవహి బసవరాజుగారి ప్రతినున్న క్రమానరుధిరోద్గారి సంవత్సర శ్రావణ బ ౧౪ శనివారం సరికిని, నాగులపల్లి శేషనారాధ్యుని శ్రీ పర్వత పురాణమునకు ధాతసంవత్సర చైత్ర బ ౭ మంగళవారం వఱకును ప్రతులు వ్రాసికొనునట్లు మదరాసునందలి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునను న్న తాటియాకు ప్రతులలో వ్రాయఁబడియున్నది. రుధిరోద్గారి క్రీ. శ. ౧౭౮౩ వ సంవత్సరమును ధాత ౧౭౯౭ సంవత్సరము నయినవి. దినవహివారు ద్రాక్షారామములో నున్నారు.

ఈకవి దాక్షారామమున దిట్టకవి వెంకటామాత్యునికడ విద్యా భ్యాసము చేయుచున్న కాలములో నీప్రతిని వ్రాసికొనియుండును.

ఇతని కవిత్వము మృదువై సమసంస్కృతాంధ్ర పద సంయుతమై ధారాశుద్ధికలిగి హృదయంగమముగా నుండును.

ఈతని గ్రంథములనుండి కొన్ని పద్యముల నుదాహరించుచున్నాఁడను.

ధర్మఖండము:—

చ. తనయుల నన్నుబంధుల ముదంబునఁ బ్రోవఁగఁ గర్తవీవు నీ
వనిశము సేయుపాపమిది యంతయు నీయదిగాని మాకు రా
దొనరఁగఁ గల్మషంబు ఫలమొక్కఁడొనర్చిన నన్యుఁ డంచు నే
చనదిది ధీరగర్హితము శాస్త్రనిషిద్ధము ప్రాణవల్లభా ౧ ఆ

మ. లలిఁ బ్రారంభమునన్ సుఖంబొదవు తాళచ్ఛాయ చందంబునన్
దలఁపన్ దుర్జనమైత్రి యంతమున సంతాపంబుగావించు సా
ధులకుం గావున రూపయౌవన మదాంధున్వంచకున్ లోలు పుం
గలు షోద్యోగిని రాజునైనవిడువంగాఁ బాడియౌదవ్వులన్ ౨ఆ

ఉ. కాశికి నేఁగి యందు మణికర్ణికమజ్జన మాచరించి వి
శ్వేశు నుమాసహాయుఁ బరమేశ్వరు నిమ్ముగఁ బూజచేసి మో
దాశతఁబ్రస్తుతించిన మహాత్ముఁడు ముక్తిరమామనోహరుం
డై శివలోకవాసమున నవ్యయసౌఖ్యముఁగాంచు నిశ్చలున్ ౩ఆ

చ. కనకముమీఁద రోసినను గాంతలమీఁద విరక్తి గల్గునే
మునివరుమానమైనను సమున్నతయౌవన మత్తకామినీ
జనముఖ దర్శనాంతముగ సాగు యతీశ్వరులైన నొక్కచో
మనసిజుబారిఁ జిక్కుదురు మానవతీతతిఁ గాంచి రేనియున్ ౪ఆ

శా. అంతంబాప తరంగిణీతరణి నవ్యాంభోజమిత్రుండు దు
ర్దాంత ధ్వాంత వనీవిభావసుఁడు దైత్యవ్రాత చేతస్తమో
దంతిస్తోమ వికర్తనుండు ఖచరత్రప్రఖ్యాత హంసుండు భా
స్వంతుండల్లనఁ దోఁచెఁ బూర్వగిరిపైఁజక్రావన ప్రక్రియన్ ౫ఆ

క. కమలాక్షుని భక్తులరై
 క్రమమున శివనింద సేయుకష్టులుమీరల్
 శమనుఁడు దండించు మిముఁ
 శమనుఁడు నేఁగాక యొండు శమనుఁడు గలఁడే ౩౭

ఆ. వేయిమాఱులాది గాయత్రి జపియింపఁ
 దగు నుపాసకులకుఁ దత్పరమతి
 నట్లుసలుపకున్న నమ్మంత్రతతి కుక్క
 టాగ్రనిహిత హేమమట్లు మఱియు ౭ ఆ.

చ. తనయుఁడు సల్పుసత్క్రియకుఁ దండ్రియకర్తయగుఁ జగంబునఁ
 మునుపతిభార్య గర్భము సమున్నతవైఖరిఁ జొచ్చి పుత్రుఁడై
 జననమునొందుఁ దానె విలసద్గతిఁ దండ్రియసూ, కుమారుఁడై
 పెనుపగువార లిద్దఱకు భేదములేదు తలంచిచూచినఁ ౮ ఆ.

తే. అనఘుఁ డీరాముఁడు పరాత్ముఁ డయ్యెనేని
 యవని మాతల్లి తా సాధ్వియయ్యెనేని
 దశరథునకేను సుతుఁడనై తగుదునేని
 ద్రుహిణసాయక మీదైత్యుఁ దునుముఁగాక

శృంగారమంజరి:—

చ. ఎఱుఁగఁడు నిద్రయున్ రుచియు నెంతయుఁ గార్శ్యమునొందె పల్కఁడే
 మఱియు బుధాళితోడనని మాధవుఁగూర్చితి విన్న నింతితా
 నెఱుఁగఁడునిద్ర యాకలియు నిప్పుడు కార్శ్యమునొందె నాకునే
 మఱియు మొగంబుచూపఁడిటు మానుమ మెక్కుడెదై వశక్తియున్

ఉ. ఏసతినీకుఁ గొప్పిడియెఁ గృష్ణభవత్సఖి భైష్మికూపముల్
 వాసిగమీకు నిర్వురకు వ్యత్యయమయ్యెనొ కర్మమిట్లుగాఁ
 జేసెను రాజ్యమాసతియె సేయునొ యానని పల్క మాధవుం
 డాసఖితోడకాంత దరహాసరుచ్యత్రపలం గనుంగొనన్

చ. హరిదలపోసి తచ్చరిత మాదరత్ వినీ విశ్వమంతయుఁ
హరిమయమంచు నెంచి క్రియలన్నియు మాని వ్రజాంగనల్ కరం
బరుదగు గేహముల్ విడిచి యామునతీరవనాళిఁ జేరి యా
హరివగ తత్సమాకలన నందిరి నిస్సమ సౌఖ్యసంపదల్

మ. ఎఱుకఁ మీఱి పతివ్రతా తిలకమై యింపైన సద్భార్యయుఁ
మఱి న్యాయార్జితవిత్తముఁ సుఖద ధర్మంబుఁ బ్రియంబౌనె గ్ర
చ్ఛఱ వంధ్యాసుత కల్పమల్పమగు విజ్ఞానంబునుం జాలునే
నురవౌ శౌరికథా సుధానురతిచే నొప్పారెడుఁ నిచ్చలున్

—*—

# 313 మన్నారు దేవుఁడు



ఇతఁడు క్రీ. శ. ౧౬౩౩వ సంవత్సరము మొదలు ౧౬౭౩ వ సంవత్సరము వఱకును, తంజావూరు రాజ్యమును బరిపాలించి బహు గ్రంథరచనాధురీణుఁడైన విజయరాఘవనాయక భూపాలకవిచంద్రుని కుమారుఁడు; రఘునాథరామాయణ వాల్మీకిచరిత్రాది గ్రంథములను రచించి విజయ విలాసాది కృతులను గృతినందిన రఘునాథనాయక భూజానికిఁ బౌత్రుఁడు. అచ్యుతరాయనాయకప్రభుని ప్రపౌత్రుఁడు.

ఇతఁడు హేమాబ్జనాయికా స్వయంవరమను యక్షగానమును రచియించెను. దేవదానవులు సముద్రమథనము గావించినపుడం దుదయించిన రక్తాబ్జయను గన్యకను 'మన్నారుదేవుఁడు పరిణయ మాడినకథయిందు వర్ణింపఁబడినది. గ్రంథాదిపద్యమిది.—

సీ॥ శ్రీరమణీ సముజ్జృంభమాణ కటాక్ష
హారమణీల సద్భూరివక్ష
వార్తాచమత్కార వైభవప్రదనామ
మార్తాండమండల మహితధామ

మాణిక్యకేయూర మండిత భుజదండ
చాణూరగర్వ శిక్షాప్రచండ
తంజాపురాధి ప్రస్తవనీయ చారిత్ర
కంజాతపత్ర సంకాశనేత్ర

తే॥ ద్వారకాధీశ కాంచనవసనివాస
పాకరిపుమిత్ర చంగమలాకళత్ర
మముఁ గటాక్షించి శుభలీల మనుపుఁజాల
రాజగోపాల రాధికారతివిలోల!

ఈతఁడు కృత్యవతరణికలోను భరతవాక్యమునందును దన వంశాదికము నీరీతిగా వర్ణించియున్నాఁడు.

'వ. అని వినతులొనర్చి యనంతగరుడుల కనంతనమస్కారంబు లాచరించి, పంచాస్త్రజనకుని పంచాయుధంబుల తియించి, వన్నెమీఱ, పన్నిద్దరాళ్వారుల నిత్యసూరుల నారాధించి, యాదిమకవుల నాదరించి, కుకవిలోకంబు నిరాకరించి, అతులితాశ్చర్య తపశ్చర్యులగు శతక్రతు శ్రీనివాసతాతాచార్యులకు గంభీరసూక్తుల సంభావనమీఱ నమస్కరించి, నిజవంశక ర్తయై వార్త కెక్కు చెవ్వభూభర్తను గీర్తించి, తనదు ప్రపితామహుని మహామహుని వీరవైష్ణవ సార్వభౌముని యచ్యుతాళ్వారుల నభినుతించి తనదు పితామహుని నభినవ భోజుని రఘునాథ జననాథ బిడౌజుని సన్నుతించి, శౌర్యాతైశ్వర్యంబుల వెలయుచు, విశ్వ విశ్వంభరాచక్రం బాచంద్రార్కంబుగాఁ బాలింపుచుఁ జాలవర్ధిల్లుచున్న తన తండ్రియగు విజయరాఘవ భూపాలచంద్రుని యుదార పాదారవిందంబులకు వందనంబు గావించి యతనియనుమతిం గాంచి......మహితానుభావుండునునగు మన్నారుదేవుండు భువనస్తవనీయంబుగా హావణించు శృంగారరసగర్భ సందర్భ విభాసురంబగు హేమాబ్జనాయికా స్వయంవరంబను నాటకంబునకుఁ గథాసంవిధానం బెటువలెను.'

'భరతవాక్యం. ఇవ్విధంబునఁ జనచెవ్వ యచ్యుతాధిపప్రపౌత్రుండును రఘునాథజననాథ పౌత్రుండును విజయరాఘవభూపాలక ప్రియపుత్రుండును, రాజగోపాలాంబికా గర్భకలశ జలధికువలయమిత్రుండును, అతులకనకతులా ప్రముఖనిఖిల మహాదాన దీక్షాధురీణుండును, ననేకాగ్రహార ప్రతిష్ఠాపన ప్రవీణుండును, విజయ రాఘవాభ్యుదయాది ప్రబంధ నిబంధన చాతురీధౌరేయుండును, అతులిత పితృభక్తి భాగధేయుండును, మహితానుభావుండునునగు మన్నారు దేవుండు, భువనస్తవనీయంబుగా హావణించిన హేమాబ్జనాయికా స్వయంవరంబను నాటకంబునకు గథానాయకులగు రక్తాబ్జరాజగోపాలకులు తమ ప్రియపుత్రుండై ధాత్రిఁ బాలింపుచుఁ జాలవర్ధిల్లుచున్న విజయరాఘవ భూపాలునకు సర్వసర్వంసహాధిపత్య నిత్యాయురారోగ్యభాగ్యంబులు పాలించి రక్షించుఁగాత!''

కవితండ్రియైన విజయరాఘవభూపాలుఁ డాతని తండ్రియైన రఘునాథుని చారిత్రమును దెల్పుచు రఘునాథాభ్యుదయమును రచియించినట్లే మన్నారు దేవుఁడును, విజయరాఘవాభ్యుదయమును రచియించినట్లు చెప్పియున్నాఁడు. కాని యా గ్రంథమిప్పుడుగాన వచ్చుటలేదు. ఈయక్షగానమును మన్నారు దేవుఁడు రచియించు నాఁటికి రఘునాథనాయకుఁ డీ లోకమును వీడియుండును. అతఁడు జీవించియున్నచోఁ జైకృత్యాదిలో నాతనిని ''సన్నుతించి'' అని వ్రాయక యాతనికి ''నమస్కరించి'' అనియే వ్రాసియుండును.

మన్నారు దేవుఁడు తంజావూరు రాజ్యమును పాలించియుండ లేదు. తండ్రికుమారులిరువురును, మధురప్రభువగు చొక్కనాథ నరనాయకునితో జరిగినయుద్ధములో క్రీ. శ. ౧౬౭౩ వ సంవత్సరములో వెంకటకృష్ణప్ప దండనాయకునివలనఁ జంపఁబడిరి. అందుచే రాజ్యపరిపాలనమున కాతనికవకాశము లేకపోయినది. విజయరాఘవుఁడు తనకుమారుఁడైన నీ మన్నారు దేవుని కారాగారమునం

దుంచెననియు, పైనజెప్పిన యుద్ధమునకుముందు కారాగారమునుండి విముక్తుని జేసెననియు, నొకప్రవాదముకలదు. ఈ విషయమును గూర్చి విజయరాఘవభూపాలుని చరిత్రమున వ్రాసియున్నాఁడను.

ఈకవి, విజయరాఘవునికాలమున ననఁగా క్రీ. శ. ౧౬౩౩ ౧౬౭౩ మధ్యనున్నవాఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఈతని కవిత్వము పండితపామరజనహృదయంగమమై యొప్పారుచుండును.



# 314. చరిగొండ హొన్నయ్య



ఇతఁడు జ్యోతిషరత్నాకరమను నొకపద్యకావ్యమునురచించెను. చరిగొండధర్మయ్య, నరసింహకవి, యీతని వంశములోనివారేయనియు, నీతని నివాసము నిజామురాష్ట్రములోని చరిగొండ యనియు, నీతనికాలము ౧౭౦౦ (క్రీ. శ.) ప్రాంతమనియు గోలకొండకవులసంచికలో వ్రాసియున్నారు. ఈకావ్యముయొక్క యసమగ్రప్రతు లసమగ్రమైనవి రెండు మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండారమునం దున్నవి ఈగ్రంథమున ముఖ్యముగా సంవత్సరఫలితములు చెప్పఁబడినవి. ఇది రామరాజు సింహాద్రిమంత్రి కంకితము సేయఁబడినట్లు గన్పట్టుచున్నది. ఈకవినిగూర్చి యిఁక నేమియుఁ దెలియలేదు.

క. భూనాథుల కతిశయముగు
వానలుపాడగట్టుఁ గురియు వసుమతియందున్
ధేనువులు పిదుకునధికము
శ్రీనిధిప్రభవాబ్దమందు సింహాద్రివరా!

క. ధరమన్మథ దుర్ముఖులును
నరయంగా మధ్యవృష్టినారంభంబుల్

నెఱి నల్పఫలితమందును
పరమభయము దక్షిణాదిపథములనొందుణ్.

ఈగ్రంథము సంస్కృతభాషలో నున్నట్లును, దాని నీకవి యాంధ్రీకరించినట్లును గన్పట్టుచున్నది. కృతిపతియైన సింహాద్రి మంత్రి వృత్తాంతమును దెలియరాలేదు.

మదరాసునందలి భాండాగారముననున్న యొకయముద్రితప్రతి గ్రంథారంభమున నీక్రిందిపద్యమున్నది.

క. శ్రీరామతీర్థపతికిఁ గృ
పారసవారాశి కఖిలవందితునకు సీ
తారాముల కాశ్రిత క
ల్పారామునకుణ్ యశస్సుధాంభోనిధికిన్.

ఇందలిరామతీర్థము విశాఖపట్టణమండలములో నున్నదివలెఁ గాన్పించుచున్నది. పేరునుబట్టి కృతిపతియు నామండలవాస్తవ్యుఁడు గాదగును. కవి నిజాము రాష్ట్రమువాఁడు. ఈసంఘటన మెట్లు సమకూరెనో!



## 315. గణపవరపు వేంకటకవి

—*—

ఇతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు; ఆశ్వలాయన సూత్రుఁడు; వసిష్ఠగోత్రుఁడు; అప్పయార్యమంగమలకుఁ బుత్త్రుఁడు.

ఇతని నివాసము గణపవరము. ఈగ్రామమునుబట్టియే కవి గృహనామమేర్పడియుండును. ఈగణపవరము కాపెపలిముఖ్యమని చెప్పఁబడినది. కాపెపలి కాదనియు కామెపలియనియుఁ గొంద అనుచున్నారు. ఆంధ్రకవులచరిత్రములో "ఇతఁడు కృష్ణామండ

లములోని కామెపల్లె సీమయందలి గణపవరగ్రామనివాసుఁడు. ఇతఁడు పల్నాటిసీమవాఁడగుటచేతను స్వానుభవముచేతను గాఁబోలును "పలనాటిగొల్లలపాటజాతి" యని యచ్చటి గొల్లలపాటను నిరసించియున్నాఁడు. ఇతఁడు మిక్కిలి యాధునికుఁడేయయినను, నీతనికాలము మాత్రమిదియని సరిగాఁ దెలియదు" అని వ్రాసియున్నారు. ఈకవి రచించిన ప్రబంధరాజ వెంకటేశ్వర విజయవిలాసమునందు

"సీ. శోభితరామాయణోభయపరమ భా
గవతచరిత్రముఖ ప్రబంధ
బంధురవచనానుబంధనందవరాన్వ
యాబ్ధిచంద్రాయ మానప్పనార్య
నందనవేంకటనాథవరప్రసా
దప్రసాదితకవితావిలాస
* కామెపలీముఖ్య గణపవరగ్రామ
శేఖరశిష్టవసిష్ఠగోత్ర
శోభమానాశ్వలాయనసూత్రమంత్రి
వర్యలక్ష్మణకవి వేంకటార్యఘనుఁడ
మంగమాంబామణీ గర్భమహితసూక్తి
మౌక్తికప్రతిమానసమానధనుఁడ.

ప్రస్తుతము పశ్చిమగోదావరిమండలములోని భీమవరముతాలూకా యందొక గణపవరమున్నది అది యిది కాదు. అందు నందవరీకులు లేరు. అచ్చట కామెపల్లిగాని కాటేపల్లిగాని లేదు.

ఇతఁడు తనను గూర్చియును, దనకవిత్వప్రజ్ఞను గూర్చియుఁ దన యౌన్నత్య విషయమునను నీ వెంకటేశ్వరవిలాసమున ముప్పదిపద్యములవఱకు వ్రాసియున్నాఁడు. ఆపద్యములను జదివినవా రీతఁ

* కామెపలీయని కొన్నిప్రతులలోఁ గలదు.

డధికముగా నాత్మస్తుతిపరాయణుఁడని యనుకొనకపోరు. ఆ వ్రాఁత లలో నుత్ప్రేక్ష యేగాని వాస్తవము స్వల్పము. కాని యితఁడు భుక్తికిలోటులేనివాఁడనియు, నతిథ్యభ్యాగతులనాదరించు ధర్మాత్ముఁ డనియు, సంస్కృతాంధ్రములయందు మంచి పాండిత్యము గలవాఁడ నియు, బహుగ్రంథపరిశోధకుఁడనియు, దనకుఁ దెలిసినదానిని గ్రంథ రూపమున వెదజల్లవలయునను గోర్కెకలవాఁడనియుఁ, గావ్యమూల మునఁ దనయశమునుభూమిపై శాశ్వతముగ నిలుపఁ గాంక్షగలవాఁడ నియుఁ జెప్పవలసియున్నది. బ్ర.వీరేశలింగముపంతులుగా రీతనియందు గ్రంథచౌర్యదోషము నారోపించి కవిగ్రంథములలోఁ జాలభాగము లభింపకపోవుటనుగూర్చి ఈకవి తాను జేసిన పుస్తకములు లోకమున కుపయోగపడవలెనన్న యుద్దేశముతోఁ గాక తనసర్వతోముఖపాం డిత్యప్రకర్షమును లోకమునకుఁ బ్రకటింపవలెనన్న యుద్దేశముతో విశేషభాగముచేసినందున నీతని పుస్తకములకిట్టి గతిపట్టియుండు''నని వ్రాసియున్నారు. కవి వ్రాసికొనిన యాత్మస్తుతిభాగములనుజదివి యేహ్యముఁ జెందినహృదయముతో నున్నప్పుడు పంతులుగారి లేఖిని నుండి వెలువడిన వాక్యములనుగా భావించి వాని నుపేక్షింపవలసి యున్నది. లోకములో నెందఱుకవుల గ్రంథములకిట్టిగతి వాటిల్లి యుండలేదు. ఇతఁడు రచించిన గ్రంథములపేర్ల నుదాహరించుచు నీకవి చెప్పినపద్యముల నుదాహరించుట గ్రంథవిస్తరముగునని తలంచి వానినామముల నీక్రింద వ్రాయుచున్నాఁడను.

౧ ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము

౨ జాంబవతీవిలాసము

౩ పరమభాగవత చరిత్రము

౪ బాలరామాయణము ద్విపద

౫ ఆంధ్రవసంతతిలక భాణము

౬ పురాణసారము

౭ యమకశతకము

౮ కృష్ణమల్లకథ

౯ పది యుల్లాసములుగల సర్వలక్షణశిరోమణి.

౧ ఆంధ్రకౌముది ౨ వేంకటేశ్వరాంధ్రము మొదలగునవి యిందలి భాగములు.

౧౦ చక్రవాళతారావళి మొదలుగా ననేకతారావళులు

౧౧ చండవిద్యావతీ దండకము

౧౨ ఆంధ్రప్రతాపరుద్రీయము

౧౩ ఆంధ్రరసమంజరి.

౧౪ కఠినప్రాసశతకము

౧౫ కల్పితకల్పలత మొదలుగా గలవి.

ఇందు ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసమును, సర్వలక్షణశిరోమణియందలి తృతీయోల్లాసమగు నాంధ్రకౌముదియు, ద్వితీయోల్లాసమగు వేంకటేశ్వరాంధ్రమును మాత్రము ముద్రితములై మనకు లభించుచున్నవి. విద్యావతీదండకమును, సర్వలక్షణ శిరోమణి యందలి కొంతభాగమును మదరాసుప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నున్నవి. తక్కిన గ్రంథములన్నియు నామమాత్రావశేషములై యున్నవి.

ప్రబంధరాజవిజయ వేంకటేశ్వరవిలాసమొక పెద్దగ్రంథమై దాదాపెనిమిదివందల పద్యములను గలిగియున్నను, బరిచ్ఛేదములుగా గాని ప్రకరణములుగాగాని విభజింపఁబడక, యేకాశ్వాసముగానుండి యంత్యమున గద్యవ్రాయబడక, యీక్రిందిపద్యము వ్రాయఁబడి సమాప్తము నొందుచున్నది.

చ. గణపవరాన్వయాంబునిధికైరవబాంధవుఁ డప్పనార్యల
క్షణకవివేంకటార్యమణిసంతత శోభనకీర్తి సంతతుల్
గణనకునెక్క వేంకట నగప్రభుపేరనొనర్చె సత్కవి
ప్రణుతవిలాసరాజము ధరన్ దగనావిధు తారకంబుగన్.

ఇది లక్షణగ్రంథమని కొందఱందురుకాని, యామాటసత్యము కాదు. ఇందు లక్షణములేమియుఁ జెప్పఁబడలేదు. శ్రీవేంకటేశ్వరున కలమేలుమంగతోనైన పరిణయవృత్తాంతమును వర్ణించుచు నీ కవి యీప్రబంధమును రచియించెను. తుదను నాగదత్తుఁడను నొక విటుఁడు భార్యనువిడిచి వేశ్యాలంపటుఁడై ధనమునుగోల్పోయి వేశ్యమాతచేఁ జివాట్లు తినుట మొదలుగాఁగల యొకయుపకథ చేర్పఁబడినది. కావుననే దీనికి వేంకటేశ్వరవిలాసమని పేరు పెట్టినాఁడు. ప్రబంధమునకుండవలసిన పదునెనిమిది వర్ణనము లిందుఁ జేయఁబడినవి. ఇందలి విశేషమేమనఁ బ్రతిపద్యమును నొకయలంకారమునకో చిత్ర, బంధకవిత్వలక్షణముతోఁగూడిన యొకవృత్తమునకో లక్ష్యముగా రచించుచు వచ్చినాఁడు. అందుచే నిదియొకలక్ష్యగ్రంథమని నుడువవచ్చును. ఈలక్ష్యమునే మనము నందుంచుకొని కవి యీ ప్రబంధమును రచించుటచే రసము సన్నగిల్లినది. పద్యములలో పద్యముల నిముడ్చుట, ఏకాక్షరములతోఁ బద్యమును వ్రాయుట, రెండక్షరములలోఁ బద్యమును వ్రాయుట, తుదనుండి చదివినను మొదటినుండిచదివినను బద్యమొకేరీతిగనుండుట మున్నగునవిందు కలవు. ఇట్టి గర్భ, చిత్ర, బంధాదికవిత్వమువలనఁ గవికిని బాఠకునకుఁగూడఁ బ్రయాసమేకాని యానందముండదు. ఇట్టివానివలన భావము, ధ్వని, మరుగునఁ బడిపోయి మనసునకు సుఖము కల్గుటకు మారుగఁ గ్లేశముదయించుచుండును. ఈతఁ డొక సీసపద్యమును రచియించి, దానికీ క్రిందిపేరుంచెను.

"బహువిధచిత్రకంకణ బంధద్విగుణిత సీసచరణచతుష్టయ గర్భిత, ద్విపద, కందద్వయ, సమవృత్త, చౌపదయుగళాటవెలఁది, తేటగీతి, మదనవిలసిత, తురంగవృత్త, బహువిధతాళవృత్తాష్టక, ధవళ, శోభాన, గానారాత్రిక, గానజంపె, త్రిపుటార్ధచంద్రిక, సువ్వాలలాలిపదేలా, మంజరి, సమతాడిండిమతాళవృత్త, మణిగణనికర, తురగవల్గన, రగడోదాహరణసంబుద్ధిళికోత్కళికార్థాహిరీ,

రాగదళ, ముఖారిరాగాటదళ, కాంభోదిరాగరూపకతాళదళ, కాంభోదిరాగసమపద, కన్నడరాగ సాంగత్య, కొరవంజిదళ రేవగుప్తి రాగసమపద, సావేరిరాగైకతాళదళ, బిలహరిరాగాటతాళసమపద, పుష్పమాలికాబంధ, గోమూత్రికాబంధ, శార్ఙ్గబంధ, షోడశదళపద్మబంధ, పాదుకాబంధ, నవరంగబంధ, ఖడ్గబంధ, గుచ్ఛబంధ ఛత్రబంధ చామరబంధ, గదాబంధ, చక్రబంధ, శకటబంధ, నాగబంధ, రథబంధ, వీణాబంధ, శంఖబంధ, మృదంగబంధ పాదభ్రమకబంధ, పాదార్ధభ్రమకవింశతిబంధ భేదకందానుష్టుప్ శ్లోకాంతర్గత చతుర్భద్ర, నవరంగ, సర్వతోభద్రాందోళికా యుక్తానులోమ విలోమకంద, భాషాశ్లేషకంద, కందాటవెలఁది గర్భితాంత్యతేటగీతి యుక్తచౌషష్టిభేదచిత్రసీసము"

ఇట్టిసీసమెట్లున్నదోయని దానింజదువ మనసువడు వారనితలంచి యాసీసము నీక్రింద నిచ్చుచున్నాఁడను. ఇది భగవంతుని నుతించుటకై యుద్దేశింపఁబడినది.

సీ. సారాగ్ర్యసారస సమనేత్రయుగళ నా
 రదరుచికాంతి సరఘునపనిత
సారాగధీర విశద వీనతురగ భై
 రవభవజైత్రభర శుభకరణ
సారాతిహార విసరచారణ హారి సా
 రసహిత చంద్రశరజజయనుత
వారాశినారద వరపూజిత పద గౌ
 రవ కటికడ్గగరళ గళసఖ
హారినగనిలయ గిరిధర యసురదళన
మణిమయ మకుటసురమణి మధువిశరణ
శరివర దకువర రుచిరతర వసనన
రహారిలసిత దరనిగమ విహారణహారి

"కవి మిక్కిలి కష్టపడి పైనఁజెప్పబడిన రీతి గర్భబంధ కవిత్వమును. ఏకాక్షర నిఘంటులను వెదకి

క. కైకోకీ కాకేకుకై । కోకాకాకింకకూకి కూకకుకోకీ
  కాకుకకు కేకికేకిక । కూకో కోకూకకింక కోకైకాకా

అను రీతినేకాక్షరముతోడి చిత్రకవిత్వమును, ఒక్కదానిలోనే యితరపుస్తకములోను లేనంత యమితముగాఁ జెప్పి తనశిల్ప వ్యాపార కౌశలము నెంతచూపినను, కాళ్లతో నడచి గమ్యస్థానమును జేరు సామాన్యమార్గమును విడిచి, యడ్డముగా భూమిమీదఁబడి కడుపుతో దొర్లి, ప్రయాసపడి, గమ్యస్థానమును జేరి యసాధారణప్రౌఢిమను జూపిన బుద్ధిమంతునిశక్తిని మెచ్చుకొనునట్లే యిట్టి కవితాచమత్కృతులు మెచ్చుకొనఁదగి యుండును గాని యంతకంటె నెక్కువ శ్లాఘాపాత్రములుగావు''

—ఆంధ్రకవులచరిత్ర

ఇట్టి కవిత్వమునందుఁ గవియొక్క యద్భుతమేధాశక్తి వెల్లడి యగునేకాని లోకమునకయ్యెడు మేలుండఁబోదు. ఇట్టినియమముల పాటింపకుండ వ్రాసిన మఱినాల్గుపద్యములనీతని కవిత్వధోరణి తెలియుటకై యీక్రింద నుదాహరించుచున్నాఁడను.

చ. అలకలె జాలసూత్రములు, హారసమంచిత రత్నరాజియ
  వ్వలయము ఫ్రాస; లాత్మచెలువంబగు ఫుట్టికగాఁగఁ గామినీ
  కులమను ధీవరవ్రజము కూరిమిచేష్టల మేఁతచేఁతఁ జూ
  పులవలఁ జిక్కఁజేయు విటపుంగవమత్స్యములన్ బురాంబుధిన్

ఉ. ముందుగఁదావకీన హరిమోహనరూపము చూడలేదు నీ
  వందుకుఁ దేనెలుట్టిపడ నాడుదు నావిభుఁడుప్పులేక ము
  ప్పందుము గంజిత్రాగునని పల్కెదుగా యెటులైన చూత మిం
  కందఱిచేతనున్న మణికంకణముంగన నద్దమేటికిన్

మ. కలఁడభ్యస్త సమస్త శాస్త్రనిగమ గ్రంథార్థ సంఘర్ష ని
  స్తుల వాచారభటీ ధురాధరితసింధు ప్రోల్లసల్లోల ని
  ర్మలకల్లోల ఘుమంఘుమారవయశోమాన్యస్వకీయ ప్రథా
  కలనాథగ్నుఁడు మాధవుండనెడు సత్కర్ముండు ధాత్రీస్థలిన్

శా. అన్నా నిన్నని యెత్తి పెంచి యుపవీతాన్వీతుఁగావించి యీ
కన్నెన్బెండ్లి యొనర్చి మీ రిరువురున్నారాముచే నొప్పఁగాఁ
గన్నుల్లల్లఁగఁ జూతునంచు మదిఁగాంక్షల్మీర నేనుండఁగాఁ
జిన్నంబుచ్చితి విన్ననాళ్లనను దుశ్శీలుండవై పుత్రికా!

ఈతని యాంధ్రకౌముది సర్వలక్షణ శిరోమణిలోని మూఁడవ యుల్లాసము. ఇది యొక సీసమాలిక. ఇందు వ్యాకరణసంబంధమైన ముప్పదియైదువిషయములు వేయిపాదములలోఁ జెప్పఁబడినవి. కవిత్వముఁ జెప్పఁబూనువారీ వేయిపాదములను గంఠస్థమొనర్చినచో మిగుల నుపయోగకరముగా నుండును. మచ్చునకు నాల్గు పాదముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

తెలియనచేత నమ్ముల సప్తమికి ద్వితీ
యకు తృతీయము వచ్చునది యెటులన
వనినున్నది మదేభవార మరుల దన
యసినిజకుక్షఁగఁ జేసెనంగన మెయిఁ
గలపములందెను బలిమినసుర గెల్చె
నన నిట్టి లక్ష్యముల్గనుఁడు సుకవు
లచ్చతెనుంగున వ్రాణివాచి కోదం
తముల పయిసప్తమికి మఱి తృ
తీయకునర్ల వచ్చుఁదెలియ నాదేశమై
కొమ్ముననిల్చెఁ గొంగుననువిసరె.

ఈకవి రచించిన వేంకటేశ్వరాంధ్రమాంధ్రనామ సంగ్రహము వలెనే, యయిదువర్గులుగా విభజింపఁబడి ౧౨౮ సీసపద్యములలో నాంధ్రశబ్ద నిఘంటువుగా నున్నది. మచ్చున కొక్క పద్యమిచ్చుచున్నాఁడను.

సీ. కన్యకాఖ్యలు కన్నెకన్నియ నాఁగొమ
రాలు జవ్వనిజవరాలనంగ

యౌవని గట్టివయసుది ప్రౌఢయనప్రౌఢ
కలదు ముసలి ముండలకొరనన
లుబదేళ్ల దనఁటగుబ్బోల వృద్ధాంగన
యెసఁగు గొడలిముద్ది ముసలిదియన
వెలిచవుల్ గన్నతొయ్యాలి అంకులాడి చె
డిపె యనజార పాటిల్లుచుండు
గడనపడఁతుక రోచెల్వ పడపుపడఁతి
లంజ బోగముటేమ పెల్లాటకత్తె
వేడ్క-కోమ వెలయెలనాగ వేశ్యపేళ్లు
వెలయు దినమణి సంకాశ వేంకటేశ

ఇతఁడు తనగ్రంథములయందు వేసికొనిన యీక్రింది గద్య వలన పెరుంబూదూరి యతిరాజీతని గురువైనట్లును, కర్ణాటాది మహీపతులీతనిని బహూకరించినట్లును గనుపట్టుచున్నది.

"ఇది శ్రీమత్పెరుంబూదూరి యతిరాజాచార్యవర్య కరుణా కటాక్షసంప్రాప్తాంధ్రకవితా సామ్రాజ్య ధురంధర నీతి యుగంధర నందవర కులకలశజలధి పూర్ణిమాచంద్ర సత్యహరిశ్చంద్ర వాసిష్ఠ గోత్రప్రశస్తాశ్వలాయన సూత్రకార్య ఖడ్గప్రవీణ కామినీ పంచబాణ కర్ణాటతుండీర చోళపాండ్యమండల ప్రముఖాఖిల మహీమండ లాఖండలదత్త మత్తసింధుర సైంధవాందోళికాచిరత్న కాంచనాంబరాది వస్త్రప్రశస్తమందిర నిరంతర వసదిందిర, సకలకళావిచక్షణ నిఖిల శుభలక్షణ లక్షణకవి వేంకటామాత్యాభిధానాస్మర విరచితంబును మంగమాంబాసమేత గణపవరాప్పయమంత్రి మణివిఖ్యాత మజ్జన కరూపాలమేల్మంగా సనాథతిరువేంగళనాథాంకితంబును..."

ఇందలి "కర్ణాటతుండీర......లక్షణకవి" యను వాక్యము లను దీసికొని "మండలేక పాండ్యమండలేశ, పాండ్యభూవిభు" మొద లగు విశేషణములచే వ్యవహరింపఁ బడినవాఁడు విజయరంగనాథ

భూపాలుఁడేయని పెక్కండ్రు దాక్షిణాత్య కవుల వ్రాతలవలన విశ్వ సింపఁ దగియుండుటచే నిక్కవి యతనికాలమందే, యనఁగా క్రీ. శ. ౧౮ శతాబ్దము మొదటనుండినవాఁడై కూచిమంచి తిమ్మకవికి సమ కాలికుఁడై యుండునని తోఁచును. ఇతఁడు ప్రబంధ రాజవేంక టేశ్వర విలాసములో విన్నకోట పెద్దనార్యాదుల కావ్యాలంకార చూడామణ్యాదులను బేర్కొనుచు సర్వలక్షణ సారసంగ్రహ సరస్వతీ విలాస, సాహిత్యచింతామ్ణి...లక్షణంబులకు లక్ష్యంబును" అని వ్రాసికొనియెను. ఇందుఁ బేర్కొనబడిన సర్వలక్షణ సారసంగ్రహము చిత్రకవి పెద్దనార్యుఁడు రచియించినదేకాని కూచిమంచి తిమ్మకవిది కాదని యాంధ్రకౌముదీ ముద్రితప్రతిపీఠికాకారులు వ్రాసియున్నారు.

ఈకవి నివాసమయిన గణపవరమేదియో తెలియుటలేదు. కృష్ణామండలమున నందిగామతాలూకా యందొకటి, బెజవాడ తాలూకా యందొకటియుఁగలవు. గుంటూరు కర్నూలు మండలము లందు గణపవరములను గ్రామములు మరికొన్ని కలవు. ఈగ్రామ ములలో నెందు నంధవరీకులు విశేషముగాకలరో యదియే యీతని నివాసమైయుండునని తలంప వచ్చును.

ఈతని కాలమునుగూర్చి తెలిసికొనుటకు బలవత్తరములగు నాధారములీతని ముద్రిత గ్రంథములయందుఁ గన్పట్టుటలేదు. బ్రహ్మశ్రీ వీరేశలింగము పంతులుగారు తమకవుల చారిత్రమునందీతడు పదు నారవశతాబ్దికి పూర్వమువాడు కాడనియుఁ బదునేడవ శతాబ్ది యుం దుండుననియు సందేహముగా వ్రాసియున్నారు. శతకకవుల చరిత్ర కారులగు పండిత వంగూరి సుబ్బారావుగారును సీకని రామరాజ భూషణుని వరకుగల కవులను పేర్కొనుటచే "సీతడు క్రీ శ. ౧౫౫౦ ౧౬౫౦ నడుమవాఁడు కానోపునని వ్రాసియున్నారు. శ్రీప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసమునకు పీఠికవ్రాసిన శ్రీపూండ్ల రామ కృష్ణయ్యగారును కాలనిర్ణయముచేయక విడిచినారు. ఆంధ్రకౌముదికి

గ్రంథప్రశంస వ్రాసిన శ్రీకొత్తపల్లి సూర్యారావుగారీ కవి తన సర్వలక్షణ శిరోమణి యుల్లాసముల వ్రాసిన తుదిగద్యలందలి "మండలేశ, పాండ్యమండలేశ, పాండ్యభూవిభు" మొదలుగాగల విశేషణములు విజయరంగ చొక్కనాథభూపాలునివిగా గ్రహించి యీతని కాలము 18 వ శతాబ్ది ప్రారంభమని నిర్ణయించినారు. ఈతఁడు రచించిన విద్యావతీ దండకమునుగూర్చి వ్రాయుచు దొరతనము వారి ప్రాచ్య లిఖిత పుస్తకముల కేటలాగులలో నిట్లునుడివియున్నారు. "పాండ్య మండలాధీశ్వరుఁడు, విశ్వనాథనాయకుని వంశమువాఁడు, తిరుమల నాయకుని పౌత్రుఁడు, వీరప్పనాయకుని పుత్రుఁడు, చొక్కనాథ నాయకునిసోదరుఁడునగు ముద్దళ్ళగిరిభూపాలుఁడు విద్యావతియనువిలాస వతిని (వేశ్యను) ప్రేమించుట, తననాట్యస్థల పాత్రిలందు సమ్మాన పాత్రముగాఁ బరిగ్రహించుట, యిందుకథావిషయము. బమ్మెర పోత రాజుగారు రచించిన భోగినీదండకపుఁబోలిక నీదండకముగలదు. సర్వ లక్షణశిరోమణి, ప్రబంధరాజవిజయవేంకటేశ్వర విలాసము మొదల యిన మహాగ్రంథముల రచించిన గణపవరపు వేంకటకవియే తత్కృతి కర్త.

ఆ కేటలాగులోఁ బ్రకటింపబడిన దండక భాగమిది.

"శ్రీ విశ్వనాథాన్వయాంభోధి చంద్రుండు...... సత్కాశ్య పాభిఖ్య గోత్రుండు భాస్వచ్చరిత్రుండు శ్రీతిర్మలోర్వీతలాధీశ పౌత్రుండు వీరావనీపాల పుత్రుండు వీరాధివీర స్తుత్యోదారదోస్సార వచ్చొక్కనాథక్షితీశాగ్రణీ సోదరుం డాశ్రితత్రాణ బద్ధాదరుండర్భక న్యాయసమానోల్ల సల్లింగమాంబావధూగర్భ శుక్తిస్ఫురన్మౌక్తికాకారుఁడై యొప్పు ముద్దళ్ళగిరిక్షోణి పాలుండు...... చోకాటంబుగా రాజసంబెచ్చ నిండోలగంబుండి విద్యావినోదంబులంగొంత ప్రొద్దింపు సొంపొంద శ్రీరంగనాథుఁ గృపావాహినీ నాథు సేవింప భావంబు లో నెంచి...... వాహ్యాళిగా వచ్చునవ్వేళఁ దత్పౌర వారాంగనా

కోటి వీక్షింపనాస్త్రీలలో...... మాద్యద్వయస్సీమ విద్యావతీభామ
మేల్వాలుకన్ జెప్పలల్లార్ప వీక్షించి సంగంబపేక్షించి..... ఉన్నట్టి
యయ్యిందుబింబాస్య చందంబు వేఱొక్క చెల్కత్తెలోఁ దక్కఁగం
బెంచ మాయంపు బల్వెల్లియైయున్న యాతల్లికిన్ దెల్పినన్ ......
ముద్దళ్ఘరిస్వామి తోఁగూట మష్వారవారాంగనాకోటిలో నేర్చినన్
మహోదుర్గమంబ స్వతంత్రంబు... అట్టిచందంబు డెందంబుసంగోరి
కామించి నామాటలన్ మీఱకే...... అంచెంతయుంగంగఁబోల్ గీతి
మర్జితులన్ జాలబోధించుమాతన్.... పొమ్మంచుఁ గెమ్మోవికంపిం
పగాఁ బల్కుచున్.... ఒద్దికై మీరు శాతోదరిన్ సోదరిన్ జూచి....
రాపొందుగాజిల్లఁగా జేయవేయప్ప బంగారు కుప్పౌకకుప్పోళి పాలించు
రామప్ప మేలంచు భాషించు భూషించు కన్యాలలామంబునుం
బ్రేమమీఱన్ విలోకించి... ఈప్రౌఢ్దెముద్దళ్ఘరిక్షోణి పాలావతంసంబు
సాన్నిధ్యముంజేరి నీచందమందంబుగాఁదెల్పి పిల్పింతు... అంచున్
సుమాళంబు మీఱంగ లాలించి... అమ్ముద్దు నీగన్న మాపాలజాజుల
గవీంద్రావళీ పారిజాతున్ విలోకించి మైవంచి దండంబుగావించి ...
కర్ణాటసింహాసనాధ్యక్ష ముద్దళ్ఘరిక్షోణి పాలవతంసా... మాద్యద్వ
యస్సీమ విద్యావతీభామ వర్ణింపుచున్ నిన్న నేమీరు వాహ్యాళి
వేరంగ సంతోషమూ రంగమారామచే రంగశ్రీనాథు.... మదిన్
భక్తి తేరంగ సేవించిరా గన్నులన్ గన్నదై మున్ను మీరూపురేఖా
విలాసంబులన్ విన్నదై నీదు పారంబులన్ జేరగానెంచి నిత్యో
పదింక... స్వామి చిత్తంబు మాయింతి భాగ్యంబటంచున్ సుమా
ళంబుగాఁ బల్కు కల్కింగటాక్షించి వాక్చాతురిన్ మెచ్చి......
రప్పించి తన్మాతకున్ నీతమానట్టుఁ జిత్రశాటీ ధనగ్రామరత్నాదులన్
బ్రీతిగావించి... విద్యావతీ కన్యకారత్న మాత్మీయమహానాట్యశాలా
స్థలీ పాత్రలందెల్ల సన్మాన పాత్రంబుగా... బాహ్యాతురోగ్యపగిక్రీడలన్
మన్మథాభోగ సామ్రాజ్యభోగంబులన్ దేలి చొక్కాటపుంగుందనం
బందు రాణించు మాణిక్యమున్నట్టు శోభించి వర్ధిల్లుచున్నాఁడు”

గుణామేయ లక్ష్మీనివాసస్ఫురత్పాండ్య సింహాసనాధ్యక్షు పేరణ ... జయోదాత్త ముద్దళ్ఘరిక్ష్మాతలాధీశు పేరన్ వృషాద్రీశ సంకాశు పేరన్ మహాలక్షణగ్రంథ భాషాభిధాన ప్రథామాధురీ సాధురీత్యర్థవచ్ఛబ్ద బంధానుబంధ ప్రబంధాధి నాథాప్పయామాత్య రాడ్వేంకటార్య ప్రణీతంబుగాఁ బోల్చునాపుష్ప కోదండకంబైన విద్యావతీదండకంబుర్వినాచంద్ర తారార్కమై యొప్పు నెల్లప్పుడున్.

ఈదండక మందలి నాయకుఁడు, ముద్దళ్ఘరినాథుఁడు. పాండ్య దేశాధీశ్వరులు నయిన నాయకరాజులలోఁ గుమార ముద్దువీరభూపతి కుమారుఁడును, బ్రసిద్ధుఁడునగు చొక్కనాథనాయకభూపాలుని సోద రుఁడునగు ముద్దళ్ఘరియేకాని యన్యుఁడు కాడని స్పష్టము. ఈముద్దళ్ఘరి యుదంతమును లింగనమఖి కామేశ్వరకవి చారిత్రమున వ్రాసి యున్నాఁడను. ఈప్రభువు మధురదేశమును క్రీ.శ. 1674 వ సంవత్స రములోఁ బరిపాలించి యుండినవాఁడు. కావున నీ వేంకటకవి యా కాలమునందున్నవాఁడనుటయు స్పష్టమే. అప్పటికీతనికి నలువదిసంవ త్సరములవయస్సు కలదని తలంచినచో నీతనికాలము క్రీ.శ. 1630–1680 నడుమదై యుండునని నిశ్చయింపవచ్చును. ఈవిద్యావతీ దండకమప్పటికి బయల్పడక యుండుటచే శ్రీ వీరేశలింగముపంతులు గారునునితరులును నీకవికాలము సరిగా నిర్ణయింపఁజాలకపోయిరి.



## 316. పుసులూరు సోమరాజుకవి

—*—

ఇతఁడాఱువేల నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు ఆత్రేయగోత్రజుఁడు.

ఈకవినిగూర్చి కవివంశీయుఁడగు పుసులూరి హనుమంతరావు పంతులుగారికిక్రింది సంగతులు తమతోఁ జెప్పినట్లు శతకకవుల చరిత్రి

కారులీతని చారిత్రమున వ్రాసియున్నారు. "ఈసోమరాజు వాస స్థలము ప్రారంభమున గుంటూరుమండలమునందలి పుసులూరు. అచ్చట నీకవి వంశవృక్షముకలదు. అందీతఁడు 'దేశాంతరగామి' యని వ్రాసియున్నారు. ఈతఁడు పుసులూరినుండి బయలుదేరి కృష్ణ దాటి భీమవరముతాలూకా 'ఉప్పలూరు' గ్రామమువచ్చి యచ్చట మాలదాసర్లు (నేటికి నర్చకులువారే) దేవునికర్చకులుగా నుండ మన కవి యాగుడిలోనికిఁ బోన సందేహింప నాతని కన్నులు పోయెను. అప్పుడీతఁ డా దేవునిపై గొన్ని పద్యములఁ జెప్ప నాతనికి దృష్టికలిగెను అంతటఁగవి దేవాలయమును బ్రవేశించి దేవుని దర్శించెనఁట! ఈతఁడు కృష్ణదాటి పోవుచుండ నొక కృష్ణసర్పము మణికాంతులతో రేయింబవళ్ళు కవికి మార్గముఁజూపుచు ముందుఁ బోవుచుండెనఁట! ఉప్పలూరునుండి తణుకుతాలూకా రేలంగి గ్రామమువచ్చి యచ్చట వేంచేసియున్న యప్పలనృసింహస్వామిపైఁ బద్యములుకొన్ని చెప్పి ప్రక్కనున్న 'ఇలింద్రపఱ్ఱు' గ్రామమగ్రహారముగాఁబడసి యచ్చట నివాసమేర్పరచుకొనెను. ప్రస్తుత మీగ్రామము శనివారప్పేట జమీందారులది. అన్యాక్రాంతమైనది. కవి వంశీకులే ప్రస్తుత మచ్చటనున్న పుసులూరి వారని చెప్పవచ్చును. ఆగ్రామ భవిష్య త్తిట్లుండునని కవికొన్ని పద్యములువ్రాసెను. ఆపద్యములలోనున్నట్లే కడచిన రెండుమూఁడువందల సంవత్సరములనుండియుజరుగుచున్నది.

ఈకవి ఇందూశతకము, నందనందనశతకము, బాలగోపాల శతకము నను మూఁడు శతకములను రచించెను. బాలగోపాలకృష్ణభక్తుఁడగుటచే నీతనిని 'బాలకృష్ణదాసు' అని పిలుచుచుండెడివారఁట. ఈతని తండ్రి ఉమాపతి, తల్లి పాపమాంబ.

ఇందుశతకము:—దీనికి చంద్రమౌళి శతకమని నామాంతరము. "ఇందూనందుని మందనుండి కదనీవే తెంచుటల్ రాకలన్" అనిదీనికి మకుటము. బిందుపూర్వకదకార ప్రాసతో ౧౧౬ శార్దూలవృత్తములుగల యీ శతకమునురచించిన మహాభక్తాగ్రేసరుఁడగు నీతని

పద్యములలో భగవంతునియందలి ప్రేమరసముప్పొంగి పొరలు చుండును. పౌర్ణమినాఁటి చంద్రునిఁజూచి, యాతనిని బృందావనమునుండి వచ్చినవానినిగా భావించి, బృందావనముయొక్కయు, నందలి గోపికలయొక్కయు, శ్రీకృష్ణునియొక్కయు క్షేమముల నారయుచు నెట్లైన శ్రీకృష్ణునిఁ దనకడకు దీసికొనిరమ్మని చంద్రునితోఁ జెప్పినట్లు రచించుటచే నీశతకమునకు చంద్రదూతశతకమని పేరువచ్చినది. ఇందుఁ గవి విరహిణియైన గోపికయైనాఁడు. ముగ్ధయగు స్త్రీ నాథుని యందుంచు ప్రేమమునకును, భక్తుఁడు పరమేశ్వరునియందుంచు ప్రేమమునకును భేదములేదు. ఆభావమునే కవి యీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

శా. మందన్ గోపికలింక నేను హరి బల్మాయన్ వినోదించి గో
 విందుఁ నాథునిగా వరించితిమి యా ప్రేతల్ నిజాభీష్టముల్
 పొందంజాలిరి నాకు నవ్విధమదే పుణ్యాంబునంగల్గునో
 యిందూ...... ౧౧౩

భక్తిరసావేశముచేఁ దన్మయత్వంబు నొందిన భక్తుని నోట నుండి వచ్చుపలుకులలో నమృత ముండును. సోమరాజుకవివాక్యము లట్టివి, ఇట్టి పరమభక్తులకు భగవంతుఁడెట్టయెదుటఁ గాన్పించుచుండును. కవి మనోభావమునుబట్టి భగవంతునిరూపము మాఱుచుండునో, భగవంతుఁడు గనుపరచు రూపమునుబట్టి కవి భావము మాఱుచుండునో, యాకవికే తెలియవలయును. ఆ యీశ్వరునకే తెలియవలయునుగాని యన్యులకు బోధపడదు. ఉండియుండి భగవంతుఁడదృశ్యుఁ డగుచుండును గాఁబోలు! అప్పుడేల గన్పడవు? ఎల దాఁవు? అని భక్తుఁడు విచారముతో, విసుగుతోఁ గోపముతో నడుగుచుండును. నిందించుచుండును. విసువుచెందుచుండును. తన్ను నిందించుకొనును. ఇతరభక్తులను జూచి యసూయచెందుచుండును. ప్రార్థించును. హృదయావేదనమునందును కవికిఁగలిగెడి యీభావములే పద్యములరూపమున వెల్వడి శతకములగుచున్నవి. ఈ

తన్మయత్వమునొందిన కవులశతకములే యుత్తమములు. అవియే పాఠకుల హృదయముల నాకర్షించును. వారి హృదయములయందు మాదృగలిగించును. వారినితరింపఁజేయును. సోమరాజుకవి శతకము లీతరగతిలోనివి. శైలి తెలియుటకై కొన్నిపద్యముల నిట వ్రాయుదును

శా. బృందారణ్యము సేమమా? యచటి గోబృందంబులున్ లెస్సలా
నందుండున్ సతియున్ సుఖాన్వితులె నానాగోపగోపాలికా
సందోహంబులతో హలాయుధుఁడుఁ గృష్ణస్వామి క్రీడింతురా? ౧

శా. ముందేనాఁడును జూడనట్టి హరిపై మోహంబు యాద్యచ్ఛకం
బందున్ దద్గతమయ్యెనామది పరాయత్తంబు గాదాత్మకున్
సందర్భం బొనరించి తేసి యిదిగో సాష్టాంగమున్ జేతునో ... ౬౨

శా. మందనాథ యెఱుంగకుండ వ్రజభామల్ కానకుండంగ గో
విందున్నెల్లని తోడి తెమ్మిటకు నేవీక్షించి నా సామికి
న్సందేశంబెఱిఁగించి తచ్చరణపూజల్ చేసి కైకొందునో ... ౧౦౭

ఈకవి గీతగోవిందము, శ్రీకృష్ణకర్ణామృతము మొదలగు భక్తిరసపూరితగ్రంథములను జదివి యానందించిన వాఁడని యీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

శా. బృందారణ్యమునందు రాధ కడుఁ గోపింపన్ మహాగీత గో
విందప్రోక్తకథాప్రకారములఁ దన్వీన్ వేఁడుకొన్నట్టి యా
నందాభీరకుమార చేష్టితము లానందంబుగాఁగంటివా? ... ౧౪

శా. ఛందోవీథుల సంచరించు హరి స్వేచ్ఛాక్రీడలన్ గోపికా
సందోహంబులఁగూడి యాడెనను వాచాప్రౌఢిమన్ వింటి మా
చందంబంతయుఁజూచివచ్చితె జగత్సాక్షిప్రమాసింధువా.. ౧౦

శా. ఎందున్ వేల్పులవార్తవిన్నపుడు మాకిష్టార్థమే కాని గో
విందుండైన యశోదపట్టి చరితల్ విన్నట్టుగా నున్నవే
యందుం గోకులవార్తలే చెప్పుము బ్రహ్మానంద సంధాయినై
... ౪౯

ఈతనిపద్యముల నుదాహరించుటలో మాలేఖినికిఁ దనివి గలుగుటలేదు.

ఈకవి క్రీ. శ. 1700 కంటె ప్రాచీనుఁడని శతకకవుల చరిత్ర కారులు వ్రాసియున్నారు. కాలనిర్ణయమునకు నింతకంటె నితరాధారము లేవియుఁ గానరావు.



## 317. గద్దె రామలింగకవి

— * —

ఇతఁడు "చోడ లింగమా" యను మకుటముతో నొక శతకమును రచియించెను. ఈ క్రిందిపద్యమువలన సీతనితల్లి పంచాక్షరి యనియు, తండ్రినాగయ్య యనియుఁ దెలియుచున్నది;

ఉ. దక్షత జంగమార్చన విధానము నూది పురాతన క్రియల్
ఈక్షితిలోనఁ జేసి పరమేశ్వర సేవకులైన గద్దె పం
చాక్షరి పుణ్యసాధ్వి ప్రియుఁడాగమవేత్తగు నాగభక్తుఁడ
న్మోక్షునివాసి నిత్యునకుఁ బుత్రుఁడు రామయలింగమైన వాఁ
డక్షయ కావ్యపుష్ప మహిమార్పణచేసెను జోడలింగమా!

శతకకవుల చరిత్రకారులీతనిగూర్చి యిట్లు వ్రాసియున్నారు. "ఈశతకమునకుఁ బరవాది గజాంకుశమని నామాంతరముంచెను. ఇందు సమస్త దేవతలు, దశావతారములు, మొదలగువారందరు శివునిఁబూజించినట్లు నిదర్శనములు వృత్తములుగా వ్రాసి చోడలింగని కంకితము చేసియున్నాడు. కృష్ణామండలమునందలి ఎర్నగూడెము తాలూకా ముఖ్యనగరమగు కోవ్వూరు గోపాదక్షేత్రమునందొక చోడలింగము కలదు. చోళుఁడుస్థాపించిన లింగము. చోడలింగమయి యుండును. కణ్వుఁడు, అగస్త్యుఁడు, సీత, బౌద్ధావతారము స్థాపించిన లింగములు క్రమముగా కణ్వలింగము, అగస్త్యలింగము, సీత

లింగము, బొద్ధలింగము నైనవి. కళ్యాగస్త్యలింగములపై వేర్వేఱు కవులువ్రాసిన శతకములుకూడకలవు. ఈతఁడు తనశతకము 14 వ పద్యమున బొండాడవాసుడ ననియు 15 వ పద్యమునఁ తలిదండ్రుల నామములను వివరించెను. ఇతఁడు (2) వ పద్యమునందు "నాగురుఁడగుసిద్ధరామ శివుఁగొల్చిరచించెదననియు (3) పద్యమున సుమ్మడిసిద్ధ రామగురుమూర్తి నీవని శంభులింగ నేనమ్మికతోడ నీదుచరణంబులపై నుతిసేయఁబూనితిన్'' అనియు గురువర్ణనమొనరించెను. ఈసిద్ధ రాముఁడు ప్రాచీన శివభక్తుఁడో మఱియొకఁడో తెలియదు. గురుఁవును శివరూపముగాఁ జెప్పుటచేనీతఁడు సరిగ సిద్ధరాముని కాలమువాఁడు కానక్కఱలేదు. శైవులు గురువులు మరణించిన నాలుగైదువందల యేండ్లకుఁ బూర్వులైనవారినిఁగూడ గురువులని భావించి వర్ణించుట కలదు. శ్రీపతి, పండిత మల్లికార్జున, కరికాలుఁడు మొదలగు ప్రసిద్ధ శైవులను వర్ణించియున్నాడు. ఇతడు నా జన్మస్థానమగు తణుకు తాలూకా 'సిద్ధాంతము గ్రామము'' నందున్న సీతలింగేశ్వరుని, తణుకు తాలూకాలో పారుచున్న 'గోస్తనది'నిగూడఁ బ్రశంసించుటచే నీతడు భీమవరముతాలూకా 'బొండాడ'వాసి యగుట సత్యమే కావచ్చును......బొండాడ వాసుఁడగు 'బంధుగ రామలింగపుత్ర విరచిత నగరేశశతకము మఱియొకటికూడఁ గనఁబడుచున్నది. సిద్ధ రామలింగనికంకితము. ఇదిబహుశ పై రామలింగకవిపుత్రుని శతకమై యుండును.

క. ప్రియభక్తులనుచు నైశ్యులు
ప్రియమునఁ బూజింపమీరు ప్రత్యక్షంబై
జయమైన వరములిచ్చితి
నయమున బొండాడనున్న నగరేశ శివా,'

ఈ బొండాడయందుఁ జోడలింగేశ్వరుఁడు లేడనియు, గద్దె వారుకూడ నెవరును లేరనియుఁ దెలియవచ్చినది. ఈతని కవిత్వశైలి తెలియుటకై క్రిందిపద్యము లుదాహరించుచున్నాడను.

ఉ॥ జంగమపాదతీర్థ ఘనసాగరమగ్నుఁడు లింగమూర్తి త
జ్జంగమమంచు గొల్చుచును సంగయదేవుని శిష్యరత్నమై
జంగమకోరికల్ నొసఁగుసమ్మతితో బసవేశమూర్తి నా
లింగమటంచుఁగొల్చి కృతిలీలరచించెద చోడలింగమా.

ఉ॥ పంచముఖుండు దైవమని పాటిగ నందుకుఁ బ్రత్యయంబు చూ
పించెదనందు వైష్ణవులుఁ బేర్కొనిచూడ మహాద్భుతంబుగా
సంచితమైన కాశిపురి శంభుపదాబ్జము విష్ణుపాల మం
దుంచిన పండితేశ్వరుని యొప్పుగ మెచ్చిన చోడలింగమా.



## 318. శ్రీపతి భాస్కరకవి



ఇతఁడు "చిత్తమా" యను మకుటముతో దన జిత్తమును సంబోధించుచు ౧౦౦ మత్తేభశార్దూల వృత్తములుగల చిత్తశతకమును రచించెను. ఈనూఱు పద్యములలోను గవినామము నాకుఁ గనఁబట్టలేదు. గ్రంథాంతమందు 'శ్రీపతి భాస్కరకవి ప్రణీతమగు చిత్తశతకము సంపూర్ణము' అని వ్రాయఁబడియున్నది. అందుచే నిది శ్రీపతి భాస్కరకవి కృతమని చెప్పఁబడుచున్నది. శతకాంతమం దీక్రింది పద్యమొకటి గనఁబట్టుచున్నది.

క. వృద్ధాచార శ్రుతినుత
పద్ధత్యను భవనియుక్తి భాస్కరకృతి త
ద్బౌద్ధుల నాక్షేపించు ప్ర
బుద్ధుల కీశతకమిచ్చు ముక్తిన్భుక్తిన్ … ౧౦౧

దీనినిబట్టి బౌద్ధమతము నాక్షేపించువారికి సమాధానముగా నీశతకమును గవి రచియించినట్లు స్పష్టమగుచున్నది. శ్రీపతి వారు మొదటినుండియు, వీరశైవులు. శ్రీపతి పండితయ్య, వీరశైవపండిత

త్రయములో నొకఁడు. ఈభాస్కరకవి యేవంశజుఁడనని చెప్పుకొన లేదు. కాని యాతఁడా వంశజుఁడేయైనచో బౌద్ధమత నిరసనులగు తమ వంశమువారి మర్యాదనువిడచి, తాను బౌద్ధమతమును గౌరవింపఁబూనుట కేమిహేతువో తెలియకున్నది. తాను వీరశైవుఁడు కాకపోవచ్చును. బౌద్ధమతమునందాదరమును జూపినఁ జూపవచ్చును కాని వేదములను స్మృతులను, తత్ప్రవర్తకులను నిందించుటకుఁ గారణము గానరాకున్నది. కవి పండితుఁడుగాని సామాన్యుఁడు కాఁడు. అట్టివాఁడిట్టి కార్యమునకుఁ బూనుకొనుట వింతగానేయున్నది. శ్రుతి స్మృతులపేరిట దంభాచారములయందుఁ బ్రవర్తించువారిని వేమన వలె నిందించిన నందు విశేషము లేదు. కేవలము వేదవిహిత ధర్మములను నిందచేయుటచే నీకవికి బౌద్ధమతమునందు నమ్మకముకుదిరి తన భావముల నీశతకరూపమున వెల్లడిచేసియుండునని తోఁచుచున్నది. అయినను ఇతఁడుద్బోధించిన బౌద్ధమతమునకును, అద్వైతమతమునకును విశేష భేదమున్నట్లు గానరాదు. వేదవిహితకర్మలయందితనికి నమ్మకములేదు. ఉపనిషన్మతమునకును నీతనిమతమునకును గొంత భేదమున్నను నదిసమన్వయింపఁ దగిన స్వల్పభేదమని తోఁచుచున్నది. ఆంధ్రభాషలో నితరమతములను బోధించుపద్యకావ్యములు కొన్ని స్వల్పముగా నున్నవి కాని ఆర్యమతగ్రంథనిరసనము నింతగా నని చేయలేదని మొట్టమొదటఁదోఁచును గాని పరిశీలించినచో నతఁడార్యమతధ్వంసమునకుఁ బూనుకొనలేదనియు నుపనిషన్మత రహస్య సిద్ధాంతమును బోధించుటలోఁ దీవ్రమును జూపుటకై వేదవిహిత ధర్మములను, నిందించెననియు బొడఁగట్టఁగలదు. అందులకీతఁడు కృత్యాదిని రచించిన రెండు పద్యములు నిదర్శనములు. అవి యీక్రింద నిచ్చుచున్నాఁడను.

శా. శ్రీవాణీ గిరిజా రమాధిపతులన్ సేవింతు నల్లప్పుడున్
నీవాంఛల్స ఫలంబులయ్యెనొ జగన్నిర్మాణచాతుర్య యు
క్తా ప్రావీణ్యంబధిక ప్రశస్తిగనెనో భాషింపు నీతోడఁ బ్రి
స్తావింపన్సమకట్టి యిప్పుడును సంధానించెదన్ జిత్తమా! ౧

ఉ. శ్రుతిగీతోపనిషద్ర దహస్యవచనాస్తోకార్థ తాత్పర్య ప
ద్ధతు లాచార్య పదారవిందయుగ సద్భక్తిన్సదా నిష్ఠతో
వ్రతములు ప్పూజలు యాగయోగములె గావాయించు వాదింతు సి
ద్ధితి స్వాభావికమో స్వకల్పితమొ చర్చింపంగదే చిత్తమా! ౨

ఈ పద్యములను జదివినవారి కీతని హృదయము, వీరశైవ వీరవైష్ణవ, ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత మత చర్చలతో విసిగి పోయి, వాని సారమునుగ్రహించి తనకుఁ గలిగిన యనుభవమును స్వాభావికాద్వైతమను పేరున తన చిత్తమునే సంబోధించుచు నీశతకమున దెలిపియున్నట్లు కన్పట్టుచున్నది. ఈక్రిందిపద్యములోఁ గవి యీవిషయమునే ప్రస్తావించినాఁడు.

శా. తర్కవ్యాకరణాది శాస్త్రములు వేదవ్యాసవాక్యార్ధముల్
కోర్కుల్ దీరఁగఁజూచి చెప్పితి విదే గూఢార్థమాకామ్య సం
పర్కంబెన్నడు పొందఁబోకుము యసంబంధార్థబోధంబు లీ
తర్కంబౌనదియేల! భాగ్యమహిమన్దల్కొందుమా చిత్తమా! ౭౭

ఈకవి బౌద్ధమతవ్యాప్తికై యీశతకమును రచించెనని పాఠకులనుకొనెదరని యీవిషయమున నింతదూరము వ్రాసితిని. కవి యుద్దేశమును సంపూర్ణముగా చర్చించుట కిట తావుచాలదు. శతకమంతయుఁ బరిశీలించి చదివిగాని పాఠకులెట్టియభిప్రాయమునకు రాఁగూడదు. అయినను దిఙ్మాత్రసూచకముగఁ గవియుద్దేశమునుదెలుపు పద్యములు కొన్ని యీక్రింద నిచ్చుచున్నాఁడను.

మ. సమయస్ఫూర్తి స్వకార్యతత్పరత స్వేచ్ఛాలాపముల్ కొన్ని ప
న్నిమనుష్యాళికిఁ గుండగోళకకథల్ నీతుల్ప్రకల్పించు పం
చమవేదోక్తులఁ బంచమోక్తులుగ నెంచన్వచ్చు నూహింప మొ
త్తముకై వర్తకుల ప్రపంచమదిగాదా తెల్పుమాచిత్తమా! ... 3

శా. తాటాదూటపు బూటకంబులగు గాథల్బౌద్ధ లాచార్యు ల
య్యాటోపంబులఁదామె బ్రహ్మమనుచుంద్రాలాటివాచాటముల్

నీట వ్రాసిన నీటుమాటలుసుమీ నిక్కమ్ముగా నమ్ము మీ
యాటల్పాటలు ఛీవృథాయని స్వభావాద్వైతమా చిత్తమా! ౭౨

శా. వేదంబుల్మనుజుల్ రచించి రతిపారీణ్యంబుతో శాస్త్రముల్
తాదృక్పద్ధతి నుద్భవిల్లెదపముల్ దానంబులుం ధర్మముల్
మోదంబబ్బును జేయుడంచు నగులన్ బోధింతురవ్విప్రులే
కాదాజంబుక యుక్తులెల్లకు వివేకానందమా చిత్తమా! ౭౩

మ. నినుతాబొమ్మల వేడుమంటివె నైవేద్యంబు పారాయణం
బును గావింపుమటంటివే యిలజనంబుల్మెచ్చగా పాడు మం
టివె ప్రొద్దుంగని మ్రొక్కుమంటివెవిటె వింటేనినున్న స్వర్లోక గ
న్గొని సౌఖ్యంబును బొందుమంటివిక సంకోచింపకే చిత్తమా! ౭౪

మ. కలలోఁ గన్నపదార్థముల్ నిజముల్గా కన్పట్టునే సికు న
ట్టుల విశ్వంబు నసత్యమంచుఁ గనుమట్లుంగాక యూదర్శమం
దలి వస్తుప్రతతింగనంగనగునే తోయంబుల న్వ్యాతగా
నలవాటొప్పఁగ జేయఁగానగు స్వభావాద్వైతమా చిత్తమా! ౭౫

శా. నీకంటెన్పరమెద్దియుణ్ గలుగునే నీవేసుమీ సర్వముణ్
నీకవ్యాజము నిష్కళంకమగు నిర్ణిద్రప్రభానంబు స
త్యాకల్యంబుగఁ గల్గియుండుటయె మోక్షంబునన్నతిస్థానమై
ప్రాకట్యంబుగ నిశ్చయార్థము స్వభావాద్వైతమా చిత్తమా! ౭౬

చ. ఆర్యమతంబులిట్టివి సమాహితయుక్తి నిజూడు శంకరా
చార్యుఁడు మధ్వరాయఁడును సన్నుతలక్ష్మణయోగివర్యుఁడుణ్
ధైర్యముతో మెలంగఁగ మతంబులొనర్చిరిగాని వేఱుగా
ధర్యమతేజమన్నిట సమాదరణంబగుఁజూడుచిత్తమా! ౭౭

శా. పైత్యవ్యాధునకున్ జగద్భ్రమణమై భాసిల్లుచందంబునన్
స్తుత్యంబౌనిను నీవయేమరినచోఁజూపట్టు లోకంబులుణ్
నిత్యానిత్య వివేకివై సుగుణివై నిర్వ్యాజమానోహరా
హిత్యానందసు సిద్ధఁబూనికను మెంతే మోదమా చిత్తమా! ౭౮

ఈకవి 17 వ శతాబ్దివాఁడై యుండును.

---

## 319. ధూర్జటి లింగరాజు



ఈతఁడు పాకనాటి నియోగిబ్రాహ్మణుఁడు; ఈతని యింటి పేరేదో తెలియదు. కృష్ణదేవరాయని యాస్థానమున "స్తుతమతియైన యాంధ్రకవి"యని పేరుగాంచిన ధూర్జటి వంశములోనివాఁ డగుటచే నీతనిని ధూర్జటి లింగరాజని శీర్షికలోఁ జేర్చియుంటిని. ఈ లింగరాజకవి తండ్రి కృష్ణవిజయమును రచించిన కుమారధూర్జటి అని యీ క్రింది పద్యములోఁ జెప్పుకొనియున్నాఁడు.

సీ. శ్రీకాళహస్తీశ సేవనాన్వితచిత్త
　　　　చిత్తజాకరసలక్ష్మీవిహార
　రమణీయశీల భారద్వాజగోత్ర ప
　　　　విత్రయాపస్తంబసూత్ర మహిత
　ధూర్జటివంశపాథోధి చంద్రకుమార
　　　　ధూర్జటినామ విస్ఫూర్జితాంక
　స్తుతిమతి వేంకటపతి తనూభవ లింగ
　　　　రాజకులేంద్ర ధైర్యాచలేంద్ర.

ఈలింగరాజకవి పెదకాళహస్తిమహాత్మ్య మను పద్యకావ్యమును రచించి కాళహస్తి ప్రభువగు దామెర్ల యక్కప్పనాయని పుత్రుఁడగు వెంకటపతిరాయని కంకితము చేసియున్నాఁడు. ఈ వెంకటపతి కాలమేదో నిశ్చయముగాఁ దెలియరాలేదు. కవి తండ్రియైన కుమారధూర్జటి క్రీ. శ. 1550-60 ప్రాంతమున గ్రంథరచనముచేసి యుండెనని యాతని చారిత్రమున వ్రాసియుంటిని. ఈపెదకాళహస్తిమాహాత్మ్యరచనాకాలము 1700 ప్రాంతమునినిర్ణయింపవచ్చును. ఈకవికుమారుఁడైన వెంకటరాయకవి రత్నావళీపరిణయమను ప్రబంధమును రచియించి యుండెను. ఈతని చారిత్రమును రాబోవు సంపుటమున లిఖించెదను. రత్నావళీపరిణయమున నీవెంకటరాయకవి తనతండ్రియైన యీలింగరాజకవి నిట్లు నుతించియున్నాఁడు.

మ. ఘనగౌరీశ కటాక్షలబ్ధ కవితాగాంభీర్యసంతుష్ట భూ
జనిరాడ్దత్త సువర్ణచేల మణిభూషాగ్రామ పల్యంకికా
ఘనదంతావళఘోటకాది బహుసత్కార ప్రతిష్ఠాత్ము మ
జ్జనకున్ ధూర్జటిలింగరాజకవిరాజశ్రేష్ఠుఁ గీర్తించెదన్.

పెదకాళహస్తి మహాత్మ్యము నాకు లభింపలేదు. అందుచే మచ్చుపద్యముల నీయలేదు.



## 320. తాళ్ళపాక శ్రీనివాసుఁడు



ఈకవి నందవరీకబ్రాహ్మణుఁడు. సుప్రసిద్ధ కవిశిరోమణి తాళ్లపాక అన్నమయ్య వంశములోనివాఁడు. అతని కెంతతరము వాఁడో తెలియదు. ఈతఁడు "లక్ష్మీవేంకటేశ్వర సీసపద్యములశతక" మొకటి రచియించెననియు దాని యముద్రిత ప్రతియొకటి సాహిత్య పరిషత్తునందు కలదనియు నందలి కవిత్వము శ్రేష్ఠమైనదికాదనియు వ్రాయుచు నీతనినిగూర్చి శతకకవుల చరిత్రకారులు వ్రాసిన వాక్యములఁ గొన్నిటి నీక్రింద వ్రాయుచు నీతని చారిత్రమును ముగించుచున్నాడను.

"ఈ శతకముల సంపుటము వ్రాతప్రతి తాళ్లపాకవారి కుటుంబమునుండి వచ్చినది ఇది సంపాదించిన జయంతిరామయ్యపంతులుగారీ శతకముపై నిట్లాంగ్లేయభాషలో వ్రాసిరి. దానిభాషాంతరీకరించి చూపెదను. "తాళ్లపాక కవులు వ్రాసిన శతకముల వ్రాతప్రతి సంపుటము నాకు 14 యేండ్ల బాలుఁడైన తాళ్లపాక శేషాచార్య (తిరుపతి) లిచ్చెను.

ఈకవి రచించిన శతకమునందలి యీక్రింది పద్యమును శతక చరిత్రమునుండి గ్రహించినాడను.

సీ. అలరు తాళ్ళపాక యన్నమాచార్యుల
గర్భాబ్ధిరాకాసుధాకరుండు
తిరుమలగూాజినావరలు సత్పుత్త్రిల
వరుసతోఁ బంచాయుధాళి, వరుస
పుత్త్రిపంచకమును బుణ్యాంగనొక్క-ర్తు
గలిగి శ్రీహరి కృపగాంఛఁ గలిగి
మానిని యలమేలుమంగ నాంచారిని
వేంకటగిరిపతి విచ్చరధిక

గీ. మోదమున బెండ్లిఁ గాంచి సమ్మోదలీల
వదలకను దాసజన సువా...సు డనగ
కమలవసుధేశ సర్వ యుగాధిపేశ
విమలశశికోటిసంకాశ! వేంకటేశ!

ఈకవికాలమెరుంగనైనది కాదు. ఈశతకమును నేనుఁజూడను లేదు.

—:—

# 321. వేదాంతాచార్యులు కవితార్కిక



ఈతనినిగూర్చి గోలకొండకవుల సంచికయం దీతఁడు బహు గ్రంథనిర్మాతయనియు, చతుస్తంత్రి వేత్తయనియు, క్రీ. శ. 1694 ప్రాంతమువాడనియు నిజామురాష్ట్రమందలి మంచాలకట నివాసు డనియు వ్రాసియున్నారు. ఈతని గ్రంథములలో నేదియు నాకు లభ్యముగా లేదు.

—:—

## 322. కర్పూరము కృష్ణమాచార్యులు

ఈకవి భగవద్గీతను ద్విపదగా రచియించి, చర్లపల్లి కేశవున కంకితముగావించెను. చర్లపల్లియే కవినివాసము. ఇది నిజామురాష్ట్రములోని నల్లగొండమండలములోనిది. కవికాలము క్రీ. శ. 1650 ప్రాంతమని గోలకొండకవుల సంచిక తెల్పుచున్నది. ఈగ్రంథము నాకులభింపలేదు. కవినిగురించి యితరవిషయములు దెలియరాలేదు.

## 323. లక్ష్మీ నరసింహాము

గోలకొండకవుల సంచికయం దీకవిని గురించి యీక్రింది విషయములు గలవు. ఈతఁడు గద్వాల నివాసి. నృసింహవిలాస మను గ్రంథమును రచించెను. క్రీ. శ. 1650 ప్రాంతమున నుండినవాఁడు నరసింగమయ్యయని యీతనికి నామాంతరము. ఈతని గ్రంథము నాకు లభింపలేదు. ఈతనినిగూర్చి యితరమేదియుఁ దెలియరాలేదు.

## 324. నెల్లుట్ల నారాయణకవి

ఇతఁడు నిజామురాష్ట్రమునందలి బమ్మెరవాస్తవ్యుఁ డనియు బమ్మెరపోతరాజు వంశములోనివాఁ డనియు క్రీ. శ. ౧౬౦౦ సంవత్సరప్రాంతమున నుండి వజ్రాభ్యుదయమను ప్రబంధమును రచియించెననియు, గోలకొండకవుల సంచిక తెల్పినది. ఈ వజ్రాభ్యుదయము నాకు దొరకలేదు. ఈకవినిగూర్చి శ్రీ వీరేశలింగము

పంతులుగారు తమ యాంధ్రకవుల చారిత్రమున బమ్మెరపోతనామాత్యుని చరిత్రమునం దిట్లు వ్రాసియున్నారు.

"శేషాద్రి రమణకవుల కృష్ణాపత్రికలో నెల్లుట్ల నారాయణ కవినిగూర్చి వ్రాయునప్పుడును తత్పూర్వమున నెల్లుట్ల నృసింహరావు గారినిగూర్చి వ్రాసినప్పుడును వారు బమ్మెరపోతరాజు వంశమువారని వ్రాసియున్నారు. ఈకథ యెంతమాత్రమును విశ్వాసార్హమయినది కాదు. బమ్మెర పోతనామాత్యుని సంతతివా రాజు వేలనియోగి శాఖవారు; నెల్లుట్లవారు గోలకొండ వ్యాపారి శాఖవారు; బమ్మెర వారు శైవులు; నెల్లుట్లవారు వైష్ణవులు; పదునాఱవ శతాబ్దమునకుఁ గడపటిభాగముననో పదునేడవశతాబ్దారంభముననో యుండిన నారాయణకవి పూర్వులు మొదట రాజభండారమువారయి తరువాత నెల్లుట్ల వారయిరట! ౧౬౩౬వ సంవత్సర ప్రాంతమునందుండిన యజ్జరపు పేరయలింగము (ఒడయనంబివిలాసకర్త) బమ్మెరపోతరాజునకు నాల్గవతరమువాడయిన కేసకవియొక్క కూతురైన యల్లమను వివాహమాడుటచేతఁ బోతన సంతతివారు పదునేడవ శతాబ్దారంభమునందుగూడ నెల్లుట్లవారుగామారక బమ్మెరవారుగనే యుండిరనియు శైవులతో సంబంధములు చేసికొనుచుండిరనియు నొడయనంబివిలాసములోని యీక్రింది పద్యమువలన స్పష్టముగాఁ గనబడుచున్నది.

ఉ. బమ్మెర వంశమందునను బ్రౌఢ సరస్వతి పద్మగాంచి తా<br>
నమ్మదలిర్పఁ గేసనకవీశ్వరు డప్పమనామ సాధ్వియం<br>
దిమ్మహిఁ గూర్మిఁగన్నసుత యెల్లమయందును పేరయాఖ్యుఁడన్<br>
సమ్మతిగంటి వీరసరసమ్మను గంగనమంత్రియుగ్మమున్.

బమ్మెరపోతనామాత్యుఁడు భాగవత రచనాప్రారంభకాలమునకే బమ్మెరను విడిచి యేకశిలానగరమును జేరెను. బమ్మెరవారికిని నెల్లుట్లవారికిని కౌండిన్యగోత్రసామ్య మొక్కటితక్క వేరుసంబంధ మేదియు లేదు. పదునాఱవశతాబ్దాంతమునందు బమ్మెర ప్రౌఢ సరస్వతి

పుత్రుఁడు కేసన్న రచించిన హైమావతీవివాహోవతారికవలన సహిత మీయంశములు దేటతెల్లమగును.'' ఇందలి చర్చతో మనకు సంబంధము లేదు

## 325. తిరునగరి వెంకటాచార్యులు

ఇతఁడు ''యతిపతీహనుమద్గిరిరాజమందిరా'' యనుమకుటముతో విశిష్టాద్వైతమతప్రబోధకమగు నొకశతకముఁ రచియించెను. మకుటమునుబట్టి కవినివాసము హనుమకొండయని తోఁచుచున్నది. ఈ కవి వంశీయులిప్పుడు రాయపర్తిలో నుండిరనియు కవి ౨౫౦ సంవత్సరములక్రిందటివాఁడనియు గోలకొండకవులసంచిక యందున్నది. ఈతఁడు శతకకవుల చరిత్రకెక్కలేదు. ఈశతకము నాకులభింపలేదు.

## 326. గోపమంత్రి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భరద్వాజగోత్రుఁడు. సింధుమతీవిలాసమను శృంగారప్రబంధమును రచించెను. సింధుమతియను వేశ్యకును జయుఁడను యువకునకును నడచిన శృంగారలీలలను దెలుపుచు నీకావ్యము రచియింపఁబడియెను. ఇతనినివాసము గార్ల. ఈకవి క్రీ. శ. 1700 ప్రాంతము వాఁడు. ఈవిషయములు గోలకొండకవుల సంచికనుండి గ్రహింపఁబడినవి.

## 327. మల్లికార్జున సిద్ధయోగి

—※—

ఇతఁడు గౌడపురాణమును ద్విపదకావ్యముగా నాల్గాశ్వాసములలో రచియించెననియు నీతఁడు క్రీ. శ. ౧౭౦౦ ప్రాంతమున నున్నవాఁడనియు, గోలకొండకవులసంచిక వ్రాసినది. ఈగ్రంథము నందుఁ గొలనుపాకలో గౌడమతస్థాపనఁ జేసిన యంశము గలదఁట! ఈకవినిగూర్చి యితరవిషయము లేమియు తెలియరాలేదు.

